అపరాధ పరిశోధన అనుబంధం—102

# కొడుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## నూతన వధువు హత్య
రచన : సికిందర్

## నూరు గ్రామాలకు దొంగ
రచన : వసుంధర

## దయ్యం చేసిన హత్యలు
రచన : విశ్వమోహిని

## కామ పిశాచం
రచన : టెంపోరావ్

రక్తం త్రాగే పిశాచం - చివరి భాగం

రక్తపు టేర్లు - మొదటి భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—102
జూన్, 1982
వెల: రు. 5-00
ఏడాది చందా: 60 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# నూతన వధువు హత్య

## సికిందర్

ఇన్స్పెక్టర్ బాలకృష్ణన్ పలికాడు ఫోన్లో అవతలి నుంచి ఆందోళనగా, "మిష్టర్ లాల్, మర్డర్!"

లాల్ మౌత్ పీస్ని చేత్తో కప్పి, జాన్ వైపు తిరిగి అన్నాడు, "పార్ట్నర్, మర్డర్!"

వార్తాపత్రికలోంచి తలెత్తి చూసి జాన్, "ఐసీ.... ఎవరి మర్డర్?" అని ప్రశ్నించాడు.

లాల్ అడిగాడు తిరిగి ఫోన్లో. "ఎవరి మర్డర్, కృష్ణన్? ఎక్కడ జరిగింది మర్డర్?"

"దిలీప్ నగర్లో, మిష్టర్ లాల్" చెప్పాడు కృష్ణన్. అడ్రసు చెప్పి మళ్ళీ అన్నాడు, "ఈ ఇంటి కోడలి హత్య....మీరు వెంటనే వస్తారా, లాల్? ఇక్కడ ఎవిడెన్స్ ఆవిరై పోతోంది...."

"ఎవిడెన్స్ ఆవిరై పోతోందా?"

"ఓహ్, అడుగుజాడలు ఆరిపోతున్నాయి...."

"వెల్, వెల్! ఎవరి అడుగుజాడలు, కృష్ణన్?"

# 4

"హంతకుడివి, ఆ ఫ్ కో ర్స్. బాత్‌రూము నించి హాలులో మేడ మెట్లవరకూ వున్నాయి .... నీటిలో తడిసినవి .... పురుషునివి .... హాలులో మెట్ల దగ్గర అవి ఆగిపోయాయి ...."

"అక్కణ్నించీ ఏమయ్యాయి?"

"తెలీదు! అక్కడ అంతమయ్యాయి, అంతే!"

"అయితే మరి మీరు___"

"అయితే మరి నేనేం చేయాలో నాకు తెలుసును, మాస్టర్జీ. అదృష్టవశాత్తు ఇంట్లో బ్లాటింగ్ పేపరు దొరికింది.... దాన్ని ఇంకా ఆరని___బాగా తడిగా వున్న జాడమీద అద్ది, అది పీల్చుకున్న నీటిలో ఏర్పడ్డ పాదం ఆకారం చుట్టూ పెన్సిల్‌తో లే అవుట్ గీశాను. ఎవిడెన్స్ సేకరించాను."

"వెరీ వెల్! యువర్ బ్రెయిన్ ఈజ్ ఎ బుల్లెట్ బ్రెయిన్, మిష్టర్ కృష్ణన్."

"థాంక్యూ, ఫ్రెండ్! మీరు వెంటనే వస్తారా ఇక .... వీటిని చూస్తే మీకేదైనా క్లూ దొరకవచ్చు...."

"మీకింకేం దొరికింది? ఆ అడుగు జాడలెలా వున్నాయి? పాదరక్షలవా? ఒట్టి పాదాలవా? అడుక్కీ అడుక్కీ మధ్యదూరమెంత? నడకతీరు ఎలా వుంది___ చిన్నపిల్లలు తప్పటడుగులు వేసినట్లా? సైనికుడు మార్చ్ చేసినట్లా?"

"సైనికుడు మార్చ్ చేసినట్లే అనుకోవాలి. అడుగు జాడలు వొట్టి పాదాలవి. అడుగుల మధ్య దూరం మూడడుగులుంటుంది. ఇక మీరు వెంటనే వస్తే___"

"వెల్, వచ్చి చూడడంకంటే కృష్ణన్ ___ చెప్పి రావడం నాకలవాటు. ఎలాగూ మేం వచ్చేలోగా

అవి ఆరిపోయి వుంటాయి. కాబట్టి, మీరా జాడలమీద ఒక్కసారి నడచి చూడండి—"

"చూసి—?"

"నడకెంత టైము తీసుకుందో చూడండి—"

"హంతకుడు ఎంత వేగంతో నడిచాడో నాకెలా తెలుసు?"

"మీరే హంతకులైతే ఎలా నడుస్తారో అలా నడవండి!"

"ఓహ్—"

"అలాగే బాత్ రూమునుంచి, ఆ హాలులో మెట్ల వరకు దూరం కొలిచి—ఎన్ని జాడలు పడ్డాయో లెక్క తీసుకోండి."

"ఓహ్, ఏమిటీ విపరీతం!"

"హత్య జరగడం విపరీతం కాదా? అసలెలా జరిగిందది?"

"స్నానానికెళ్తే బాత్రూములో గొంతు పిసికి."

"వయసు? ఫిజికల్ బిల్ట్?"

"వయసు ఇరవై మించదు. కోమల దేహం. మూడు నెలలే అయింది — కోడలిగా వచ్చి. నా ఉద్దేశం పెళ్ళి జరిగి."

"గాడ్....కట్నం గొడవ ఏదైనా....కృష్ణన్...."

"కాదు, కాదు. ఇక్కడందరూ మంచివాళ్ళలా ఉన్నారు. అత్తా మామలు దయామయుల్లా వున్నారు."

"అలాగే కనిపిస్తారు కృష్ణన్, అంతా అయిపోయాక. మీకు తెలియదా? ఇంటి సభ్యులెందరు?"

"అయిదుగురు—కోడలుగాక. ఇంకిద్దరు పనిమనుషులున్నారు."

"బాత్ రూం తడిగా వుందా?"

"బాగా నీరు నిలిచి వుంది."

"వెల్, ఇంట్లో అందర్నీ ఒకచోట చేర్చి ప్రశ్నలు నో, నో—వారి పాదాలు పరిశీలించండి ముందు. ఎవరి పాదాలు తడిసి వుంటాయో, లేక అంతకముందు తడిసి వున్నాయని తోస్తాయో, ఆ పార్టీని పట్టుకుని ప్రశ్నించండి గట్టిగా—"

"ప్రశ్నించి—?"

"ఆ పాదాలెలా తడిశాయో కనుక్కోండి."

"సారీ, ఇక్కడ అందరి పాదాలు తడిసే వున్నాయి" కృష్ణన్ విచారంగా అని ఫోన్ పెట్టేశాడు.

## 2

ఆమె శవం బాత్ రూంలో పడివుంది బోర్లా.

బాత్ రూంలో అంగుళంమందం నీరు నిల్చివుందింకా. నీరుపోయే రంధ్రం చిన్నదిగా ఉండడంవల్ల మట్టం నెమ్మదిగా తగ్గుతోంది. మొత్తం రెండున్నరంగుళాల లోతు నీరు మడుగు కట్టిందని చుట్టూ తడిసిన గోడలు చెప్తున్నాయి. ఇంకో అంగుళం ఎక్కితే గడప ఎక్కి అవతల వరండాలోకీ, ఇవతల అటాచ్ డ్ లెట్రిన్ లోకీ ప్రవహించేవి.

షవర్ ఈ నీటిమడుగుని ఏర్పరచింది.

ఆమె ఎనిమిది గంటలకి బాత్ రూంలోకి వెళ్ళింది, స్నానానికి. అది సుధ గమనించింది, ఆమె ఆడపడుచు. ఎనిమిదింపావుకి ఆమె మామగారు బయల్దేరాడు స్నానానికి. కానీ తలుపు మూసివుండడంవల్ల, లోపల నీటి శబ్దం విన్పిస్తూండడంవల్ల అతను తిరిగి వచ్చేశాడు. ఆ తర్వాత అయిదు నిమిషాలకి ఆమె భర్త ఉమేష్

వచ్చాడు. అతనికీ అలాంటి పరిస్థితే ఎదురై వెళ్ళిపోయాడు. సుధ చెప్పింది వాళ్ళిద్దరికీ, పద్మజ స్నానానికి వెళ్ళినట్లు.

కానీ, ఇంకో పావుగంట గడిచినా ఆమె రాలేదు. అప్పుడామె మామగారు మరోసారి విసుక్కుంటూ వెళ్ళి తలుపు కొట్టబోతూ అది మర్యాద కాదని ఆగి చెవులు రిక్కించి విన్నాడు. లోపల ఇందాకటి నీటి శబ్దం లేదు. మరే అలికిడి లేదు. అప్పుడతను తలుపుని చిన్నగా నెట్టి చూస్తే, అది క్రమంగా తెరుచుకుంటూంటే, గాభరాపడి వెనుదిరగబోయాడు. కానీ అతని దృష్టి లోపల నేలపైపడి ఆగిపోయాడు. లోపల నీరు బాగా మడుగు కట్టివుంది.

అప్పుడు—అతను తలుపు మరికొంచెం తెరచినప్పుడు, లోపలినుంచి ఎటువంటి అభ్యంతరం లేకపోగా, కదలిక కూడా లేకపోవడంతో, అతను ధైర్యంచేసి పూర్తిగా తెరచి లోపలచూసి, కొయ్యబారిపోయాడు.

పద్మజ కుడివైపు మూలగా నీటిలో పడిపోయి వుంది.

అతని కేకలు విని వంటింట్లో టిఫిన్ తయారుచేస్తూన్న భార్యా, కూరలు తరుగుతున్న కూతురు సుధ, డ్రాయింగ్ రూంలో పేపరు చూస్తున్న ఉమేష్, బావిదగ్గర అంట్లు తోముతున్న పనిమనిషీ, చెట్లకు నీరుపోస్తున్న పనివాడూ అంతా పరుగెత్తి వచ్చి చేరారు.

ఇన్స్పెక్టర్ కృష్ణన్ వచ్చినప్పుడు వాళ్ళంతా బాత్ రూంలో ఆ మూల శవంచుట్టూ మూగి రోదిస్తున్నారు.

వాళ్ళంతా అక్కడ నీటిలో తడిసిపోయారు, మోకాళ్ళవరకూ.

కృష్ణన్ — బాత్ రూంలోకి వస్తూనే అక్కడ్నుంచి

ఇంట్లోకి వెళ్తూన్న అడుగుజాడల్ని గమనించాడు. అవి, వరండా దాటి గదిలోకి, అక్కడ్నుంచి హాలులోకీ వెళ్ళి, మేడమీదికి వెళ్ళే మెట్లదగ్గరాగిపోయాయి.

కృష్ణన్ ప్రశ్నించినపుడు బాత్ రూంలోకి వచ్చాక ఎవరూ బయటికి పోలేదని చెప్పారు, ఒక్క ఉమేష్ తప్ప. అతను పోలీసులకి ఫోన్ చేయడానికి ముందు గదిలోకి వెళ్ళి వచ్చాడు. అతను ఫోన్ చేసి ఇరవై నిమిషాలైంది. కనుక, అతను వెళ్ళినప్పుడేర్పడ్డ జాడలన్నీ ఎప్పుడో ఆరిపోయి వుంటాయి. ఇవి తాజా జాడలు.

కృష్ణన్ ఒక అడుగుజాడని ట్రేస్ చేసి, అవెంత సేపటి క్రితం ఏర్పడ్డాయో తెలుసుకుందుకు అప్పుడే, అక్కడే, అదే వాతావరణంలో, అదే నీటి పరిమాణంతో, సార్జెంట్ నవీన్ చేత అడుగుజాడ సృష్టించి, అది సరిగ్గా ఎనిమిదిన్నర నిమిషాలకి పూర్తిగా ఆరిపోయిందని నోట్ చేసుకున్నాడు.

అసలు జాడలు అతను వచ్చిన అయిదున్నర నిమిషాలకి ఆరిపోయాయి.

అంటే అవి మూడు నిమిషాల క్రితమే ఏర్పడి వుండాలి.

అతను 8-55కి వచ్చాడు. కాబట్టి ఆ జాడలు 8-52కి ఏర్పడి వుండాలి.

8-52కి బాత్ రూంనించి ఒకరు బయటికొచ్చారు. ఎవరు?

డాక్టర్ రఘునాథ్ శవాన్ని పరీక్షించి చనిపోయి నిమిషాలే అయిందని చెప్పాడు. సుమారు ఎనిమిది గంటలకి, ఆమె గొంతు నులిమి చంపబడింది. ఆమె లోపలికి వచ్చీరాగానే దాడి జరిగివుండాలి. ఆమె ఇంకా

గుసులు విప్పుకోలేదు. విప్పుకునే ప్రయత్నమూ చేయలేదు. ఆమెకు అరిచే అవకాశం, పెనుగులాడే శక్తీ లేకపోయింది. నిశ్శబ్దంగా జరిగిపోయింది హత్య. హంతకుడు ఏ తలుపు చాటునో దాగివుండి ఆకస్మిక దాడి జరిపి వుండాలి.

శవం తరలించబడింది.

ఇంటివాళ్ళ ఏడుపులు ఇప్పుడు ఇంకా ఎక్కువయ్యాయి.

లాల్ బాత్‌రూంని ఓసారి శ్రద్ధగా పరికించి, కృష్ణన్‌ని చూశాడు.

"ఇన్స్‌పెక్టర్, బాత్‌రూంలో వస్తువులేవీ కదల్చలేదుగా?"

"లేదు, మిస్టర్ లాల్. ఎక్కడివక్కడే వున్నాయి."

"కానీ ఒకటి కన్పించడంలేదు, కృష్ణన్."

"ఏమిటది, లాల్?"

"ఆమె స్నానం చేయడానికే వచ్చిందంటారా?"

"అవునని ఆమె ఆడపడచు అంటోంది."

"ఆమెకు చెప్పి వెళ్ళిందట నా?"

"లేదు, భుజంమీద టవల్‌తో వెళ్తోంటే అలా అనుకుందట."

"అదే నేనడిగేది....టవల్ ఏది?"

కృష్ణన్ కలవరంగా చూశాడు. "టవల్....అవును, టవల్ ఏది?"

"ఎవరైనా తీశారేమో అడగండి." అన్నాడు లాల్.

కృష్ణన్ సార్జెంట్‌ని పురమాయించాడు.

లాల్ ఎలక్ట్రిక్ దగ్గరకు కదిలాడు. తలుపులు తీసి లోపలికి చూశాడు. శుభ్రంగా వుంది. కాని తలుపు పక్కన చిన్న నీటి మడుగు ఏర్పడి వుంది. మిగతా

గచ్చంతా పొడిగా వుంది.

లాల్ తలూపాడు. "ఈ నీరు కొంత ఎత్తునించి ధారగా పడింది."

"మీ కెలా తెలుసు?"

"మడుగు చుట్టూ నీటిబిందువులు చిమ్మబడ్డాయి."

"అయితే ఈ నీరెక్కడిది?"

"హంతకుడు ఇక్కడ దాగి వుండాలి."

"ఓ,హో, అయితే మధ్యలో గట్స్ పోగొట్టుకుని ఇక్కడ మాత్రం పోసుకున్నాడన్నమాట!" జాన్ అభిప్రాయపడ్డాడు.

లాల్ విసుగ్గా చూశాడు, "యూ షట్ యువర్ ఫ్లాపింగ్ మౌత్!"

"అలాగే, సర్."

సార్జెంట్ తిరిగి వచ్చి టవల్ ఎవరూ తీయలేదని చెప్పాడు.

కృష్ణన్ ప్రశ్నార్థకంగా చూశాడు.

లాల్ అక్కడ్నుంచి కదిలాడు "వెల్ ఆ నీటి మడుగుని ఫోటో తీయించండి. వేలిముద్రలుండవనుకుంటాను. హంతకుడి చేతులు నీటిలో తడిసి వున్నాయి...."

అతను బాత్ రూంలో వాష్ బేసిన్ దగ్గరకు వెళ్ళి "కృష్ణన్ ఇటు రండి!" అన్నాడు.

జాన్ వెంటనే వెళ్ళాడు.

లాల్ విసుగ్గా చూశాడు, "నిన్ను కాదు పిల్చింది!"

"కృష్ణన్, మీరు పిలవబడుతున్నారు!" జాన్ అన్నాడు వెనక్కి తిరిగి.

"పిలువబడుతున్నారు కాదు, మిమ్మల్ని పిలుస్తున్నారు అనాలి! భాష సరిగ్గా మాట్లాడకపోతే కిక్

ఇస్తాను" తిట్టాడు లాల్.

కృష్ణన్ వచ్చి ఇద్దరి ముఖాలు చూశాడు.

జాన్ బేసిన్‌లో చూపించాడు. "ఇటు చూడండి, ఇన్స్పెక్టర్. ఇందులో ఈ వెంట్రుకలెలా వచ్చాయంటారు?"

"దువ్వుకుంటే వచ్చాయి."

"ఎవరు దువ్వుకున్నారు?"

"నేను కాదు."

"ఆడా, మగా?"

కృష్ణన్ ఆ వెంట్రుకలని తీసి పరిశీలించాడు. అవి నాలుగున్నాయి. నిగనిగలాడుతున్నాయి. సుమారు మూడంగుళాలు పొడవున్నాయి.

"మొదళ్ళ నుంచి ఊడాయి. పొడుగునీ, థిక్‌నెస్‌ని బట్టి ఇవి పురుషుడివి...." అన్నాడు కృష్ణన్.

"ఇక్కడ చావు జరిగితే ఎవరూ ఇక్కడ నిలబడి తల దువ్వుకోరు కాబట్టి, ఇవి చావుకి ముందునించీ పడి వుండాలి" అన్నాడు.

కృష్ణన్ తలూపాడు, "చావుకి ముందు—అంటే—హంతురాలు బాత్‌రూంలోకి రాకముందు—మగాళ్ళెవరైనా వచ్చారేమో తెలుసుకుంటాను."

"వచ్చే వుండాలి. ఆమె భర్తా, మామగారూ, వాళ్ళు స్నానానికి బయల్దేరకముందు ఉదయం ఒకసారి ఉపయోగించి ఉండాలి బాత్‌రూంని-మొహం కడుక్కోడానికి" జాన్ చెప్పాడు.

లాల్ అడ్డంగా తలూపాడు. "అది కాదు నా అయిడియా. మీరొక్కటి గ్రహించలేదా? వాళ్ళసలు

స్నానమే చేయలేదంటే బట్టలు వేసుకోలేదని అర్థం. బట్టలు వేసుకోలేదంటే వాళ్ళ దగ్గర దువ్వెన్‌లు లేవని అర్థం. వాళ్ళు మొహాలు కడుక్కోడానికొస్తే, ఆ పని చేసుకుని టవల్‌తో ముఖం తుడుచుకుని పోతారు. వాళ్ళ దగ్గరప్పుడు దువ్వెన్‌లు వుండవు కాబట్టి, బాత్‌రూంలో కూడా ఎక్కడా లేదు కాబట్టి ఇక్కడ వాళ్ళు తల దువ్వలేదని అర్థం చేసుకోవాలి.

"ఇహ దువ్వెనతో బయల్దేరి ప్రత్యేకంగా వచ్చి ఇక్కడ దువ్వుకోవడమన్నది అసంబద్ధంగా వుంటుంది. ఇంట్లో అద్దాలుంటాయి.

"నేననేది ఏమిటంటే, మైడియర్ ఫ్రెండ్స్, ఇవి పురుషుని వెంట్రుకలుగా గుర్తించడం జరిగింది కాబట్టి, ఆమె భర్తా, మామగారు గాకుండా మరెవరో బయటి వ్యక్తి, కుటుంబానికి తెలిసినవాడో తెలియనివాడో, ఇక్కడ ప్రవేశించి వుండాలి.

బయటినుంచి వచ్చే వ్యక్తి బట్టలేసుకొని తయారై వస్తాడు గాబట్టి అతని జేబులో పర్సు, సిగరెట్లు, దువ్వెన వంటివి వుంటాయి."

కృష్ణన్ అన్నాడు. "ఫ్రెండ్స్, ఇంటి సభ్యులు అయిదుగురన్నారు. ఆమె మామ, అత్త, భర్త, ఆడ పడచు, మరిది_ "

"మరిది___?"

"అతను-సతీష్. అతను జ్వరంవచ్చి పడుకున్నాడు."

"ఎక్కడ?"

"పైన గదిలో...."

"మరి చెప్పరేమిటి?" అన్నాడు లాల్ కోపంగా.

# 3

సతీష్ కళ్ళు మూసుకొని పడుకొని వున్నాడు.

అతనికి ఇరవై ఏళ్ళుంటాయి. అతను పైజామా షర్టుతో వున్నాడు. జుట్టు చిందరవందరగా వుంది. ముఖం పీక్కుపోయి, శరీరం బలహీనంగా వుంది. జ్వరంతో అతని వొళ్ళు కాలిపోతోంది.

కృష్ణన్ అతన్ని తట్టి లేపగానే, కళ్ళు తెరచి బల హీనంగా చూశాడు.

"ఎవరు....ఎవరు...." అస్పష్టంగా పలికాడు.

"నీతో మాట్లాడాలి, సతీష్. డిటెక్టివ్ లాల్ వచ్చారు."

"కానీ ...వాళ్ళంతా ఎందుకు ఏడుస్తున్నారు?"

"మనుషులు ఏడుస్తారు" లాల్ అన్నాడు.

"నేను.... నేనెప్పుడు ఏడ్వను."

"ఎందుకేడ్వవు?"

"శక్తిలేదు. రెండు రోజుల్నుంచీ ఏమీ తినలేదు."

"మరి ఏడ్చేందుకులేని శక్తి నడిచేందుకెలా వచ్చిం దంటావ్?"

"నేను.... నేను నడిచానా?"

"నడిచావు. బాత్‌రూంలోకి నడిచివెళ్ళి, మీ వదినని చంపేసివచ్చి పడుకున్నావు."

"డాక్టర్! వదిన....వదినకేమైంది?"

"చచ్చిపోయింది. నువ్వు చంపావు."

"డాక్టర్! ఓహ్, ఏమిటి మీరనేది...."

"కాదా? మరేం చేశావో చెప్పు?"

"వదిన చచ్చిపోయిందా...అయ్యో వదినా! డాక్టర్, నాకేమీ తెలియడంలేదు. ఏమీ అర్థంగావడంలేదు...."

"నీ కాళ్ళు తడిగా వున్నాయింకా."

"ఓహ్, ఇవి.... డాక్టర్, ఇవి...."

"ఆయన డాక్టర్ కాదు, డిటెక్టివ్!" కృష్ణన్ కేక పెట్టాడు.

"ఓహ్, సారీ.... సారీ, డిటెక్టివ్ సార్. నాకేమీ తెలియడంలేదు. ఇదంతా ఏమిటో తెలియడంలేదు. మీ రేమంటున్నారో—"

"నీ కాళ్ళెలా తడిశాయని అడుగుతున్నాను."

"ఓహ్, నా కాళ్ళు .... ఇవి .... ఇవి .... నువ్వేకదా అన్నయ్యా తుడిచింది? మాట్లాడవేమిటి?"

ఉమేష్ ముఖం ఎర్రబడింది. "ఏమిటి నువ్వనేది?"

"నువ్వు కాదూ? నా కాళ్ళు తుడిచింది నువ్వు కాదూ? డిటెక్టివ్ సార్, అన్నయ్యే నా కాళ్ళు తుడిచాడు. మర్చిపోయావా, అన్నాయ్యా? ఇందాక నా వొళ్ళు కాలిపోతోందని తడిగుడ్డతో తుడిచావు? డిటెక్టివ్ సార్, నేను మగతలో వున్నాను. కళ్ళు తెరువలేకపోయాను. ఇవ్వాళ జ్వరం బాగా ఎక్కింది. అన్నయ్య నా కాళ్ళు తుడుస్తూ ఆప్యాయంగా పలకరిస్తుంటే...."

"నోర్మూయ్!" ఉమేష్ రెచ్చిపోయాడు, "సర్, వాడి మాటలు నమ్మకండి! తెలివిలో లేడు. ఏదేదో వాగుతున్నాడు, వాడి కాళ్ళు నేనెందుకు తుడుస్తాను? ఈ గదిలోకే రాలేదు నేను—"

"అయ్యయ్యో, అన్నయ్యా! నువ్వేనా అలా అంటున్నది! ఎంతలో ఎంత మార్పు...."

"అతని పైజామా అంచులు చూడు, తడిసిలేవు. జుట్టు చూడు నూనెలేదు, దువ్వెలోలేదు. అతను బాత్

రూంలోకి వెళ్ళలేడు" అన్నాడు జాన్.

లాల్ తిరిగి ఉమేష్‌ని చూశాడు.

"వాడిని నమ్మకండి, సర్!"

కృష్ణన్ జేబులోంచి బ్లాటింగ్ పేపరుతీసి, దానిమీద పాదముద్రని సతీష్ పాదంతో కొలిచి చూశాడు. సరి పోయింది. అతని ముఖం సంతోషంతో వెలిగింది.

సతీష్ భయంగా చూశాడు. "ఏమిటది? నన్నేం చేయ బోతున్నారు? మీరంతా ఎందుకలా చూస్తున్నారు? నేను రోగమొచ్చి పడుకుంటే ఈ డిస్టర్బెన్స్ ఏమిటి? వెళ్ళిపొండి మీరు! నన్ను డిస్టర్బ్ చేయొద్దన్నాడు డాక్టర్. నాకు రెస్టు కావాలన్నాడు డాక్టర్."

"రెస్టు .... !!!" కృష్ణన్ వికటంగా నవ్వాడు, "అవును, నీకిప్పుడు బాగా దొరుకుతుంది, సతీష్!"

"డిటెక్టివ్ సార్, నన్ను కాపాడండి! ఈ పోలీసు మాటలు నాకు భయం కలిగిస్తున్నాయి!"

"నువ్వేం చదువుతున్నావ్ సతీష్?" లాల్ అడిగాడు.

"బి.కాం."

"ఎప్పట్నించీ జ్వరం?"

"మున్నట్నుంచీ– మొన్న మధ్యాహ్నంనించీ!"

"నువ్వు లేచి నడవగలవా?"

"ఊహుఁ, సార్. ఎవరన్నా పట్టుకుంటే లేస్తాను."

"వదినతో నీకు విరోధముందా?"

"వదినతోనా ... "

"చెప్పు, చెప్పు రాస్కెల్!" ఉమేష్ మళ్ళీ రెచ్చి పోయాడు, "సర్, నేను చెప్తాను వినండి! వీడికి పద్మజ అంటే పడదు! విరోధం! ఆమె కన్పిస్తే ముఖం ముడుచు కుంటాడు. ఆమెకు సరదాగా ఉండడం ఇష్టం. జోకులు

వేసి నవ్విస్తుంది. వీడు బిగుసుకున్న కొద్దీ ఎక్కువచేస్తుంది. ఆటలు పట్టిస్తుంది. కవ్విస్తుంది. పనిగట్టుకొని వీడొక్కడి మీదే కాదు, అందరితోనూ అలాగే వుంటుంది. ఆమె స్వభావమే అంత!

"కానీ వీడు — వీడొట్టి సెన్సాఫ్ హ్యూమర్ లేని ఇడియట్! నవ్వడం చేతకాదు. ఆమె జోకులకి సీరియస్సైపోతాడు. స్పోర్టివ్‌గా తీసుకోలేడు. తననేదో అవమానిస్తోనట్టు ఫీలవుతాడు — దాంతో ఆమె అంటే అయిష్టం పెంచుకున్నాడు. మొన్ననే నాలుగు రోజుల క్రితం—వీడేదో ఉత్తరం రాస్తే దానిమీద స్పెల్లింగ్ తప్పురాసి వెక్కిరించిందట — వీడి చదువుని దృష్టిలో పెట్టుకొని. దాంతో వీడికింకా కసెక్కిపోయింది! ఆ తర్వాత రెండు రోజులకి జ్వరంతో పడ్డాడు. వీడి జ్వరానికీ ఆమెకూ ఏం సంబంధంలేదు—

"ఆమె వట్టి పెడసరి మనిషనుకున్నారా? కానే కాదు. ఎవరికైనా ఇబ్బందులొచ్చినప్పుడు అవి తనవిగా భావిస్తుంది. మనస్ఫూర్తిగా ఆదుకొంటుంది. వీడి జ్వరానికి ఇంట్లో ఎక్కువ బెంగపెట్టుకుంది ఆమే! వీడి కోసం ఎంత తపించింది! ఎన్ని సేవలు చేసింది!

"కానీ వీడు — అదింకా అవమానంగా, ఆమెను శత్రువుగా భావించుకుంటూ దగ్గరికి రానిచ్చాడా! కాఫీ ఇస్తే కసిరికొట్టాడు. మందులిస్తే విసిరికొట్టాడు. ఆమె తనని క్షమించమని ఎంత అడిగింది! వీడు విన్పించుకుంటేనా! ఆమె ప్రతి చర్యా తనని అవమానించేందుకే అనుకున్నాడు. రోజురోజుకీ కక్ష పెంచుకున్నాడు. ఈ జ్వరంలో .... ఒళ్ళు తెలియని స్థితిలో .... మతిపోయి ఉద్రేకంలో ఆమెని ..."

"అన్నయ్యా—!!"

సతీష్ ఒక్క ఆరుపుతో స్పృహతప్పి పడిపోయాడు.

## 4

"మిస్టర్ కృష్ణన్—" లాల్ అన్నాడు సిగరెట్ పొగ పైకి వూదుతూ, "మరీ అంత చనువూ, చొరవా ఇంత కొత్తలో పద్మజకు మంచిదికాదనుకుంటాను అందరి దగ్గరా."

కృష్ణన్ తలూపాడు విచారంగా. "ఆమె స్వభావం చెప్పావుగా భర్త. ఇలాటి వాళ్ళకి కొత్తా పాతా మనుషుల దగ్గర కానీండి, సలాల్లో గానీండి వుండదు. తమ ధోరణిలో ఎంతకు తోస్తే అంతకు సాగిపోతూంటారు. ఇలాటివాళ్ళే ఎక్కువగా ప్రమాదాలు తెచ్చుకుంటారు...."

"ప్రమాదాలకు వారి స్వభావమే కారణం కావాలని లేదు, కృష్ణన్."

"మరి?"

"పరుల స్వలాభాపేక్ష కూడా కావచ్చు ఒకోసారి."

"ఎవరా పరాయివాడు?"

"ఎవరైనా కానీ సతీష్‌ని అనుమానించలేము."

"మిస్టర్ లాల్, నాకు వివరణ కావాలి."

"వివరణ స్పష్టంగా వుంది, కృష్ణన్" అన్నాడు లాల్ వివరిస్తూ, "మీ ఎవిడెన్స్‌తో అతని పాదం కొలత సరి పోవడం అతని నేరంకాదు. పాదముద్రలు వేలిముద్రలు కావు, వేటికవి విలక్షణంగా ఉండడానికి. ఆ సైజు పాదం గలవాళ్ళు కోట్లమందిని గమనించవచ్చు. మనం

చూడవల్సింది ఇక్కడ — నడకతీరు, వేగం, అడుగుల మధ్య దూరం...."

కృష్ణన్ అంగీకరించాడు.

లాల్ తిరిగి అన్నాడు. "మీరు ఫోన్‌లో కొన్ని సూచనలిచ్చారు. ఆ ప్రకారం చేశాననుకుంటాను."

కృష్ణన్ తలూపాడు.

"ఏం తెలిసింది?"

"బాత్‌రూంనించి హాలులో మెట్లవరకు దూరం అరవై రెండడుగులు. అంగుళాలు లెక్కలోకి తీసుకో లేదు."

"ఫరవాలేదు, తర్వాత?"

"ఆ మార్గంలో ఇరవై మూడు జాడలు పడ్డాయి."

"ఇంకా?"

"వాటి మధ్య దూరం ప్రారంభంలో అడుగున్నర, మరికొంత ముందుకెళ్తే రెండున్నర; మధ్యకొస్తే, అంటే హాలులో ప్రవేశించినప్పటినుంచీ మెట్లవరకూ మూడడుగు లుంది."

"క్రమంగా నడకవేగం హెచ్చిందన్నమాట."

"అవును. ఇక నడకకు పదైనిమిది సెకన్లు పట్టాయి."

"మెట్ల దగ్గర్నుంచీ జాడలేమయ్యాయి?"

"కాళ్ళకి తడి ఆరిపోయుంటుంది, అక్కడాగిపోయాయి. హంతకుడు పైకే వెళ్ళాడని నా అనుమానం."

"వెల్, నడకవేగం—అడుగుల మధ్య దూరం అతని ఫిజికల్ ఫిట్‌నెస్‌ని తెలియజేస్తోంది."

"ఏం తెలియజేస్తోంది?"

"అరవై రెండడుగుల దూరాన్ని పద్దెనిమిది సెకన్‌లలో తడబడకుండా పెద్ద పెద్ద అంగలేస్తూ నడిచాడంటే, అతను ఆరోగ్యవంతుడై వుండాలి."

కృష్ణన్ తలూపాడు.

లాల్ అన్నాడు మళ్ళీ. "కనుక అదే వేగంతో మేడమెట్లెక్కాడని భావిద్దాం."

కృష్ణన్ మళ్ళీ తలూపాడు.

"ఇక ఎలిబీస్ గురించి ఏమిటి?"

"లాల్, ఆమె బాత్‌రూంలోకి వెళ్ళిన వెంటనే— అంటే ఎనిమిది గంటలకు — మరణించిందన్నాడు డాక్టర్."

"అవును ఎనిమిది గంటలకి మరణించింది."

"ఆ సమయంలో ఇంట్లో మిగతా సభ్యులు — తల్లీ కూతుళ్ళు కిచెన్‌లో వున్నారు. పెద్ద కొడుకూ తండ్రీ డ్రాయింగ్ రూంలో వున్నారు. పనిమనిషి బావిదగ్గర వుంది—కిచెన్‌లోంచి ఆమె తల్లీ కూతుళ్ళకి అగపడింది. పనివాడు అప్పుడు వరండా శుభ్రంచేస్తున్నాడు— డ్రాయింగ్‌రూంలో తండ్రీ కొడుకులు అతన్ని గమనించారు. ఒకళ్ళకి ఒకరు ఎలిబీ. ఈ అయిదుగుర్నీ లిస్టులోంచి తొలగించవచ్చు.

"ఇక, సతీష్ వున్నాడు — పాపం ఒంటరిగాడు. అతనికి ఎలిబీ లేదు. ఉదయం ఏడుగంటలకి తల్లి పాలు తీసుకెళ్ళి తాగించి వచ్చింది. అప్పట్నుంచీ అతనా గదిలో ఒంటరిగా ఉన్నాడు. గదిలోనే ఉన్నాడో లేదో ఆ పరమాత్ముడికే ఎరుక! అయితే అతని ఆరోగ్యమే అతనికి ఎలిబీ."

"పద్మజ బాత్‌రూంలోకి వెళ్ళగానే దాడిచేసి

చంపాడు హంతకుడు. పెనుగులాట జరిగినట్లు సూచించే విధంగా ఆమె బట్టలు చినగడంగానీ, గాజులు పగలడంగానీ అటువంటిది ఏమీ జరుగలేదు. అంటే ఏమిటి అర్థం? హంతకుడు బలిష్టుడు. అతని చేతిలో మసలలేక పోయిందామె. ఆ పరిస్థితిలో హంతకుడికి ఒక్కటే పద్ధతి ఉంటుంది. ఏమిటది? ఆమె అరవకుండా ఒక చేత్తో నోరు నొక్కి ఉంచడం, మరో చేత్తో ఆమె గొంతు నులమడం. వింటున్నారా కృష్ణన్? ఒక్క చేత్తో గొంతు నులమడం."

కృష్ణన్ అంగీకరించాడు.

"ఇక కామన్ సెన్స్ ఉన్నవారెవరైనా సతీష్ ఆరోగ్యపరిస్థితి చూసి అతడాపని చేయగలడని నమ్మలేరు. ఒక్క చేత్తో చంపడం, జ్వరంతో తీసుకుంటూ రెండు రోజుల్నుంచీ పడక దిగకుండా, అన్నపానీయాలులేక అతడెంత బలహీనంగా అయ్యాడో చెప్పడానికి డాక్టర్ కానవసరంలేదు. వైద్యశాస్త్రం తెలియనవసరంలేదు. హంతకుడికి ఈ కామన్ సెన్స్ లోపించింది....

"అందుకే హత్యను సతీష్‌మీద బనాయించబూనాడు. అతనికీ, ఇంటి పరిస్థితులు బాగా తెలిసివుండాలి. వదిన—మరదుల మధ్య విరోధం తెలిసివుండాలి. అతను బయట మనిషి. ఏదోవిధంగా ఆమెకు తెలిసినవాడు. ఏదో కారణంగా ఆమెను చంపబూనాడు—

"వెల్, ఆమెను చంపేశాక శవాన్ని కింద వదిలేశాడు. అప్పుడు జోళ్ళుతీసి పైన ఎక్కడో పెట్టి, షవర్ విప్పాడు. అలా బయటివాళ్ళకి ఆమె స్నానం చేస్తోందన్న భావన కల్గించాడు. అప్పుడు పలాయనం గురించి ఆలోచించాడు. అలాగే బయటకెళ్తే కంట

బడతాడు. కాబట్టి ఓ ఆలోచన చేశాడు. శవాన్ని బాత్ రూంలో మూలకి చేర్చి, ఆమె టవల్ తీసుకుని దాన్ని నీటిలో బాగా తడిపాడు. అప్పుడు తలుపు గడియతీసి పెట్టి, ఆ టవల్‌తో లెట్రిన్‌లో వెళ్ళి దాక్కున్నాడు.

"అదే అతనికి క్షేమమైన చోటు. అందులోకి చూసే ఆలోచన ఎవరూ చేయరు — ముందు బాత్ రూంలో శవాన్ని చూశాక.

"అప్పుడు కృష్ణన్, అతను లెట్రిన్‌లో దాక్కున్నప్పుడు చేతిలో తడిసిన టవల్ నించి ధారగా కారి నీరు కింద మడుగు కట్టింది—

"వెల్, అప్పుడు ఇంట్లోవాళ్ళు శవాన్ని చూశారు. అంతా దానిచుట్టూ ఆ మూల మూగారు. హంతకుడు అంతా తలుపుచాటునించి గమనిస్తున్నాడు. ఉమేష్ పోలీసులకి ఫోన్ చేసి వచ్చాక అవకాశం చూశాడు. వాళ్ళలాగే గుంపుగా కూర్చుని రోదిస్తున్నారు. తను ఇటునుంచి చల్లగా జారుకుంటే కంటపడడు. అలాగే అతను లెట్రిన్ లోంచి నిర్భయంగా వచ్చి బయటికి నడిచి వెళ్ళిపోయాడు——చేతిలో తన జోళ్ళూ, టవల్‌తో.

"అది శవందగ్గర వాళ్ళెవరూ గమనించలేదు. అతను నిర్భయంగా సతీష్ గదిలోకెళ్ళి అతని కాళ్ళు తుడిచాడు. అతని అన్నని ఇంపర్సనేట్ చేశాడు—"

"అలా ఎందుకు చేశాడు? అప్పుడది ఉమేష్‌మీదికి తిరుగుతుంది కదా? అతను ఇరించాలనుకున్నది సతీష్‌ని. ఉమేష్‌కి మోటివ్ లేదని అతనికి తెలుసనుకుంటాను?" కృష్ణన్ అడిగాడు.

"తెలుసు. కానీ ఆ పరిస్థితిలో సతీష్‌కు ఏదో ఒకటి చెప్పాలిగా? అందుకే అతడి అన్న ఉమేష్‌గా చెప్ప

కున్నాడు. ముందు సతీష్ మాట్లాడలేని, కళ్ళు తెరవలేని శక్తిహీనతనలో—శోష లేండా పడివుంటాడనుకున్నాడు. కానీ అలా జరగలేదు. అతని ప్రశ్నలకి జవాబులియ్యవలసి వచ్చింది....తర్వాత అతన్ని పోలీసులు ప్రశ్నించినప్పుడు జ్ఞాపకముంచుకుంటాడనుకోలేదు. అలా చేశాక అతను టవల్‌తో అక్కడ్నుంచి జారుకున్నాడు."

"ఎక్కడికి? ఎలా?"

"మీరంతా అప్పుడు బాత్ రూంలోవున్నారు. అతను దర్జాగా మెట్లుదిగివచ్చి వెళ్ళిపోయాడు బైటికి. 8-52—9-00 మధ్య పారిపోయి వుండాలి. దీన్ని మీరు వీధిలో దర్యాప్తుచేయాలి."

"కానీ అసలతను ఇంట్లోకి — బాత్ రూంలోకి ఎలా ప్రవేశించాడు?"

"లోపలి మనిషి తోడ్పాటుతో...."

"ఏమిటీ! మీకేమన్నా—"

"పిచ్చెక్కలేదు. బుర్ర లక్షణంగా వుంది. మీరింట్లో వాళ్ళంతా మంచివాళ్ళనుకుంటున్నారు — సతీష్ తప్ప. అతన్ని గట్టిగా అనుమానిస్తున్నారు. మీరా అడుగుజాడతో ఏమీ నిరూపించలేరు, సతీష్ విషయంలో. ఆ అడుగుజాడలు పరిశీలిస్తే ఆ నడక అతనికి సాధ్యంకాదని తెలిసిపోతుంది...అంత అనారోగ్యంగా, బలహీనంగా వున్న మనిషి అలా నడిచివెళ్ళి మెట్లెక్కలేడు స్వయంగా. అంతేగాక, అతను బాత్ రూంలో వుంటే కాళ్ళేకాదు, పైజామా అంచులు తడిసేవి. షవర్ విప్పినప్పుడు బట్టలు తడిసేవి. అతను తల దువ్వుకుంటే జుట్టు అలా వుండేది కాదు. బాత్ రూంలో వెంట్రుకలు అతనివి కావు."

"నో, హంతకుడికి మరొకరు తోడ్పడ్డారంటే

నమ్మాను!"

"ఒక పరాయి వ్యక్తి—తను చంపదల్చుకున్నమనిషి సరిగ్గా ఏ సమయానికి తాననుకున్న చోటికి వస్తుందో తెలుసుకొని ఆ సమయంలో అక్కడుండాలంటే—ఆ నిరీక్షణ కాలం పెరిగి మరెవరో అక్కడికి వచ్చి వాళ్ళ కంటబడే ప్రమాదాన్ని నివారించాలంటే — ఎవరో లోపలి మనిషితో కట్టుదిట్టంగా ఏర్పాట్లు చేసుకోకుండా తాననుకున్న పనిని సాధించలేడు!" లాల్ లేచి బయటకు నడిచాడు.

# 5

ఆఫీసుకి తిరిగివచ్చాక అన్నాడు లాల్. "పార్ట్‌నర్, పాపం ఈ కొత్త కోడళ్ళ అకాలమరణాలు మంచి వారైనా ఆ అత్తమామలకి చెడ్డపేరే తెస్తాయనుకుంటాను. ఏమంటావు?"

జాన్ తలూపాడు. "మంచివాళ్ళు దురదృష్టవంతులు. చెడ్డవాళ్ళ గురించి చెప్పుకుందాం. కట్నకానుకలకోసం మానవత్వం లేకండా తమ జీవిత భాగస్వాముల్ని హింసించే మగ వెధవలకి—లేదా ఆ హత్యాకాండలో తమ పెద్దలకి సహాకరించే పిరికి వెధవలకి—ఒక్కటే శిక్ష!"

"ఏమిటది?"

"జర్మన్ నాజీ పద్ధతుల్లో కాన్సన్‌ట్రేషన్ క్యాంపులు వంటివి ఏర్పాటు చేసి—అక్కడ వీళ్ళని ఇంపోటెంట్లుగా చేసి వదలాలి—మళ్ళీ రెండో పెళ్ళికి తయారవకుండా! ఇది దారుణమనిపించినా ఈ రోగానికి ఇంతకంటే వైద్యం లేదు!"

"వెల్, నీవుద్రేకం ఎక్కువ. అరబ్బువాడిలా మాట్లాడుతున్నావ్."

"కేసు గురించి మాట్లాడు—"

లాల్ సిగరెట్ వెలిగించుకొని కిటికీ దగ్గర వెళ్ళి నిలబడ్డాడు. ట్రాఫిక్‌ని చూస్తూ కొన్ని క్షణాలయ్యాక జాన్ వైపు తిరిగాడు.

"పార్ట్‌నర్, ఆ టవల్ కోసం నువ్వు గాలించావు కదూ?"

"అవును. అది సతీష్ గదిలో లేదు. ఎందుకుంటుంది? పట్టుకుపోయుంటాడు."

"నో, జాన్. ఏదో కిటుకు వుంది ..."

"కిటుకా? ఏమిటది? నువ్వా కిటికీనుంచి కదిలిరా-"

లాల్ వచ్చి అతని ఛాతీమీద కొట్టాడు.

"హత్య చేస్తే నువ్వు తెలివిగల హంతకుడివే అవుతావు, జాన్. మన హంతకుడు కొంతవరకు తెలివిగలవాడే. అతని స్థానంలో నిన్ను వూహించుకో. ఏం చేస్తావు? సతీష్ కాళ్ళు తుడిచినప్పటి పరిస్థితిని వూహించుకో. అప్పుడెలా చేస్తావు?"

జాన్ ఇంకా తికమకలోంచి తేరుకోలేదు. "అదిగో ఫోన్!" అని లాల్ గబుక్కున వెళ్ళి మోగుతున్న ఫోన్‌ని ఎత్తాడు.

"యస్, దిసీజ్ లాల్ హియర్, ట్విన్ సిటీస్ డిటెక్టివ్ ఏజెన్సీస్."

"డిటెక్టివ్ గారూ!"

"ఎవరది.... ఓహ్, సుధ?"

"అవును, అవును, సుధనే...."

"వెల్, వెల్, కాస్త నిదానం, ఏమిటి సంగతి, సుధ?"

"మీకో ముఖ్య విషయం చెప్పాలి!"

"అది రహస్యంగా చెప్తున్నారా?"

"అవును, రహస్యంగా! ఇంట్లో ఎవరికీ తెలియదు. ఇన్స్పెక్టర్ ప్రశ్నించినప్పుడు కూడా ఇది చెప్పలేదు."

"ఎందుకు చెప్పలేదు?"

"ఏదో భయంవేసింది...."

"ఇప్పుడు?"

"మిమ్మల్ని చూస్తే ధైర్యం....మీ దగ్గర రక్షణ ఉంటుంది...."

"వెల్, నన్ను చూస్తే బాధలు, భయాలే పోంగి వస్తాయి. చెప్పండి. మీ పేరు చెప్పను—"

"అడుగుజాడలు గురించి విశేషంగా మాట్లాడు తున్నారు...."

"అవును."

"అన్నయ్య రెండోసారి బాత్ రూంనించి బైటి కెళ్ళగా నేను చూశాను."

లాల్ కుతూహలంగా అడిగాడు, "ఏ అన్నయ్య, సుధ?"

"పెద్దన్నయ్య. అతను పోలీసులకి ఫోన్ చేయడానికి ఒకసారి వెళ్ళివచ్చాడు. తర్వాత పావుగంటకి మళ్ళీ వెళ్ళాడు...."

"అది మీరొక్కరే చూశారా?"

"నేనొక్కదాన్నే చూశాను."

"మీరు చూసినట్టు అన్నయ్యకు తెలుసా?"

"తెలియదు."

"అప్పుడతని చేతిలో టవల్ వుందా?"

"టవలా....ఏమో, నేను గమనించలేదు,"

"వెల్, ఇంకేం చెప్పదల్చుకున్నారు?"

"ఇంతే. ఇతర విషయాలు ఇన్స్పెక్టర్‌కి చెప్పాను."

"గుడ్. అయితే మీరొకసారి ఉమేష్ గదిని వెతుకుతారా, ఆ టవల్ కోసం? అది కనిపించేలా స్టాండు పైనో, హేంగరుకో వుండదు. మూలలు వెతకండి మూలలు. ఏమంటారు?"

"అలాగే డిటెక్టివ్ గారూ, అలాగే."

లాల్ ఫోన్ పెట్టేసి నిట్టూర్చాడు.

"పార్ట్‌నర్, ఏమిటి డెవలప్‌మెంట్?" జాన్ అడిగాడు కుతూహలంగా.

"ముందు నా ప్రశ్నకి బదులు—"

"నేనే హంతకుణ్నయితే పార్ట్‌నర్, ముందు నేనూహించుకున్నట్లుగాక అప్పుడు సతీష్‌తో మాట్లాడే పరిస్థితి ఎదురైంది గనుక, అప్పుడు అతడి అన్నలా నటించాను గనుక, అప్పుడా హత్యని అతని మీదికే తిప్పడానికి ప్రయత్నిస్తాను. ఉమేష్ మీదికి సతీష్‌ని ప్రశ్నిస్తే అతను జ్ఞాపకం పెట్టుకొని చెప్పేస్తే, అప్పుడతని మాటలకి సమన్వయం కుదరాలి గనుక, ఆ టవలుని ఉమేష్ గదిలో దాస్తాను, పార్ట్‌నర్."

లాల్ ముఖం సంతోషంతో వెలిగింది.

# 6

డాక్టర్ రఘునాథ్ ఫోన్ చేశాడు మధ్యాహ్నం మూడు గంటలకి, ఉద్రేకంగా.

"మిస్టర్ లాల్! కృష్ణన్ ఏమిటి, ఏదో థియరీ పట్టుకొచ్చి నన్ను విసిగిస్తున్నాడు? నాకేం నచ్చలేదు. నేను మరోసారీ—మరోసారీ—వందోసారీ—వెయ్యోసారి చెప్తున్నాను చూడండి—"

"ఏం చెప్తున్నారు?"

"ఆమె పెనుగులాడలేదు. నోట్ దిస్ పాయింట్. దేర్ వజ్ నో స్ట్రగుల్ ఎటాల్! ఆమె హంతకుడి జుట్టు పీకలేదు! పీక్కున్నాడు. ఎలా పీక్కున్నాడో అది మీ బిజినెస్. దట్సాల్, నన్ను విసిగించకండిక!"

"ఆగండి డాక్టర్, ఆగండి. ఆమె గర్భవతి అయి వున్న సూచనలున్నాయా?"

"ఓహ్-ఓహ్-అదెలా వచ్చింది మీ బ్రెయిన్‌లోకి?"

"పరిసితి అలా డెవలప్ అయింది."

"అలాంటి సూచనల్లేవు, సారీ."

"థాంక్స్. కుటుంబ మర్యాద దక్కింది."

ఫోన్ పెట్టేసి లాల్, సిగరెట్ వెల్గించుకున్నాడు.

అకస్మాత్తుగా మళ్ళీ ఫోన్ మోగింది.

"ఈసారి నేను—" అని జాన్ ఎత్తాడు.

"హలో, సుధగారా? కమాన్, చెప్పండి! ఏమైంది?"

కాస్సేపటి తర్వాత ఫోన్ పెట్టేసి లాల్ వైపు తిరిగాడు.

"కమాన్, ఏమైంది?" లాల్ అన్నాడు ఆత్రుతగా.

"సుధకి లవ్ లెటర్ దొరికిందట—ఉమేష్ తలగడ గలేబులో."

"వెల్ ప్రొసీడ్!" ఆశ్చర్యంతో అన్నాడు లాల్.

"తెల్లకాగితంమీద వ్రాసివుంది. పోస్టులోనే వచ్చివుండాలి. కానీ పైన కవరులేదు. వచ్చింది పద్మజకు. రాసింది ప్రకాష్ అనే అతను. ఎక్కణ్ణుంచో తెలియదు. తేదీ వారం క్రితానిది. విషయం—నా జీవితాన్ని చీకటి చేస్తావా, నీ జీవితాన్ని అంతం చేయకుంటే నాకు నిద్ర పట్టదు.... సో అండ్ సో లాంటిది."

లాల్ నిట్టూర్చాడు. "మరి టవల్?"

"అది లేదు. ఉమేష్ గదిలో లేదు."

లాల్ ఆలోచనలో పడ్డాడు.

## 7

కృష్ణన్ నాలుగు న్నరకి వచ్చాడు, రొప్పుతూ, రోజుతూ.

"వెల్, కుదుటపడండి. జాన్ ఏదో అన్నాడని వెళ్ళి మీరు డాక్టర్‌తో ఫైట్ చేస్తారా?" అన్నాడు లాల్.

"ఫైట్ కాదు, బెట్ కట్టాను. కానీ ఆయన వింటేగా, గెటవుట్ అన్నాడు."

"మీకది క్షేమంకాదు, బెట్ కట్టడం. ఆమె వాంతకుడి జుట్టు పీకలేదు. పీక్కున్నాడు దువ్వుకొని. మీ రేం చేశారా వెంట్రుకలని?"

"టెస్టు చేయించాను. వయసు తెలుసుకోవడానికి కాస్టిక్ పొటాష్ టెస్టు—బ్లీచింగ్, డైయింగ్ ఏదైనా చేయబడ్డాయేమో తెలుసుకోవడానికి అల్ట్రా వైలెట్ టెస్టు—బ్లడ్ గ్రూప్ కోసం అబ్సార్బ్షన్ ఎలూషన్ టెస్టు—ఆ తర్వాత—"

"ఆ తర్వాత—?"

"న్యూట్రాన్ ఏక్టివేషన్ ఎనాలిసిస్."

"వెల్, ప్రొసీడ్!"

"వెంట్రుకలు డైయింగ్ గానీ, బ్లీచింగ్ గానీ చేయబడలేదు. బాగా నూనెరాయబడ్డాయి. నవయువకుడివి. అవి పీకబడలేదు. బలంగా పట్టి లాగిన చిహ్నాలు లేవు. వెంట్రుకలు ముడతలుపడి, నలగలేదు. మొదళ్ళు ఆకారం చెడిపోయి ఉబ్బిలేవు. అవి సహజంగా రాలాయి. అతనికి జుట్టురాలే గుణముంది. దువ్వితే రాలిపోవచ్చు. తడవకి ఇన్ని—

"అవి మూడంగుళాలు పొడవు, పాయింట్ నాట్ సెవన్ వ్యాసార్థాన్ని కలిగి వున్నాయి. శిరం మునదేలి, పై పొర క్యూటికిల్ ఇప్పుడిప్పుడే ఏర్పడుతోంది. అతను సుమారు వారం క్రితం క్షౌరం చేయించుకొని వుండాలి."

"వెల్, ఇంకా?"

"బ్లడ్ గ్రూప్ టెస్టులో అతనిది బి గ్రూపు అని తేలింది. ఇక న్యూట్రాన్ ఏక్టివేషన్ ఎనాలిసిస్‌లో— మనం తీసుకునే ఆహారం, పానీయాలు, వాతావరణ పరిస్థితులూ మన వెంట్రుకలలో కొన్ని మూలకాలుగా రూపాంతరం చెంది, వేర్వేరు శాతాల్లో వాటి తీవ్రత స్థాయినిబట్టి నిక్షిప్తమై వుంటాయి."

"ఆ వెంట్రుకలతో వ్యక్తి స్వభావ గుణాల్ని నిర్ణయించడానికి—వాటిని న్యూక్లియర్ రియాక్టర్‌లో ఇర్రేడియేట్ చేసినప్పుడు అందులోని ఎలిమెంట్స్—మూలకాలు రేడియో యాక్టివ్ ఐసోటోప్స్‌గా మారి వికిరణాన్ని కలిగిస్తాయి. అప్పుడా వికిరణ తీవ్రత ఆధారంగా ఆ మూలకాల శాతాన్ని లెక్క గట్టవచ్చు. మనవాడికి తాగుడు అలవాటుంది, మితంగా. అతను నివసించే పరిసరాల వాతావరణం పరిశుభ్రమైనది. అంతగా కాలుష్యం లేనిది...."

"వెరీ వెల్, ఇప్పుడు సులభం."

"సులభం కాదు, లాల్ చిక్కులున్నాయి. హంతకుడి బ్లడ్ గ్రూప్ బి. ఉమేష్ గ్రూప్ కూడా బి. అతని తండ్రికి ఎ. తమ్ముడికి బి. పనివాడికి ఎ. ఎవరు హంతకుడు?"

"హంతకుడు వారంక్రితం క్షౌరం చేయించుకున్నాడు. ఉమేష్ నాలుగురోజుల క్రితమే చేయించుకున్నాడు.

పనివాడు మొన్న నే చేయించుకున్నాడు — ఎవరు హంతకుడు?

"హంతకుడి వెంట్రుకలు నూనె బాగా రాయబడి, రాలిపోయే స్వభావంతో వున్నాయి. ఉమేష్ కూడా తలకు నూనె రాసుకుని వున్నాడప్పుడు. అతని జుట్టు దట్టంగా ఏమీ లేదు. సతీష్ వెంట్రుకలకి నూనె లేదు. దట్టంగానే వున్నాయి. పనివాడి జుట్టు దట్టంగా, మంచి బలంగా వుంది—ఎవరు హంతకుడు?

"హంతకుడు మితంగా తాగుతాడు. ఉమేష్ పెళ్ళికి ముందు తాగేవాడు. అతని తండ్రి ఇప్పటికీ స్వల్పంగా పుచ్చుకుంటాడు. పనివాడు అప్పుడప్పుడు నాటుసారా పట్టిస్తాడు—ఎవరు హంతకుడు?"

జాన్ అడ్డం తగిలాడు. "ఆగండి, కృష్ణన్. మీ ఆలోచనా పరిధిని పెంచుకోవాలి. ఎందుకా నల్గురిలో కే కబడ్డీ ఆడతారు? ముందు మీ రిపోర్టు పూర్తికానివ్వండి— కామెంట్స్ తర్వాత."

"ఓ.కే. ఆ ఇంటి వీధిలో మా సార్జెంట్ దర్యాప్తు చేశాడు. ఉదయం ఇంటి వెనుక వీధిలో ఒక మనిషి వెళ్తూ కన్పించాడు...."

"ఎవరికి?"

"ఒక ఇంటాయనకి. అతనప్పుడే బయటికొస్తున్నాడు."

"ఆ మనిషి ఎటు వెళ్ళాడు?"

"హత్య జరిగిన ఇంటివైపు. ఆ ఇంటతను పరీక్షగా చూడలేదు. ఆ మనిషి తైలంలేని జుట్టుతో, నల్ల కళ్ళద్దాలతో, పెద్ద పెద్ద మీసాలతో, తెల్ల ప్యాంటు మీద బిస్కెట్ కలర్ షర్టుతో, కాళ్ళకి తోలు

బూట్లతో, నడిచేవెళ్ళాడట. ముప్పై వుండొచ్చు వయసు. తల వంచుకుని గబగబా నడిచాడట."

"ఇంకా?"

"ఇంటి ముందు వీధిలో తొమ్మిదిగంటలకి ఒక వ్యక్తి వెళ్తూ కన్పించాడు. వీధి చివర ఇంటతను చూశాడు. అప్పుడు వీధిలో ఇంకెవరూ లేరు. ఆ మనిషి పైజామా లాల్చీతో, కాళ్ళకి హవాయి చెప్పులతో, కళ్ళకి చత్వారం కళ్ళద్దాలతో, సన్నగా గడ్డం గీసుకుని, తలకి నూనె బాగా పట్టించి వెనక్కి దువ్వుకుని, చేతిలో పత్రిక పట్టుకుని, వంగి నడుస్తూ వెళ్ళిపోయాడట. వయసు ముప్ఫైపైన ఉండొచ్చు."

జాన్ అడిగాడు. "వెనుక వీధిలో మనిషి ఎప్పుడు కన్పించాడు?"

"సుమారు ఎనిమిది గంటలకి."

"అప్పుడతని చేతిలో ఏముంది?"

"ఏమీ లేదు."

"యురేకా!"

"ఏమిటి?"

"హంతకుడు బాత్ రూంలో తల దువ్వుకున్నాడను కున్నాం కదూ?"

"అవును."

"ఎందుకు దువ్వుకున్నాడనుకున్నారు?"

"చెప్పండి, ఎందుకు దువ్వుకున్నాడు?"

"రూపం మార్చుకోవడానికి. బాత్ రూంలో నూనె రాసుకుని తల దువ్వుకున్నాడు. వెనక్కి దువ్వడంవల్ల అలవాటులేక చిక్కులుపడి వెంట్రుకలు రాలాయి. తర్వాత బూట్లు విప్పేసి హవాయి చెప్పులు వేసు

కున్నాడు. నల్లద్దాలు తీసేసి, చత్వారం అద్దాలు పెట్టు కున్నాడు. పెట్టుడు మీసాలు తీసేశాడు. ప్యాంటు, షర్టు తీసేసి, లాల్చీ పైజామా తొడుక్కున్నాడు. పని పూర్తయ్యాక బయటపడి, జేబులో వున్న పేపరుతీసి పట్టుకొని, నడక మార్చి వంగి నడుస్తూ వెళ్ళిపోయాడు-"

"గాడ్! మీరా ఇద్దర్నీ ఒక్కటి చేస్తున్నారా?"

"ఆ ఒక్కణ్ని అందరిముందుకు తెస్తాను!"

"ఎవరా ఒక్కడు?"

"పద్మజ ప్రేమికుడు."

"జాన్, ప్లీజ్! ప్లీజ్, జాన్, అలా వద్దు!"

"ఏమిటది? మీరుద్యోగం చేయదల్చుకో లేదా?"

"అసంభవమది! ఎవరో దారినపోయే ఇద్దర్నీ కలిపి హైబ్రిడ్ చేసి కేవలం గాలి హంతకుణ్ని సృష్టిస్తున్నారు! పద్మజ ఏమిటి! ఆమెకు ప్రేమికుడేమిటి! ఆ ఇంటిపరువు తీయదల్చుకున్నారా?"

"పరువా? కోడలే పోయాక ఇంకా పరువేమిటి___"

"మీ దగ్గర ఆధారమేమిటి?"

"సుధ ఫోన్ చేసి తనకో ఉత్తరం దొరికిందని చెప్పింది. అది పద్మజకు ప్రకాష్ అనే అతను హెచ్చరిస్తూ రాశాడు."

"ఓహ్, ఇదెక్కడి...."

"హత్య లోపలి మనిషి తోడ్పాటుతో జరిగింది. హంతకుడు ఆ మనిషికి తన సామగ్రి ముందే అందించి అది బాత్‌రూంలో ఉండేలా చూశాడు. అక్కడ వేషం మార్చుకుని, తీసేసిన వస్తువుల్ని మరోచోట ఎక్కడో దాచి వెళ్ళిపోయాడు. అందుకే వస్తున్నప్పుడు గానీ వెళ్తున్నప్పుడుగానీ అతని చేతులో బ్యాగులాంటిది

లేదు—"

"క హా, డిసీజ్ టూ మచ్!"

"కృష్ణన్, మీరు అన్ని క్లూస్‌కి కామెంటరీ చెప్పారు. బాగుంది. మరి హంతకుడి నివాస ప్రాంతం పరిశుభ్ర మైనది, అంతగా కాలుష్యం లేనిది అన్నారు. దానికి చెప్పలేదేమిటి కామెంటరీ? అలాటి వాతావరణంలో ఇక్కడ నివసిస్తున్నదెవరు? మీరు చెప్పే అనుమానితు లందరూ ఈ సిటీ కాలుష్యంలోనే ఉంటున్నారు. కానీ ప్రకాష్ పద్మజ ప్రేమికుడైతే, నా అంచనా తప్ప కుండా ఆమె ఊరు ఏదో పల్లెటూరైతే, అతనక్కడే ఉంటాడు. పల్లెటూళ్ళు పరిశుభ్ర వాతావరణానికి ప్రతీకలు. ఈ క్లూ ప్రకాష్‌కి వర్తిస్తుంది. కాబట్టి ముందు మీరా ప్రకాష్ ఎవరో, అతని గుణాలూ అలవాట్లేమిటో తెలుసుకుని, అప్పుడు కబడ్డీ ఆడండి!" అన్నాడు జాన్.

కృష్ణన్ ఏదో గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు.

"మీరా ఇంటినోసారి బ్యాగుకోసం గాలించండి, ఇన్స్పెక్టర్!" జాన్ వెనకనుంచి అన్నాడు మళ్ళీ.

"అలాగే ఉమేష్‌ని గట్టిగా ఇంటరాగేట్ చేయండి, కృష్ణన్. బాత్‌రూంనుంచి రెండోసారి వెళ్ళాడని అను మానం—" అరిచాడు లాల్.

## 8

మర్నాడుదయం డిటెక్టివ్‌లు ఆఫీసు తెరచి బధకం తీర్చుకుంటోండగా, యిద్దరు వ్యక్తులు వచ్చారు పది గంటలకి.

వాళ్ళ ముఖాలు విషాదంగా, వడలిపోయి వున్నాయి. వాళ్ళలో యాభై ఏళ్లు, ప్యాంటూ షర్టులో, కళ్ళ

దాలతో ఉన్నతను అన్నాడు. "డిటెక్టివ్ గారూ....
నేను పద్మజ తండ్రిని."

లాల్ కళ్ళు విశాలమయ్యాయి. "ఐసీ....కూర్చోండి, మీకు మా ప్రగాఢ సానుభూతి."

అతనికి దుఃఖం పొంగి వచ్చింది.

మరొకతను, పాతికేళ్ళ యువకుడు, అస్పష్టంగా పలికాడు. "చెల్లెలు పోయింది....ఇది తట్టుకోలేకున్నాం! దీన్ని మీరు దర్యాప్తు చేస్తున్నట్లు తెలిసి వచ్చాం. మీకు కొన్ని విషయాలు చెప్పి సహకరించాలి, డిటెక్టివ్ గారూ...."

"అవును, చెప్పండి. మీ సహకారం చాలా ముఖ్యం. ముందు పరిచయాలతో ప్రారంభించండి. మీ దేవూరు? ఏం చేస్తుంటారు?"

"షాద్‌నగర్ దగ్గర కల్లుధార మా వూరు. ఇక్కడికి యాభై కిలోమీటర్లు. మేం అక్కడే వుంటున్నాం. నాన్నగారు అక్కడ హెడ్‌మాస్టరు. నేను మా వ్యవసాయం చూసుకుంటున్నాను. నా పేరు అజయ్‌కుమార్. నాన్న పేరు చలపతిరావుగారు. మా కుటుంబంలో ఇప్పుడు మిగిలింది మేమిద్దరమే...." అతని కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

తండ్రి అన్నాడు ఆవేశంగా. "నలభై వేలు పోసి పంపించాం దాన్ని! ఇంకా మూడేళ్ళు కాలేదు.... అప్పుడే నూరేళ్ళు నిండిపోయాయి! మంచి వంశం మంచి మనుషులు, సుఖపడుతుంది - అది మేం చేసుకున్న అదృష్టమని ఇచ్చాం అమ్మాయిని. ఆ ఇంట్లో దుర్మార్గులనించి, హంతకులనించి రక్షణ లేకపోయింది దానికి!"

"కాలమహిమ" అన్నాడు జాన్.

"అలాగే సరిపెట్టుకొంటున్నాం! వాళ్ళని అని ఏం లాభం? తప్పు మా దగ్గరుంది. అది చచ్చిన పుణ్యమా అని ఇప్పుడెన్ని అవమానాలెదుర్కోవాలో!"

"ఆమె చావు మీ కవమానం తెచ్చిందా?" లాల్ అన్నాడు.

"లేదా? వాళ్ళతో ఎన్ని మాటలు పడ్డాం! మళ్ళీ ముఖం చూపవద్దన్నారు వాళ్ళు—"

"వాళ్ళెందుకన్నారు మాటలు?"

"వూరికే అనలేదు! తెలిసే అన్నారు — పద్మజకు రాసిన ఉత్తరం వాళ్ళ చేతిలో పడింది. అది ప్రకాష్ రాశాడు. ఇక ఆలోచించండి మా పరిస్థితి!"

"ఆగండి—ఆ ఉత్తరం వారం క్రితం వచ్చినట్లుంది. వాళ్ళు నిన్ననే చూశారా?"

"అవును, నిన్న మధ్యాహ్నమే చూశారట. వాళ్ళమ్మాయి సుధకు దొరికిందట—ఆమె అన్న ఉమేష్ తలగడ గలేబులో."

"ఉమేష్ ఏమన్నాడు?"

"ఆ ఉత్తరం అందులో వున్న సంగతి తనకు తెలియదన్నాడు."

"అతను పెట్టలేదటనా?"

"అవును, అసలా ఉత్తరం అతను చూడలేదన్నాడు. దాని గురించి తనకేమీ తెలీదన్నాడు."

"చూశావా పార్ట్నర్, అన్నని ఎలా ఇరికిస్తోందో?" జాన్ అన్నాడు.

"ఎందుకు — ఎందుకు ఇరికిస్తుంది?" చలపతిరావు అడిగాడు.

లాల్ అడ్డంగా తలూపాడు. "మీ అమ్మాయికి

పోస్టుమన్ ఉత్తరం తెచ్చివ్వగా ఎవరైనా చూశారా?"

"లేదట."

"ఎవరైనా తీసుకొచ్చిచ్చారా?"

"లేరుట."

"సరే, మీరు ప్రకాష్ గురించి చెప్పండి. ఇప్పు డెక్కడున్నాడు?"

"ఊళ్ళో లేడు. మొన్న సాయంత్రంనుంచీ కన్పించడం లేదు."

"ఐసీ.... కట్టు బట్టలతో వెళ్ళాడా?"

"అవునట."

"అతనికి మీ అమ్మాయి పరిచయమెలా అయింది? అతనేం చేస్తుంటాడు? తల్లిదండ్రులెవరు?"

"తండ్రి పెద్ద భూస్వామి. వాడేం చెయ్యడు. రౌడీలా తిరుగుతుంటాడు. వాడి బారినుంచి మా అమ్మాయిని కాపాడేందుకు పడ్డ అవస్థలు వర్ణనాతీతం. పద్మజ మొదట్లో ఏమీ తెలియకుండా వాడితో తిరిగింది. నాకు తెలిసి చివాట్లు పెట్టాను. అది లోకాన్ని అర్థం జేసుకోలేదు. మనుషుల్ని అంచనా వేయలేదు. వట్టి అమాయక ఘటం. వాగడం మాత్రమే తెలుసు దానికి....

"నేను కోప్పడ్డాక బయటికి వెళ్ళడం మానేసింది— కానీ వాడే ఇంటికి రావడం మొదలెట్టాడు. నేను వారించాను. ఆ విషయం వాడి తండ్రి దగ్గరికి తీసుకు వెళ్ళాను. అతను నవ్వి వూరుకున్నాడు — ఆ తండ్రి కొడుకుకేం తీసిపోడు. వాళ్ళ వంశమే అంత! మా ఊళ్ళో చెడ్డ వంశం వాళ్ళదే! ఇహ అలా కాదని ఒకనాడు మా వాడు తెగించి వాణ్ని కొట్టాడు—"

"అది తొందరపాటు."

"నేనలాగే భయపడ్డాను. వాళ్ళు తలచుకుంటే ఏమయినా చేయగలరు ప్రతీకారంగా. కానీ అలాంటిదేమీ జరుగలేదు. ఆ కొడుకు తండ్రికి చెప్పుకోలేదు. ఇంటికి వెళ్ళి పెద్ద ఉత్తరం రాశాడు—ప్రేమలో అన్ని పరీక్షలు ఎదుర్కోవాలని. ఇప్పటికీ ఆమెను ప్రేమిస్తున్నానని, ఆమె అంగీకరిస్తే పెళ్ళిచేసుకుంటానని...."

లాల్ ముఖంపై నవ్వు వెలిసింది.

"అప్పుడు మీ అమ్మాయి అభిప్రాయమేమిటి?"

"అది వట్టి పిచ్చిది. దానికప్పుడే తెలిసివచ్చింది—ఆ ఉత్తరం చూశాక—తన పొరపాటు. అంతవరకు వాళ్ళ మధ్య ప్రేమ, పెళ్ళి ప్రస్తావనే రాలేదట. వాడు మనసులోనే ప్రేమించాడట. ఇది తలకాయలేకుండా తిరిగింది. ఆ ఉత్తరం చూసి కంగారుపడిపోయింది. దాని పరిస్థితికి నేను జాలిపడ్డాను. అది క్షమించమని ఏడ్చింది. ఇది జరిగి ఆర్నెల్లయింది...."

"అప్పుడు—?"

"వాడు ఇంటిముందునుంచి తిరగడం ప్రారంభించాడు, ఆశగా జవాబు కోసం. కానీ ఇంటికి రాలేదు. మరో ఉత్తరం రాయలేదు. తర్వాత మూడ్నెల్లకి ఈ సంబంధం చూసి దాని పెళ్ళి చేసేశాం. బరువు దించుకున్నాం. ఆ రాత్రంతా ప్రకాష్ వొళ్ళు తెలియకుండా తాగి పడున్నాడట."

"సీరియస్‌గానే తీసుకున్నాడు."

"వాడి కాడీ మనసుకి అంత సీరియస్‌నెస్ ఏమిటో అర్థంగాలేదు."

"వాళ్ళు కూడా పరిపక్వత చెందుతూంటారు."

"సరే, ఆ సీరియస్‌నెస్‌తోనే వాడు పిచ్చివా

డయ్యాడు. ఈ మూడేళ్లు వాడు మనిషిలా లేడు. మృగంగా ప్రవర్తించాడు. ఇల్లు వదలి బైటికి రాలేదు. ఇంట్లో విపరీతంగా ప్రవర్తించేవాడు. ఒకసారి తండ్రినే కొట్టాడు. చాలాసార్లు పనివాళ్ళని కొట్టాడు అకారణంగా. చేతికేది దొరికితే దాన్ని నాశనం చేయకుండా వదలడు. వాడికి పిచ్చి బాగా ఎక్కువై — చివరికిలా అఘాయిత్యం చేశాడు! ఇప్పుడు వాడికి తృప్తిగా ఉందనుకుంటాను—"

"అతను కన్పించడంలేదని పోలీసు రిపోర్టిచ్చారా?"

"పిచ్చి కొడుకుపోతేనే మంచిదంటున్నాడు తండ్రి."

"ఇక్కడ అతని కెవరైనా వున్నారా?"

"తెలియదు, మీరతన్ని పట్టుకోవాలి, డిటెక్టివ్ గారూ!"

"అలాగే—"

"పట్టుకుని శిక్షపడేలా చూడాలి!" అన్నాడు అజయ్ కుమార్.

"అలాగే! అతను ముందు అరిస్తూ వ్రాసిన ఉత్తరం ఏది?"

"తెచ్చాను. ఇక్కడ బెదిరిస్తూ రాసిన ఉత్తరం కూడా తెచ్చాను—" అని చలపతిరావు రెండు త్తరాలు తీసిచ్చాడు.

లాల్ వాటిని పరిశీలిస్తూ అన్నాడు. "ఈ బెదిరింపుని మీ అమ్మాయి సీరియస్‌గా ఎందుకు తీసుకోలేదు....?"

"అది దేన్నీ సీరియస్‌గా తీసుకోదు. దానికి హ్యూమర్ ఎక్కువ."

లాల్ సాలోచనగా తల వూపుతూ ఆ ఉత్తరాలని మడిచి సొరుగులో పెట్టాడు. "ఆల్ రైట్, అతన్ని పట్టు

కుంటాం. ఇప్పుడు మీ రెక్కడుంటున్నారు?"

"తిరిగి వెళ్ళిపోతున్నాం. ఇక్కడ మాకు సంబంధాలు తెగినట్లే! వాళ్ళు గడప తొక్కొద్దని ముఖంమీద అనేశారు. మనం ఏమనుకుంటామసలు—ఏం జరుగుతుంది! వాళ్ళమ్మాయిని మావాడికిచ్చే అంగీకారం కూడా కుదిరింది. ఇంతలో.... ఇంతలో...."

"ఊహించలేం విధిచేసే వింతల్ని" జాన్ అన్నాడు.

"అలాగే సరిపెట్టుకోవాలిక!"' అన్నాడు చలపతిరావు.

# 9

కృష్ణన్ ఫోన్ చేసి అన్నాడు మధ్యాహ్నం ఒంటిగంటకి. "లాల్, ప్రకాష్ ఆచూకీ — నా ఉద్దేశ్యం—అతని ఊరు తెలుసుకున్నాం. కల్లుధార అట. అక్కడ కల్లు ఎంత ధారగా పడుతుందో తెలియదుగానీ, మనవాడు మాత్రం నెంబర్ వన్ డ్రింకర్. అతను ఇంట్లో లేడు. మొన్న రాత్రినుంచి కన్పించడంలేదట. ఎక్కడికెళ్లాడో ఎవరికీ తెలియదు. బస్సెక్కుతున్నట్లుగానీ, మరో వాహనం ఎక్కుతున్నట్లుగానీ ఎవరూ చూడలేదు. వాళ్ళింట్లో వెహికల్ కూడా లేదు. ఈ సిటీలో అతనికి తెలిసినవాళ్ళెవరూ లేరు. అతని ఫోటో తీసుకుని ఉమేష్ వాళ్ళింటి దగ్గర ప్రశ్నిస్తే, నిన్న కన్పించిన ఆ ఇద్దరు మనుషుల్ని అందులో పోల్చుకోలేకపోయారు. వాళ్ళా మనుషుల ముఖకవళికలు పరీక్షగా చూడలేదట."

"అలాగా...." అన్నాడు లాల్ పరధ్యానంగా.

"ఇక జాన్ చెప్పిన బ్యాగూ ఇంట్లోలేదు. అంతా వెతికాం. దొరకలేదు. టవల్ కూడా లేదు. ఉమేష్ రెండోసారి బాత్రూంనించి వెళ్ళడం అబద్ధం అంటు

న్నాడు. మీ కెవరు చెప్పారు?"

"నేనలా అనుకున్నాను...."

"మీరలాగే అనుకుంటారు. అక్కడ కూర్చుని ఎన్ని ఆలోచనలైనా చేస్తారు. మా లాగా తిరిగిచెయ్యండి, పుణ్యమూ, ఫలితమూ ఉంటాయి. ఉమేష్ రెండోసారి బైటికెళ్ళలేదు. శవం దగ్గర తండ్రి ప్రక్కనే కూర్చు న్నాడు. తండ్రి సాక్ష్యం ఇస్తున్నాడు. మీరీ ఆలోచనలు మానెయ్యండి, లాల్. ప్రకాష్ మనకాకావలసిన మనిషి. అగనిమీద నా కనుమానం కుదిరింది. హంతకుడి లక్షణాలు అతనికున్నాయి. తాగుతాడు. పరిశుభ్ర పల్లె వాతావరణంలో నివసిస్తున్నాడు...."

"మీతో తర్వాత మాట్లాడతాను, కృష్ణన్...." అని లాల్ ఫోన్ పెట్టేసి జాన్ వైపు తిరిగాడు, "డర్టీ ట్రిక్స్! .... డర్టీ ట్రిక్స్! .... హంతకుడికి కామన్ సెన్స్ లోపించింది...."

"ఏమిటి, లాల్?"

"హంతకుడికి మతిలేదు."

"అవును, ప్రకాష్‌కి మతిలేదు. మెంటల్ కేసు."

"అది హంతకుడు ఆలోచించలేదు. ప్రేమలో దెబ్బ తిని పిచ్చివాడయిన ప్రకాష్‌ని ఇరికించాలనుకుంటున్నాడు. అదెంత పొరపాటో తెలియదు అతనికి. మతి చాంచల్యంగల ప్రకాష్ ఇంత పథకంతో, తెలివిగా హత్య చేయగలడని ఎలా నమ్మించాలనుకుంటున్నాడు హంతకుడు?"

"అంటే....!! ఏమిటి నువ్వనేది?"

"ప్రకాష్ ఈ హత్య చేశాడని నువ్వనుకుంటోంటే తక్షణం ఈ వృత్తి మానుకొని వెళ్ళిపోవచ్చు."

"వెళ్ళేముందు అడుగుతాను — ఎందుకు కాదు

హంతకుడు?"

"ఒక మెంటల్ కేసు ఇన్ని ట్రిక్స్‌తో, ఇంత ఆర్భాటంగా హత్య చేయగలడంటే ముఖంమీద నవ్వుతారు. ప్రకాష్ గురించి చలపతిరావు ఏం చెప్పాడో విన్నావు. అతను ప్రేమ విఫలమై ఉన్మాది అయ్యాడు. విపరీత ప్రవర్తన — ధోరణులు ప్రదర్శించాడు. ఒళ్లు కదలని మనోమాంద్యంలో వున్నాడు. అలాటి ఉన్మాదంలో ఆలోచనాశక్తి ఉంటుందా?

"అతని కామెమీద కసి తీవ్రంగా పెరిగి, ఓర్పులేని సాయికిపోతే—అదే పిచ్చిలో — ఆవేశం, ఉద్రేకంలో—ఎవర్నీ దేన్నీ లెక్కచెయ్యకుండా నేరుగా వెళ్ళి చంపడం పూర్తిచేస్తాడు. ఇన్‌స్టెంట్ మర్డర్. దానికో పద్ధతీ పథకం అంటూ వుండదు. అప్పుడు పట్టుబడ్డా అతను లెక్కచెయ్యడు."

"కానీ అసలతనికి ఆమెమీద కసి ఏర్పడిందా? లేదని జవాబు. ఏర్పడితే రౌడీ మన సత్యంతో ఇంత కాలం ఆగగలిగే వాడా? ఇక్కడ నెగెటివ్ జవాబే. అతనిప్పుడు రౌడీకాదు. ఆ లక్షణాలు పోయాయి. తన మీద తనకే కసి, ద్వేషం, అసహ్యం ఏర్పడ్డాయి. తనని తనే నిందించుకుని హింసలో బ్రతుకుతున్నాడు. ఎందుకంటే, తాను రౌడీగా పేరుబడ్డాడు కాబట్టే ఆమెను పొందే అర్హతను కోల్పోయాడు....నువ్విక్కడ మనోగత భావాల్ని కూడా దృష్టిలో పెట్టుకోవాలి."

"కానీ ఆ ఉత్తరం—"

"ఆ ఉత్తరం — సుధ తనకు దొరికిందని చెప్పింది. అసలు ఆమే హంతకుడికి తోడ్పడిందని నా అనుమానం.

"పార్ట్‌నర్, హంతకుణ్ని కాపాడేందుకు ఆమె రెండు

ప్రయత్నాలు చేసింది. ఆ రెండుసార్లూ ఉమేష్‌ని ఇరికించాలని చూసింది. మొదట బాత్‌రూంనుంచీ మళ్ళీ వెళ్ళాడంది. తర్వాత అతనికి తెలియని, అతను చూడని ఆ ఉత్తరాన్ని అతని తలగడలో దొరికిందంది.

"ఇక్కడా మెకు రెండుద్దేశాలున్నాయి. అన్న కాకపోతే ప్రకాష్ ఇరుక్కోవాలి. ఆ ఉత్తరం చూసి ఉమేష్ పగతో భార్యని బాత్‌రూంలో చంపి, దాన్ని తమ్ముడిమీదికి తొయ్యడానికి తడిటవల్‌తో వెళ్ళి కాళ్ళు తుడిచాడని—లేదా అది రుజువు కాకపోతే అప్పుడు—ఆ ఉత్తరం రాసి ప్రకాషే వచ్చి హత్యచేశాడని.

"వెల్, మొదటిది రుజువుకాలేదు. ఉమేష్ నిర్దోషిగా తేలాడు. అతను బాత్‌రూంనించి రెండోసారి వెళ్ళలేదని తండ్రి సాక్ష్యం వున్నాడు. ఒకవేళ భ్రష్టురాలైన కోడలి కంటే కుమారుడ్ని కాపాడుకోవడం ముఖ్యమని అతనలా చెప్పివున్నా మనం ఆ చర్చలోకి పోవడంలేదు. ఎందుకంటే—లెట్రిన్‌లో ఆ నీటిమడుగు ఉమేష్‌కు తిరుగులేని ఎలిబీ, సాక్ష్యాధారం."

"ఓహ్, అది హంతకుడు గమనించలేదు."

"గమనించలేదు. హంతకుడెవరు? అతని మన స్తత్వం ఏమిటి? అతని ఆలోచనా క్రమంచూస్తే, అతనికి కామన్‌సెన్స్‌తోపాటు ఆత్మవిశ్వాసం లోపించిందని పిస్తుంది. రెండు అనిశ్చిత పరిస్థితులమధ్య కొట్టుమిట్టాడుతున్నాడు. రెండు విభిన్న నిర్ణయాల నడుమ సందిగ్ధంలో పడ్డాడు. దేన్ని తీసుకోవాలి? ప్రకాష్‌ని ఇరికించడమా, ఇంటి సభ్యుల్లో ఒకర్నా? ప్రకాష్ అయితే చాలా రిస్కు వుంటుంది. అతనికి ఎలిబీ లేకుండా చేయడం చాలా రిస్కుతో కూడుకున్న వ్యవహారం. అదే ఇంటి

సభ్యులయితే ఎలిబీ సమస్య వుండదు.

"అందుకే మొదట కుటుంబ సభ్యుల్ని ఎన్నుకున్నాడు. కనుక తన రాకపోకల్ని రహస్యంగా కాపాడుకున్నాడు. మొదటే ప్రకాష్‌ని ఎన్నుకొని వుంటే హత్యాస్థలంలో అతనికి చెందిన వస్తువు ఏదో ఒకటి వదిలిపోయేవాడు. అప్పుడంతా సులువవుతుంది. కానీ ముందు ప్రకాష్‌ని ఎన్నుకోలేదు. ఇంటి సభ్యుడిమీద అస్త్రం ఫెయిలయితే అప్పుడు దింపాలనుకున్నాడు—రిస్కు తీసుకొని. అలాగని ప్రకాష్‌ని వదిలేసి వూరుకోలేదు. ముందు జాగ్రత్తతో అతన్ని బందోబస్తు చేసుకుని రెడీగా వుంచుకున్నాడు.

"ఒ.కే. ఇంటి సభ్యుడిమీద అస్త్రం ఫెయిలయింది. ముందు సతీష్‌ని ఎన్నుకున్నాడు. వదినా మరుదుల మధ్య విరోధమే మోటివ్ అవుతుందనుకున్నాడు. ఆ విధంగా అతడి కాళ్ళు తడి చేసిపోతే చాలనుకున్నాడు. కానీ మనం అలా కాదని కొట్టివేశాం.

"అప్పుడు నువ్వు వెంటనే ఫోన్ చేసి హంతకుడికి ఈ డెవలప్‌మెంట్ తెలియజేసింది.

"హంతకుడు రెండో అస్త్రం ప్రయోగించాడు. ఉమేష్‌ని ఎన్నుకున్నాడు. తాను సతీష్ దగ్గర ఉమేష్‌లా నటించాడు గనక, సతీష్ అన్నమీద ఆరోపించాడు గనుక, ఉమేష్ రెండోసారి బాత్‌రూంనుంచి వెళ్ళాడని చెబితే సరిపోతుందనుకున్నాడు. అతనికి మోటివ్ వుండాలి గనుక, అంతకుముందే సుధకు అందించిన ఆ ఉత్తరాన్ని అతని తలగడలో ప్లాంట్ చేయమన్నాడు.

"వెల్, నేను టవల్ కోసం అతని గదిని గాలించమన్నప్పుడు ఆ నెపంతో ఆమె ఉత్తరాన్ని కనుగొన్నట్లు

నటించింది... కానీ అదీ ఫలించలేదు. ఉమేష్ బాత్‌రూం నుంచి వెళ్ళలేదని రుజువైంది.

"సుధ మళ్ళీ ఈ డెవలప్‌మెంట్ హంతకుడికి తెలియజేసింది .... అప్పుడు పార్టనర్, విధిలేని పరిస్థితుల్లో హంతకుడు ప్రకాష్‌ని దింపక తప్పలేదు."

"కానీ అతనికి ఎలిబీ వుంటుంది—అదెలా?"

"అతనికి ఎలిబీ లేకుండా చేయాలి. అదెలా వీలవుతుంది? అతన్ని ఇంట్లోంచి ఎక్కడికి, ఎలా రప్పించినా హత్యాస్థలానికి రప్పించలేడు కదా? కనుక అతను రప్పించబడ్డ స్థలాన్ని ఎలాగో నిరూపించుకుంటే ఇంకేముంటుంది? అందువల్ల ఎలిబీ లేకుండా చేయడం కాదు, అసలా ప్రశ్న లేకుండా చేయాలి. ఇలా చేయాలంటే ఒక్కటే మార్గం. అందుకే హంతకుడు మొదట అతని గురించి వెనుకాడాడు. కానీ ఇప్పుడు తప్పలేదు—ఇప్పుడు ప్రకాష్ ఎలిబీ ఇచ్చుకోలేడు. ఆ అవసరం వుండదు."

"ఎందుకుండదు?"

"హంతకుడు అతన్ని మాయంచేశాడు గనుక!"

"ఓహ్—"

"కాబట్టి ఇప్పుడు క్రైమ్ వాతావరణ సూచన ఏమిటంటే, రాబోయే కొన్ని గంటలలో మరో హత్య జరుగుతుంది. ప్రకాష్ ఈ లోకం విడిచిపెడతాడు. పద్మజను చంపాడన్న నింద తీసుకుని వెళ్ళిపోతాడు—"

"అయితే హంతకుడు—"

"హంతకుడు సుధకు సన్నిహితుడు. బాగా తెలిసినవాడు. ఉదయం ఇక్కడకొచ్చి ప్రకాష్ అరెస్టుని డిమాండ్ చేసినవాడు—హతురాలికి స్వయానా అన్న—అజయ్‌కుమార్.

"సుధ ఇంకెవరి మాట వింటుంది? ఇంకెవరికి తెగించి అంతలా తోడ్పడుతుంది? అతడామెను ప్రలోభ పెట్టాడు. ఆశలు కల్పించాడు. తామిద్దరికి పెళ్ళి కాబోతోంది. తామిద్దరి సుఖానికి పద్మజ ఎలాగో అడ్డు వుంది. చెల్లెలి ప్రాణం గురించి అన్నకే లేని లెక్క ఆఫ్టరాల్ తన కెందుకు? అతనికి అన్నివిధాలా సహకరించింది. సరిగ్గా పద్మజ స్నానానికి బయల్దేరే సమయంలో పెరటి తలుపు తీసి అజయ్‌కుమార్‌కి బాత్‌రూంలో ప్రవేశం కల్పించింది. ఆ సమయంలో ఆ ప్రాంతాల ఎవరూ ఉండకుండా జాగ్రత్త తీసుకుంది. బాత్‌రూంలో మారువేషం సామాగ్రి వున్న బ్యాగుని చేరవేసింది. పనయ్యాక అతను వేరేచోట దాచి వెళ్ళిపోయాడు. అదామె తర్వాత తీసుకెళ్ళి అందిస్తుంది....

"పద్మజ ఇదేమీ తెలియకుండా బాత్‌రూంలో మృత్యు వలయంలో అడుగుపెట్టింది .... అప్పుడా అన్న అనబడేవాడు ఏమాత్రం కనికరం లేకుండా—ఇంకా ఆ కొత్త దాంపత్యపు ఉక్కిరిబిక్కిరి నుంచి తేరుకోని చిన్నారి చెల్లినీ అంతం చేశాడు."

"కానీ మోటివ్?"

"తెలుసుకుందాం—"

"మరి ఆ ఉత్తరం — ప్రకాష్ రాసిన బెదిరింపు ఉత్తరం?"

"చూడు — దీన్నెంత చంఘాలంగా ఫోర్జు చేశాడో చూడు! ప్రకాష్ అరిన్నూ రాసిన ఉత్తరం తమ దగ్గరే వుంది. దాని ఆధారంగా దీన్నిలా ఫోర్జ్ చేశాడు—ఆ బ్రూట్!"

"ఓహ్! కానీ, చెల్లెలి పూర్వ చరిత్రని ఇలా బైటికి

లాగి వాడుకుంటే—సుధతో తన పెళ్ళి ఆగిపోతుందని తెలియదా? ఇప్పుడలాగే జరిగింది."

"సర్దుకుంటాయి. అవన్నీ సర్దుకుంటాయి. చలపతిరావు పరిపెట్టుకున్నట్టే వాళ్ళూ సరిపెట్టుకుంటారు. అంతా ఒక్కటవుతారు."

"అజయ్‌కుమార్‌ని నువ్వు సరిగ్గానే అనుమానిస్తున్నావా?"

"నువ్వతన్ని గమనించలేదా? మీసాలు లేవు. గడ్డం గీసుకున్నాడు. క్రాఫు ఇటీవలే చేయించుకున్నట్లుంది.... అతన్ని పట్టుకుంటే కృష్ణన్ చెప్పిన లక్షణాలన్నీ రుజువు చేయవచ్చు—నా అనుమానం తప్పుకాదు!" అన్నాడు లాల్.

# 10

అజయ్‌కుమార్ తలుపుతీసి ఆ గదిలోకి వెళ్ళాడు.

చీకటిగా వుంది. తడుముకుంటూ వెళ్ళి స్విచ్ వేశాడు. లైటు వెలిగి గది ప్రకాశవంతమైంది. ఆ ఇరుకు గదిలో ఓ మూల పడున్న బలహీనాకారాన్ని చూశాడు. దగ్గరికి వెళ్ళి నోటి కట్టు విప్పేశాడు. కాళ్ళు చేతులు అలాగే కట్టి వున్నాయి. అతను కళ్ళు తెరచి చూశాడు—

"నువ్వా? నన్నెందుకిలా హింసిస్తున్నావు?" అన్నాడు ఉద్రేకంగా.

అజయ్‌కుమార్ పెద్దగా నవ్వాడు.

"అయిపోయింది, ప్రకాష్ నిన్ను విడిచిపెట్టేస్తున్నాను .... నువ్వు స్వేచ్ఛగా వెళ్ళిపోతావు పై లోకాలకి...."

"నేను—నెక్కడున్నానిప్పుడు?"

"మా పొలంలో బావి దగ్గర పవర్ రూంలో. ఆ

మెయిన్ బోర్డూ, స్విచ్చులూ కనిపించడంలా? పిచ్చోడా, నువ్వు బ్రతకడానికి పనికిరావు?"

"నన్నిక్కడికెలా తెచ్చావు?"

"నీకు తెలియదు. నువ్వప్పుడు నిద్రపోతున్నావు. నేను హైద్రాబాదునుంచి క్లోరోఫాం తెచ్చి, మంత్రం వేసి నిన్ను మా బండిలో వేసుకొచ్చాను."

"ఇప్పుడేం చేస్తున్నావు? ఎక్కడికి పంపుతావు?"

"పై లోకాలాకి, నువ్వు బ్రతికి ఎందుకు? చచ్చిపో. నా చెల్లెలు నీకు దక్కలేదు. ప్రేమలేని జీవితం వ్యర్థం. నా మాట విని చచ్చిపో!"

"నేను చావను."

"ఎందుకు చావవు?"

"బాధల్లో వున్న తీపి చావులో లేదు."

"అరె, ఇదెక్కడి న్యాయం? నువ్వు చావకపోతే నేనెలా బ్రతకడం? పిచ్చోడా, నీకక్కడే బాగుంటుంది! నీ పద్మజ అక్కడే వుంది. అక్కడే ఆటంకాలూ, నిషేధాలూ ఉండవు. స్వేచ్ఛగా ఆమెను ఏలుకో, వెళ్ళిపో!"

ప్రకాష్ కలవరంగా చూశాడు. "పద్మజ—పద్మజకేమైంది?"

"అరె, నీకు తెలియదా? నిన్న ఉదయం నువ్వే చంపావు కదా? పని పూర్తిచేశావు. నీ పగ చల్లారింది— ఈ ప్రపంచంతో నీకవసరం తీరింది—"

ప్రకాష్ గాభరగా చూశాడు.

అజయ్‌కుమార్ పగలబడి నవ్వాడు. "పిచ్చోడా, అలా గాభరాపడకు. ప్రశాంతంగా చావు. పద్మజని నేనే చంపానులే...."

"నువ్వు—నువ్వు చంపావా? ఎందుకు?"

"దాని మొగుడి చెల్లెలితో నాకు పెళ్ళి కుదిరింది. మూడు నెలల్లో జరుగుతుంది. ఇంతలో నా బాబు చిక్కులు పెట్టాడు. దానికి — నా చెల్లెలికి సగం ఆస్తి రాస్తాడట! నువ్వొప్పుకుంటావా ఆడపిల్లకి ఆస్తిలో వాక్యం లేదే? వాళ్ళు ఆస్తులు పెంచేవారా? ఉద్ధరించే వారా? ఇప్పటికే అది నలభై వేలు పట్టుకుపోయింది. అది వండిపెట్టి తనకు సేవలు చేసిందన్న ప్రేమ ఉండొచ్చు నా బాబుకి. ఆ ప్రేమతో ఆస్తి రాస్తానంటాడు. అది నేనెలా ఒప్పుకుంటాను? అలా వద్దని బాబునెలా ఒప్పించగలను? నా ఆస్తి నా యిష్టం అంటాడు. నేను కోర్టుకెళ్తే అయన్ని బడిపంతులుగా పూజించే ఊరి జనమంతా నామీద ఉమ్మేస్తారు....

"కాబట్టి పిచ్చోడా, ఈ సమస్యని నాకాబోయే భార్యకి చెప్పాను. ఆస్తి ముక్కలవుతోంది. మీ ఇంటికే చేరుతుంది. కానీ నీ కుపయోగంలేదు. నువ్వొస్తే నా దగ్గర నువ్వాశించినంత ఉండదు. మరి మీ నాన్న దగ్గర కట్నంతో పాటు ఆస్తి కూడా పంచుకుని వస్తావా? ఊహు, అది సాధ్యం కాదంది. ఈ ఉపద్రవాన్ని ఆపాలంది డార్లింగ్ .... అంతే ఆవేశం. ఇప్పుడు చెల్లెలు లేదు!!!"

"నువ్వెంత దుర్మార్గుడివి...."

"అన్నావా ఆ మాట? లేకపోతే నీలాటి ప్రేమ బిచ్చగాళ్ళు బ్రతగ్గలరా? బంగారు బాబులో నాగే శ్వర్రావునున్నంత పౌరుషంలేదు నీకు. లేకపోతే అలా పాడుకుంటూ తిరిగేవాడివి మీ తోపులో. యూ డై! నువ్వు చావు! నిన్నిప్పుడీ తాడుతో చంపి మీ తోపులో

వ్రేలాడదీస్తాను చింత చెట్టుకి. ఈ బ్యాగు నీ ప్రక్కనే ఉంటుంది. ఇందులో హత్యకుపయోగించిన సరంజామా అంతా వుంది. రేపొద్దున జనం నిన్ను చూసి—ప్రేమ పిచ్చోడు ప్రియురాలిమీద పగతీర్చుకుని ఎలా ప్రాణం తీసుకున్నాడు. చూడండహో అని ముక్కుమీద వేలేసు కుంటారు—"

అజయ్‌కుమార్ ఉలిక్కిపడ్డాడు.

తలుపు చప్పుడైంది.

అతను తిరిగి కంగారుగా చూశాడు. మళ్ళీ చప్పుడైంది. అతను బెదిరిపోతూ ప్రకాష్‌వైపు చూశాడు.

"ముక్కుమీద వేలేసుకో!" అన్నాడతను.

అజయ్‌కుమార్ తేరుకుని, "ఎవరది?" అని కేకేశాడు.

సమాధానం లేదు. తలుపు ఎడాపెడా మోగి పోతోంది....

అతను పిచ్చెత్తిపోయి వెళ్ళి తీశాడు.

బయట డిటెక్టివ్‌లు నవ్వుతూ చూశారు.

—:ఐ పో యిం ది:—

# నూరు గ్రామాలకు దొంగ

## వసుంధర

వీరన్న వీధరుగుమీద కూర్చుని ఉండగా వాళ్ళింటి ముందు ఓ నడివయస్కుడు ఆగాడు. వీరన్నకు ఆ నడివయస్కుడి నెప్పుడూ చూసిన గుర్తులేదు. అందుకని-

"ఎవరిల్లు కావాలి?" అనడిగాడు.

"వీరన్నగారిల్లి దేనాండీ?" అనడిగా డా వ్యక్తి.

"నేనే వీరన్నను—" అన్నాడు వీరన్న కాస్త ఆశ్చర్యపడుతూ.

"నా పేరు లక్ష్మణరావండి!" అన్నాడతను.

పేరు కూడా వీరన్నకు ఎప్పుడూ విన్నట్లనిపించలేదు.

"నన్ను విశాఖపట్నంనుంచి బంగారయ్యగారు పంపారండి—" అన్నాడు లక్ష్మణరావు మళ్ళీ.

బంగారయ్య సంగతి అటుంచితే విశాఖపట్నంలో నే వీరన్నకు తెలిసిన వాళ్ళెవ్వరూ లేరు. అందుకని ఆయన ఇంకా వెర్రి మొహంవేసుకుని ఆ వ్యక్తివంకే చూస్తూ ఉండిపోయాడు.

"మీ యింట్లో నాలుగు రోజులుండి వెడదామని వచ్చాను. ఊళ్ళో నాకు ముఖ్యమైన పని ఒకటున్నదండి. ఎవరింట్లో ఉండడానికీ లేదు. బంగారయ్యగారు మీ పేరు సూచించారు—" అన్నాడు లక్ష్మణరావు.

"మీరు లోపలకు రావచ్చు. కాని బంగారయ్యగా రెవరో నాకు తెలియడంలేదు—" అన్నాడు వీరన్న. ఆయన లోపలకు రావచ్చన్న ఒక్క మాట ఆసరాగా చేసుకుని ఇంట్లో ప్రవేశించాడు లక్ష్మణరావు. వీరన్న కూడా అతడిననుసరించాడు. బంగారయ్య ఎవరో చెప్పే ప్రయత్నమేమీ చేయకుండానే లక్ష్మణరావు మండువాలో ఓ బల్లమీద కూర్చున్నాడు.

అప్పుడు వీరన్నే అడిగాడు "బంగారయ్యగా రెవరు?"

"ఎక్కడో వున్న బంగారయ్యగారి సంగతెందు కండీ? ఇక్కడున్న నా విషయం చెబుతాను. అయితే మొత్తం వివరాలు మీరు రహస్యంగా ఉంచుతానని మాటివ్వాలి—" అన్నాడు లక్ష్మణరావు.

లక్ష్మణరావు తరహా ఏమిటో వీరన్నకు అర్థంకాలేదు. అయినప్పటికీ ఆ మనిషిగురించి కొంతైనా తెలుస్తుందన్న ఆశతో—"చెప్పండి—మాట యిచ్చాననే అనుకోండి—" అన్నాడు.

లక్ష్మణరావు చెప్పనారంభించాడు.

ప్రభుత్వం ప్రజల పరిస్థితి మెరుగుజేయడానికి ఎన్నో పథకాలు, ప్రణాళికలు రూపొందించింది. అన్నింట్లోకీ ముఖ్యమైనది గ్రామాభివృద్ధి. అయితే కొందరు స్వార్థ పరుల కారణంగానూ, ప్రజల అజ్ఞానం కారణంగానూ ఒక్క పథకమూ సరిగా అమలు జరగడంలేదు. డబ్బుకు డబ్బా అయిపోతుంది. ఫలితం కనబడడంలేదు.

అందువల్ల అలాంటి స్వార్థపరుల ఉనికిని కనిపెట్టి వారిని నిర్దాక్షిణ్యంగా అణచివేయాలని ప్రభుత్వం సంకల్పించింది. కమిటీలు వేసే అట్టే ప్రయోజన ముండడంలేదు. బహిరంగంగా ఏ విచారణ సంఘాన్ని నియమించినా స్వార్థపరులు తమ పలుకుబడి వినియోగించి తప్పుడు సమాచారం అందేలాగునో, తప్పుడు నివేదిక తయారయేలాగునో చేయగల్గుతున్నారు. ఇది గ్రహించిన ప్రభుత్వం కొత్త పద్ధతి అనుసరించాలనుకుంది. ప్రతి గ్రామంలో ఎవరెవరు యెలాంటి అన్యాయాలు చేస్తున్నారో, ఎవరెవరు ఎలా నష్టపోతున్నారో తెలుసుకోవడం కోసం భారీ ఎత్తున రహస్య గూఢచారుల్ని నియమించింది.

లక్ష్మణరావు అలాంటి గూఢచారి.

ఇది వినగానే వీరన్నకు కాళ్ళూ, చేతులూ ఆడలేదు. "అయితే మీరు మా యింట్లో వుండొద్దు. ఈ విషయం బయటపడిందంటే ఆ సూరిబాబుగారు నన్ను బ్రతక నివ్వడు—"

"సూరిబాబెవరు?" అన్నాడు లక్ష్మణరావు తాపీగా.

"ఈ గ్రామానికి మకుటంలేని మహారాజు. పేరుకి మునసబే అయినా ఊరి ప్రెసిడెంటు కూడా ఆయనకు గడగడలాడతాడు. ఊళ్ళో అంతా కూడా ఆయనకు అంతో యింతో ఏదో విధంగా బాకీ పడివున్నారు. ఆయన దగ్గర అప్పుతీస్తే ఆయన తీర్చమన్నప్పుడు డబ్బు లేకున్నా ఎలాగో అలా తీర్చాలి. వద్దంటే వడ్డీ పెరుగుతున్నాసరే బాకీ తీర్చకూడదు. ఆయనకోపం వస్తే పది రోజుల్నించి మంచాన పడివున్న వాడు కూడా దొంగతనం చేశాడన్న నేరంమీద జైలుకు పోవలసిందే! ఆయన

కెప్పుడు కోపంవస్తుందో తెలియదు. అదాయన కెప్పు డొస్తుందోనని భయపడుతూ దినదిన గండంలా రోజులు వెళ్ళబుచ్చుతూంటారు—" అన్నాడు వీరన్న.

"బంగారయ్య నాకు మంచి ఇల్లే చెప్పాడు. మీరు ఇచ్చిన సమాచారం నాకు ఎంతగానో సహాకరిస్తుంది—" అన్నాడు లక్ష్మణరావు.

"అయ్యబాబోయ్—నేను మీకు సమాచారం చెప్ప లేదు. పరిస్థితి అర్ధంచేసుకుంటారని సంగతి చెప్పానంతే-" అన్నాడు వీరన్న వణికిపోతూ.

"వీరన్నగారూ—మీరు భయపడకండి. సూరిబాబు రావణాసురుడైతే నేను శ్రీరామచంద్రుణ్ని! ఎంతటి వాణ్నైనా వంచగల శక్తి నాకుంది. నా శక్తియుక్తులు మీరే చూద్దురుగాని! ఒక ప్రభుత్వోద్యోగికి మీరు తప్పక ఆశ్రయమిచ్చి సహాకరించగలరని బంగారయ్య చెప్పాడు. ఆయన అబద్ధం చెప్ప లేదని నాకిప్పుడనిపిస్తోంది!" అన్నాడు లక్ష్మణరావు.

అతడి కళ్ళలో ఏదో మెరుపు. ముఖంలో ఏదో తేజస్సు. అది గమనించిన వీరన్న ఇంకేమీ అనలేక ఊరు కున్నాడు. బంగారయ్య ఎవరని కూడా అడగలేదు. అడిగి ప్రయోజనంలేదని ఊరుకున్నాడు.

## 2

వీరన్న ఆ గ్రామంలో ఒక సామాన్య గృహస్థు. ఆయనకు నాలుగెకరాల భూమి, యాభై అయిదేళ్ళ వయసు, ఇద్దరు కూతుళ్లు, ఇద్దరు కొడుకులు, స్వంతిల్లు ఉన్నాయి. కూతుళ్ళిద్దరికీ పెళ్ళిళ్ళయి కాపురాలకు వెళ్ళి పోయారు. పెద్ద కొడుక్కి పెళ్ళయింది. కోడలు కాపు రానికివచ్చి నాలుగేళ్ళయింది. మనవడు కూడా పుట్టాడు.

రెండో కూతుక్కిరవై ఏళ్లు. ఇంకా పెళ్ళి కాలేదు.

ఇంట్లో ఎవరికీ అక్షరజ్ఞానానికి మించిన చదువులేదు. మగాళ్ళు ముగ్గురూ కలిసి స్వంత వ్యవసాయంచేసి ఏడాదికి మూడు పంటలు తీస్తున్నారు. జీవితం ఫరవా లేదన్నట్లుగానే ఉంది కానీ అదంతా సూరిబాబు దయ మీద ఆధారపడివుంది.

రెండో కూతురి పెళ్ళిచేసినపుడు వీరన్న సూరిబాబు దగ్గర కొంత డబ్బు అప్పుతెచ్చాడు. సగానికిపైగా చెల్లు వేశాడు. మిగతాది సూరిబాబు తీసుకోవడంలేదు. అవతల వడ్డీ పెరుగుతోంది. సూరిబాబు బాకీ తీర్చనివ్వడు. ఏదో ఒక రోజున ఆ నాలుగెకరాలూ కాజేస్తాడేమోనని వీరన్న భయం. ఆ ఒక్క భయంలేకపోతే వీరన్న జీవితం చాలా సుఖంగా వున్నట్లు లెక్క.

ఆ ఊళ్ళో ఒక్క వీరన్నకే కాదు. చాలామందికి ఇలాంటి భయాలున్నాయి.

లక్ష్మణరావు రాక వీరన్నకు ఆనందాన్నే కలిగించింది. ఆయనకు సూరిబాబు గురించిన పూర్తి సమాచారం చెప్పాలనే వుంది. కానీ తనకేమవుతుందోనన్న భయమూ ఉంది. ఆయన సందిగ్ధతనాధారంగా చేసుకుని లక్ష్మణ రావు తెలివిగా ఆయననుంచి చాలా సమాచారం రాబట్టాడు.

"అసలు సూరిబాబు దగ్గర్నుంచే అప్పెందుకు చెయ్యాలి? ఈ ఊళ్ళో అప్పిచ్చే షావుకారింకొకడు లేడా?" అన్నాడు లక్ష్మణరావు.

"లేకేం—చాలామంది ఉన్నారు. కానీ ఎవరికే అవ సరమున్నా అంతా సూరిబాబు దగ్గరకే వెళ్ళాలి. ఆయన అనుమతిలేనిదే ఊళ్ళో ఇంకెవ్వరూ అప్పులివ్వరు. సూరి

బాబుకు తెలియకుండా ఎవరైనా అప్పిచ్చినా, తీసుకున్నా వాడికి మూడిందన్నమాటే!" అన్నాడు వీరన్న.

"ఇది మరీ చచ్చుగ్రామంలా ఉంది. పౌరుషంతో తిరగబడ్డవారేలేరా?" అన్నాడు లక్ష్మణరావు.

"లేకేం—అలా ఒక్కడే ఒక్కడు ఎదురుతిరిగాడు. ఎదురుతిరిగిన మర్నాట్నించీ వాడు కనపడలేదు. ఇంత వరకూ వాడి ఆచూకీ తెలియలేదు—" అన్నాడు వీరన్న.

లక్ష్మణరావు ఆ మాయమైన వాడి పేరు, వివరాలు తెలుసుకున్నాడు. సత్యం మాయమై నాలుగేళ్ళయిందట.

"అతడి ఆచూకీ నేను బయటపెడతాను-" అన్నాడు లక్ష్మణరావు. ఆవేశం అతడి కళ్ళలో కనబడింది.

"అప్పుడు సత్యంగాడి తలిదండ్రులే ఏమీ చెయ్యలేక పోయారు. నాలుగేళ్ళ తర్వాత ఇప్పుడు మీరేం చెయ్యగలరు?" అన్నాడు వీరన్న—"పోలీసులు, ప్రభుత్వాధికారులు అంతా ఆ సూరిబాబు చేతిలోని మనుషులు—"

"ఇప్పుడు నేను సత్యం యింటికి వెడతాను—" అంటూ లక్ష్మణరావు లేచాడు.

వీరన్న భయంగా—"వద్దు—మీరు కూపీ లాగడం మొదలెడితే ముందు మా పని అయిపోతుంది—" అన్నాడు.

"నేనుండగా మీకేం భయంలేదు—" అంటూ లక్ష్మణరావు కదిలాడు. అతడు సత్యం ఇంటికే వెడుతున్నాడని గ్రహించిన వీరన్న కొద్ది క్షణాలు మాత్రం ఆలోచించి తను సూరిబాబు ఇంటికి బయల్దేరాడు.

## 3

"ఏరా పోతరాజూ — బొత్తిగా పదిరూపాయల వడ్డీతో బాకీ కొట్టేద్దామనుకుంటున్నావా - వడ్డీ మొత్తం

నూర్రూపాయలు కావలసిందే. అంతవరకూ బాకీ తీర్చొద్దు—” అన్నాడు సూరిబాబు.

“పిల్లలుగలవాణ్ని బాబూ — తమరలాగంటే ఏమై పోతాను? దయుంచి ఈ బాకీ జమకట్టుకోవాలి!” అన్నాడు పోతరాజు.

“నేను మాటంటే మాటే!” అన్నాడు సూరిబాబు.

పోతరాజు సూరిబాబు పాదాలు పట్టుకుని—“తమరి కెందుకో నామీద కోపమొచ్చింది. కారణం చెబితే తప్పుకాయమని లెంపలేసుకుంటాను. ఈ రోజు కాకపోతే మళ్ళీ బాకీ తీర్చుకోలేను—” అన్నాడు.

సూరిబాబు నిట్టూర్చి — “బాత్తిగా కాళ్ళు పట్టేసుకున్నావు. ఏమీ అనలేకపోతున్నాను. సరేలే—మాపాలి కాపు కీమధ్య పనెక్కువై పోయి—అన్ని పనులూ సరిగా చేయలేకపోతున్నాడు. మీ రెండోవాణ్ని ఓ మూడు నాలుగు నెలలపాటు మా పశువుల్ని మేపమను. వెళ్ళు-” అన్నాడు.

అదే మహా ప్రసాదమన్నట్లు పోతరాజు బాకీతీర్చి అక్కణ్నించి కదిలాడు. కొడుకెలాగూ కొందరి పశువులు మేపుతున్నాడు. పనిలో పనిగా సూరిబాబు పశువులు మేపడం పెద్ద కష్టంకాదు. డబ్బు సంపాదించడమే కష్టం.

పోతరాజిలా వెళ్ళగానే వీరన్నలా వచ్చాడు.

“ఏంటి వీరన్నా విశేషాలేమిటి?” అన్నాడు సూరిబాబు పలకరింపుగా.

“చాలా పెద్ద విశేషమండి. కాస్త రహస్యంగా చెప్పాలండి—”అన్నాడు వీరన్న.

సూరిబాబు ఆయన్ని వేరే గదిలోకి తీసుకు వెళ్ళాడు.

"వాడి పేరు లక్ష్మణరావండి. ప్రభుత్వ గూఢచారి టండి. గ్రామంలో జరిగే అక్రమాలూ, అన్యాయాలూ గురించి రహస్యంగా కూపీలాగడానికి మనూరొచ్చాట్టండి. వాడు మా యింట్లో దిగాడు. తమరపారం చేసుకుంటూ రేమోనని ముందుగా చెప్పడానికి వచ్చాను—" అన్నాడు వీరన్న కాస్త భయంగానే.

సూరిబాబు భృకుటి ముడతలు పడింది. ఓ నిముషం మౌనంగా ఆలోచించే— "ఇందులో అపారం చేసుకోవ డానికే ముందీ — అంతటి పెద్దమనిషికి మీ యింట్లో ఆశ్రయమివ్వడమొక్కటే కదా నువ్వు చేసిన తప్పు— అతన్ని మా యింటికి పంపు. మర్యాదలు బాగా జరుగుతాయి—" అన్నాడు.

వీరన్న భయంగా— "నిజంగానే మీ యింటికి పంప మంటారా?" అనడిగాడు.

"ఊఁ" అన్నాడు సూరిబాబు.

వీరన్న వెళ్ళిపోయాక సూరిబాబు ఏవేవో ఆలో చించాడు. లక్ష్మణరావు వివరాలు తెలుసుకుని అతడినెలా సాధించాలా అన్నదే అతడి తపన. ఆయనింకా అలాంటి ఆలోచనల్లో ఉండగానే ఆయనింటికి రమణయ్య వచ్చాడు.

"విశేషాలేమైనా ఉన్నాయా రమణయ్యా?" అంటూ సూరిబాబాయన్ను పలకరించాడు.

"పెద్ద విశేషమే—రహస్యంగా మాట్లాడాలండి—" అన్నాడు రమణయ్య. ఆయన కంగారుగా వున్నాడనే చెప్పాలి.

సూరిబాబు రమణయ్యను వేరేగదిలోకి తీసుకెళ్ళాడు.

"లక్ష్మణరావని ఒకడు మా యింటికి వచ్చేడండి.

వాడు ప్రభుత్వ గూఢచారిటండి. మన గ్రామంలో జరిగే అన్యాయాలూ, అక్రమాలూ రహస్యంగా పరిశోధించాలని వచ్చాడుట...."

"అలాంటివాడు నేరుగా మావంటి పెద్దమనుషుల యింటికి రాక మీలాంటి చిన్న మనుషుల్నడిగితే లాభమేమిటి? అసలే మన గ్రామస్థులకు అన్యాయం, అక్రమం అనే పదాలకు అర్థం తెలియదు..." అదోకలా అన్నాడు సూరిబాబు.

"నేను అదేమాట చెప్పానండి. కాని వాడి వాదన ఇంకోలాగుంది. ఈ దేశంలో అన్యాయాలు చేస్తున్న వారందరూ పెద్దమనుషులుగా చలామణీ అవుతున్నారట. నిజం తెలుసుకోవాలంటే చిన్నమనుషులే చెప్పగలరుట-"

"అలాగా—ఇంతకీ వాడికి నువ్వేమని చెప్పావు?"

"వాడు — మా సత్యం గురించి అడుగుతున్నాడు. ఉన్నపళంగా మనిషెలా మాయమైపోయాడు—ఆచూకీ తెలుసుకుందుకు ఏ ప్రయత్నాలూ చెయ్యలేదా, ఊళ్ళో ఎవరైనా మీవాణ్ణేమైనా చేశారేమోనని అనుమానించలేదా—అని అడిగాడు...."

సూరిబాబు భృకుటి ముడతలు పడింది — "సత్యం గురించి అడిగాడా? ఏనాటి సత్యం? నాలుగేళ్ళక్రితం మనగా మాయమైన సత్యం .... ఊరికే ఆశా జ్యోతి అనుకున్న సత్యం మాయమైపోతే నీకంటే ఎక్కువగా నేను బాధపడి వెతకడానికి అన్ని ప్రయత్నాలూ చేయించానే—యిప్పుడు కొడికా ఆచూకీలన్నీ ఎందుకు?"

"ఆదే—నాకూ తెలియక మీ దగ్గరకు పరుగెత్తుకు వచ్చాను—"

"అన్నట్లు నీకు ముగ్గురు మగపిల్లలు కదూ — సత్యం

మధ్యవాడు కదూ——" అన్నాడు సూరిబాబు—"సత్యం ఎలాంటి వాళ్ళతో చేతులు కలిపి మాయమయ్యాడో తెలియదు. కానీ వాడి గురించి ఆచూకీలు తీస్తే మిగతా యిద్దరు కొడుకులకీ ప్రమాదమేమోనని నా భయం. ఇంతకీ నువ్వు వాడికేం చెప్పావు?"

"చెప్పడానికి నాకు మాత్రమేం తెలుసునండీ—వాడలా నర్సన్న ఇంటికి వెళ్ళగానే నేనిలా వచ్చాను.." అన్నాడు రమణయ్య.

"ఆ లక్ష్మణరావు నర్సన్నింటికి వెళ్ళాడా? అక్కడికి వెళ్ళమని ఎవరు చెప్పారు?" అన్నాడు సూరిబాబు. ఈసారి అతడి మాటల్లో కంగారుంది.

"నేను కాదండి —" అన్నాడు రమణయ్య చటుక్కున.

# 4

"వాడు మా యింటికి రాలేదు—" అన్నాడు ప్రెసిడెంటు.

"వాడు మీ యింటికెందుకొస్తాడూ—ఆట్నించి నరుక్కొస్తున్నాడు—" అన్నాడు సూరిబాబు.

"ఎట్నించి నరుక్కొచ్చినా మనకేం భయం? మనమేమైనా అన్యాయాలూ, అక్రమాలూ చేస్తున్నామా ఏమన్నా నా?" అన్నాడు ప్రెసిడెంటు.

"అవుననుకో—కానీ...." అని ఆగాడు సూరిబాబు.

ఇంట్లో తల్లీ, తండ్రీ పిల్లలకు తెలీకుండా ఎన్నో పనులు చేస్తూంటారు. అందులో కొన్ని స్వసుఖం కోసం. మరి కొన్ని పిల్లల భవిష్యత్తుకోసం. కానీ రహస్యాల విలువ పిల్లలకు తెలియదు. వాళ్ళకేమైనా రహస్యం తెలిసిందంటే అది దాచవలసినదైనా సరే—ఎవరైనా

అడిగితే చెప్పేస్తారు.

"ఈ గ్రామానికి మనం తల్లిదండ్రులలాంటి వాళ్ళం. మన గ్రామస్థులు పసిపిల్లలాంటి అమాయకులు, వాళ్ళె వరికేం చెబుతూంటారో ఓ కంట కనిపెట్టాల్సిన అవసరం మనకుంది—" అన్నాడు సూరిబాబు.

సూరిబాబు హెచ్చరిక ప్రెసిడెంటుకరమయింది— "నేనంతదూరం ఆలోచించలేదు. అతన్నోసారి పిలిపించ మంటారా?" అన్నాడు.

"అతనంటే ఎవరు? లక్ష్మణరావేనా?"

"ఊఁ,"

"లక్ష్మణరావును మనం పిలిపించడమేమిటి? వాడే వెతుక్కుంటూ మనింటికి రావాలి కానీ...." అన్నాడు సూరిబాబు.

"రాడని నా కనిపిస్తోంది. మూడు రోజులయింది. ఇంతవరకూ ఎందరిళ్ళకో వెళ్ళాడు కానీ మనిళ్ళకు రాలేదు...." అన్నాడు ప్రెసిడెంటు.

"ఈ మూడు రోజులుగా మీరతని గురించి ఆలోచించారా?"

ప్రెసిడెంటు తల అడ్డంగా ఆడించాడు.

"ఇలాగైతే ముందు ప్రమాదం మీకే వస్తుంది—" అన్నాడు సూరిబాబు చిరాగ్గా.

"ఏ ప్రమాదం వచ్చినా అన్నింటికీ మీదే భారం—" అన్నాడు ప్రెసిడెంటు వినయంగా.

సూరిబాబు ముఖం ప్రసన్నమయింది — "నా అనుమానం-వాడికి చాలా సమాచారం చేరుతోందని. ప్రజలు చాలా అమాయకులు. తాత్కాలికంగా వచ్చిన ఇలాంటి వాళ్ళ మాటలు నమ్మి ఉన్నపళంగా తమ కష్టాలూ,

దరిద్రం తీరిపోతాయనుకుంటారు. నిత్యం మనలో కలిసి ఉండాలన్నమాట మరిచిపోతారు—"

"అయితే ఇప్పుడేం చేయాలంటారు?"

"ఆ లక్ష్మణరావును మొత్తం సమాచారం సేకరించ నిద్దాం. ఆ పని పూర్తయ్యాక అతనెలాగూ మనదగ్గరకే వస్తాడు. ఎవరెవరు ఎలాంటి సమాచార మిచ్చారో తెలుసుకుందాం. ముందు లక్ష్మణరావుకు శిక్ష వేద్దాం. అది పూర్తికాగానే ఎంతమంది మన దగ్గరకొచ్చి క్షమాపణలు చెప్పుకుంటారో చూద్దాం. ఆ తర్వాత మిగతా వాళ్ళ సంగతి ఆలోచించొచ్చు—" అన్నాడు సూరిబాబు.

"అమ్మమ్మమ్మ.... మీ బుర్రకు ఎంత పదును?" ప్రెసి డెంటు మనస్ఫూర్తిగా మెచ్చుకున్నాడు.

"పదును నాది. ఫలితంమీది. అదృష్టంమీది—" అని ఒక్క క్షణం ఆగి — "బయట్నుంచి మనమీదకు శత్రు వొచ్చినప్పుడే మనలో మనకెందరు శత్రువులున్నారో తెలుసుకునే అవకాశం వస్తుంది—" అన్నాడు సూరి బాబు.

"మీ మాట అక్షర లక్షలు చేస్తుంది-" అన్నాడు ప్రెసిడెంటు.

## 5

"నమస్కారమండి—నా పేరు లక్ష్మణరావు—"

అతన్ని చూసి తడబడ్డాడు ప్రెసిడెంటు — "నమ స్కారం—రండి—కూర్చోండి."

"నేను చాలా ముఖ్యమైన పనిమీద ఈ ఊరొచ్చా నండి—" అన్నాడు లక్ష్మణరావు కుర్చీలో కూర్చుంటూ.

"చెప్పండి!" అన్నాడు ప్రెసిడెంటు.

లక్ష్మణరావు క్లుప్తంగా తన గురించి చెప్పుకున్నాడు.

"నాకు చాలా సంతోషంగా ఉంది. ఈ గ్రామస్థుల గురించి నాకు బాగా తెలుసు. వారికి నేను తిరుగులేని నాయకుణ్ని. నన్ను తప్ప వేరెవరినీ నాయకుడిగా అంగీకరించరు వాళ్ళు. అసలు మీరీ గ్రామం వచ్చి ఎన్నాళ్ళయింది? సరాసరి మా యింటికే వచ్చి ఉంటే మీకు కావలసిన మొత్తం సమాచారం ఓ గంటలో ఇచ్చేసి ఉండేవాణ్ని—" అన్నాడు ప్రెసిడెంటు.

"ఒక విద్యార్థి కష్టపడి చదువుతున్నాడనుకోండి. అతడు మంచి మార్కులతో పరీక్ష ప్యాసవుతాడని ఊహించి చెప్పొచ్చు. కానీ నేను ఊహించడానికీ, ఊహలు వినడానికీ రాలేదు. స్వయంగా పేపర్లు దిద్దడానికి వచ్చాను—" అన్నాడు లక్ష్మణరావు.

ప్రెసిడెంటు ముఖం చిన్నదయింది—"అయితే మీరు గ్రామస్థులనుంచి సమాచారం సేకరించారా?" అన్నాడు.

"చాలావరకూ పూర్తయింది—"

"అయితే ఆ సమాచారం నాకూ ఇవ్వండి. ప్రెసిడెంటును కాబట్టి అది నాకూ ఎంతో ఉపయోగపడవచ్చు—" అన్నాడు ప్రెసిడెంటు.

"క్షమించాలి. అది చాలా రహస్యం. నేను రహస్యంగానే ప్రభుత్వానికి పంపించాల్సి ఉంటుంది—" అన్నాడు లక్ష్మణరావు.

అనుమానం, భయం, కోపం అన్నీ ఒక్కసారిగా కలిగాయి ప్రెసిడెంటుకి—అన్నీ నొక్కిపెడుతూ—"అయితే నా దగ్గర కెందుకు వచ్చినట్లు?" అన్నాడు.

"ఊరి ప్రెసిడెంటుగా నాకు చెప్పాల్సిందేమైనా ఉన్నదేమోనని!"

ప్రెసిడెంటు అదోలా నవ్వి—"మాది ఆదర్శ గ్రామం.

ఇక్కడెవరికీ అన్యాయాలు జరగడంలేదు. ఎవరూ అక్రమాలు చేయడంలేదు....” అన్నాడు.

“కానీ నాకు అందిన సమాచారాన్నిబట్టి అలా అనిపించడంలేదు—” అన్నాడు లక్ష్మణరావు సూటిగానే.

“ఎందుకలా అనుకుంటున్నారు?” అన్నాడు ప్రెసిడెంటు.

“ఊళ్ళో స్కూలుకు ఫండ్సు గ్రాంటయ్యాయి. కానీ అదింకా పాకల్లోనే నడుస్తోంది. రోడ్లకి రెండు గ్రాంట్సు వచ్చాయి. కానీ అవి మహా దరిద్రంగా ఉన్నాయి. కుళాయిలు వేయిస్తున్నామని చందాలు వసూలుచేశారు. ఆ డబ్బేమయిందో తెలియదు. వయోజన విద్యా కేంద్రాలు రెండున్నాయన్నారు. ఒక్కటీ కనబడలేదు. లైబ్రరీలో పుస్తకాలు కొన్ని బిల్లులు చాలా వున్నాయి కానీ పుస్తకాలాట్టే కనబడ్డంలేదు. ఇలా చెప్పుకుంటూ పోవాలంటే చాలా ఉన్నాయి....” అని ఆగాడు లక్ష్మణరావు,

ప్రెసిడెంటుకు వళ్ళంతా చెమటలు పట్టాయి. ఏం మాట్లాడాలో తెలియలేదు. ఇలాటి విషయాల్లో సూరిబాబుకున్న తెలివితేటలు ఆయనకు లేవు. ఊళ్ళో వాడెవరైనా లక్ష్మణరావన్న మాటలు అని ఉంటే— వాడి వంటిమీద కొరడా విహారం జరిగివుండేది. అన్నవాడు సామాన్యుడు కాడు. ప్రభుత్వ గూఢచారి.

ప్రెసిడెంటు నెమ్మదిగా-“మీరొకసారి సూరిబాబు గారిని కూడా కలుసుకుని మాట్లాడడం మంచిదని నా అభిప్రాయం—” అన్నాడు.

లక్ష్మణరావు ఆశ్చర్యంగా — “అందరూ చెప్పినట్లే జరిగిందిక్కడ—” అన్నాడు.

"అంతేంటి?" అన్నాడు ప్రెసిడెంటు ఆశ్చర్యంగా.

"ప్రెసిడెంటుగా మీరే సలహా ఇవ్వలేరనీ—సూరి బాబుగారి వద్దకు వెళ్ళి మాట్లాడమంటారనీ చాలామంది అన్నారు—" అన్నాడు లక్ష్మణరావు.

ప్రెసిడెంటు తిన్న షాకు సామాన్యమైనది కాదు. ఆయన షాకులోంచి తేరుకునేలోగా లక్ష్మణరావు అక్కణ్నించి వెళ్ళిపోయాడు.

# 6

"వాడు మిమ్మల్ని కలుసుకుందుకు వచ్చాడా?" అనడిగాడు ప్రెసిడెంటు.

"లేదు...." అన్నాడు సూరిబాబు.

"అయితే మిమ్మల్ని కలవకుండానే రిపోర్టు పంపేస్తాడేమో-పరిస్థితి ప్రమాదకరంగా వుంది—" అన్నాడు ప్రెసిడెంటు. ఆయన మొత్తం జరిగిందంతా సూరిబాబుకు చెప్పాడు.

"అలాగా — అయితే ఈ రోజు అప్పిగాడికి పని తగిలిందన్నమాట—" అన్నాడు సూరిబాబు.

ఆ మాటలకు సంతోషించాలో, భయపడాలో తెలియలేదు ప్రెసిడెంటుకు. అప్పిగాడి గురించి ఆయనకు బాగా తెలుసు.

వాడు ఆరడుగుల గున్న ఏనుగులా ఉంటాడు. లేడిలా పరుగెడతాడు. నిలువెత్తు తాడిచెట్టును రెండు చేతులతో పెకలించగల శక్తిమంతుడు. వాడు గత పది సంవత్సరాలుగా సూరిబాబు పోషణలో ఉంటున్నాడు. సూరిబాబు మాట వాడికి వేదవాక్కు. ఆయన మాటమీద మనుషుల్ని చంపడానికి కూడా సందేహించడు వాడు.

"లక్ష్మణరావుకు మూడింది!" అనుకున్నాడు ప్రెసి

రెంటు. ఆయనింకే వివరాలూ అడక్కుండానే వెళ్ళి పోయాడు.

ఆ రాత్రి పన్నెండు గంటలకు అప్పిగాడు యిల్లు వదిలాడు. తిన్నగా వీరన్న ఇల్లు చేరాడు.

వీధి అరుగుమీద మడత మంచం వేసుకుని పడు కున్నాడు లక్ష్మణరావు. అప్పిగాడు అతణ్ని తట్టిలేపాడు.

లక్ష్మణరావు కళ్ళు నులుముకుంటూ లేచి — "ఎవ ర్నువ్వు?" అన్నాడు.

"నీ ప్రాణాలు తీయడానికి వచ్చాను...." అన్నాడు అప్పిగాడు.

లక్ష్మణరావు అతణ్ని తేరిపార జూశాడు. మనిషి యమమూతలాగున్నాడు — "సరే — నా ప్రాణాలు తీద్దువుగాని. కానీ తీసేముందు నా ఆఖరి కోరిక తీర్చు-"

"ఏమిటది?"

"నువ్వెవరో తెలుసుకోవడం—"

"నా పేరు అప్పిగాడు. నన్ను సూరిబాబుగారు పంపించారు—"

"ఓహో—అప్పుడు సత్యం దగ్గరకూ ఆయన నిన్నే పంపించాడా?" అన్నాడు లక్ష్మణరావు.

"సత్యం ఎవరు?" అన్నాడు అప్పిగాడు.

"నాలుగేళ్ళ క్రితం నీ చేతుల్లో పడ్డాడు. రమణయ్య గారి రెండో అబ్బాయి—" అన్నాడు లక్ష్మణరావు.

"అవును. వాణ్ని ఎక్కడ కప్పెట్టానో సరిగ్గా ఆ పక్కనే ఇంకో గొయ్యి తీసి మరీ వచ్చాను—నీకోసం!" అన్నాడు అప్పిగాడు.

"ఎంత ధైర్యంగా చెబుతున్నావు? ఊళ్ళోని ప్రజలు

ఇది విన్నారంటే నిన్ను బ్రతకనిస్తారా?" అన్నాడు లక్ష్మణరావు.

అప్పిగాడు నవ్వి — "ప్రజలదాకా ఎందుకు? ఈ ఊళ్ళో, గాలి కూడా సూరిబాబుగారు వీచమంటేనే వీస్తుంది!" అన్నాడు.

"అలాగా — అయితే నిన్నిప్పుడీ అరుగుమీద పడుకోమని అన్నదెవరు? సూరిబాబుగారా, నేనా?" అన్నాడు లక్ష్మణరావు. అతడి మాటలు పూర్తి కాకుండానే అప్పిగాడు మనిషి ఉన్నపళంగా కుప్పలా కూలిపోయాడు. క్షణాలమీద మనిషికి స్పృహ తప్పించే సూదిని లక్ష్మణరావు అప్పిగాడిమీదకు వదలడం, అది పనిచేయడం.... కలలా జరిగిపోయింది.

లక్ష్మణరావు లోపలకు వెళ్ళి ఇంట్లోవాళ్ళను లేపి జరిగింది చెప్పాడు.

వీరన్న వణికిపోతూ—"సూరిబాబుగారు నీమీదకు అప్పిగాణ్ని పంపాడంటే నువ్వాయనకు ప్రబల విరోధి అన్నమాట. నిన్నింక మా ఇంట ఉంచుకోవడం కూడా ప్రమాదం!" అన్నాడు.

అసలు సూరిబాబు చేస్తున్న నేరాలు, ఘోరాలు గురించి పట్టించుకోకుండా ఇలా భయపడడం లక్ష్మణరావుకు చాలా చిరాకును తెప్పించింది. అయినప్పటికీ అతడు దానిని బైటపెట్టకుండా చకచకా రమణయ్యయింటికి వెళ్ళి ఆయన్ను లేపి జరిగిందంతా చెప్పి—"మీ కొడుకును చంపించింది సూరిబాబు. చంపినది అప్పిగాడు. ఆ మాట అప్పిగాడే స్వయంగా నాకు చెప్పాడు. ఈ నిజం మనం గ్రామస్థుల మధ్యకు వెళ్ళి ఎలుగెత్తి ఘోషించాలి—" అన్నాడు.

రమణయ్య లక్ష్మణరావు వంక ఎగాదిగా చూసి—

"ఇప్పుడు నువ్వు కొత్తగా కనుక్కున్నదేమీ లేదు. ఈ నిజం మాకు ఎంత కాలంగానో తెలుసు. అయితే పైకి చెప్పకుందుకు లేదు. పోయిన ఒక్క కొడుకు కోసం నేను రభస చేశానంటే ఉన్న ఇద్దరూ కూడా పోతారు. సూరిబాబుగారు నీ మీదకు అప్పిగాడిని వదిలాడంటే ఇంక నువ్వు ఈ ఊళ్ళో ఉండడం మంచిది కాదు. ఎవ్వరూ నీకు ఆశ్రయమివ్వరు. సుఖంగా బ్రతుకుతున్నాం. మా మానాన మమ్మల్ని బ్రతకనివ్వు—నీ ప్రాణాలు దక్కించుకోడానికీ ఊరు వదిలిపెట్టు—" అన్నాడు.

లక్ష్మణరావుకు ముందు కోపం వచ్చింది. తర్వాత ఆవేశం కలిగింది. ఆపైన జాలికూడా వేసింది. అతను తిరిగి వీరన్న ఇంటికి చేరేసరికి అప్పిగాడింకా అరుగుమీదే పడివున్నాడు. వీరన్న యింట్లో లేడు. జరిగింది చెప్పడానికి సూరిబాబు ఇంటికి వెళ్లాడు.

లక్ష్మణరావు ఆలోచించాడు. తనిప్పుడేం చేయాలి? సూరిబాబు తనని ఈ క్షణంనుంచీ నిర్దాక్షిణ్యంగా వేటాడుతాడు. ఊళ్ళో ఎవ్వరూ తనకాశ్రయమివ్వరు.

లక్ష్మణరావు తొందరగానే నిర్ణయం తీసుకున్నాడు.

## 7

"పారిపోయాడు—పిరికిపంద—" అన్నాడు ప్రెసిడెంటు.

సూరిబాబు నవ్వి — "పారిపోవడం కాదు. పారిపోయేలా చేశాను—" అన్నాడు. తర్వాత అర్థంకానట్లు తనవంక చూస్తున్న ప్రెసిడెంటుకి వివరించసాగాడు—

"ఒక ప్రభుత్వ గూఢచారిని చంపించామంటే చాలా ప్రమాదం. అందుకే ఓ చిన్న అస్త్రం వేశాను. అప్పి

గాడిని వెళ్ళమన్నాను కానీ చంపమనలేదు. వాడి సామర్థ్యం చూశాకంటే మళ్ళీ మన జోలికి రాలేడని నాకు తెలుసు—"

ప్రెసిడెంటునింకా ఒక సందేహం విడవాడలేదు—"వాడిప్పుడు పారిపోయి మళ్ళీ రెట్టింపు బలంతో తిరిగి రాడంటారా?"

సూరిబాబు మళ్ళీ నవ్వాడు — "లక్ష్మణరావు తన ఇంట అడుగుపెట్టగానే పరుగున నా యింటికొచ్చాడు వీరన్న. లక్ష్మణరావు తన కొడుకు గురించి అడగ్గానే నా యింటికి పరుగెత్తుకొచ్చాడు రమణయ్య. ఇలాంటి వాళ్ళు మనకు వ్యతిరేకంగా ఆ లక్ష్మణరావుకి సమాచారమిస్తారని భయపడడం తెలివి తక్కువ—"

ప్రెసిడెంటు సందేహాలింకా తీరినట్లులేదు. ఆయన అంటుతానే—"అసలు రమణయ్య ఇంటికి వెళ్ళాలనీ—ఆ తర్వాత సత్యం గురించి అడగాలనీ ఆ లక్ష్మణరావుకెలా తెలిసిందంటారు?" అన్నాడు.

ఈ ప్రశ్నకు సూరిబాబు కలవరపడలేదు. ఎటొచ్చీ ఇందాకటిలా నవ్వలేదు–"ప్రెసిడెంటుగారూ-కాలవకెళ్ళి కడవతో నీళ్ళు తెచ్చారనుకోండి. దారిపొడుగునా నీళ్ళు చిందుతాయా, లేదా?"

"ఎందుకు చిందవు?"

"అలా చిందిన నీళ్ళు దారి తెలుసుకుందుకు పనికొస్తాయంటారా?" అన్నాడు సూరిబాబు.

ప్రెసిడెంటు ఆలోచించాడు. కాలవనుంచి కావిడలో నీళ్ళు ఎవరు తెచ్చినా కాలవనుంచి ఇంటిదాకా అస్పష్టమైన దారి ఏర్పడుతుంది. అది కావిడి ఏ దారిని ప్రయాణించిందో చెబుతుంది. అయితే సూరిబాబు ఈ

ప్రశ్న ఏ ఉద్దేశ్యంతో వేశాడో తెలియదు. తటపటా యిస్తూ నే— "పనికొస్తాయండి—" అన్నాడు.

"సరిగ్గా చెప్పావు. దారిపొడుగునా నీళ్ళొలికాయి గదా అని కడవల్లో నీళ్ళు లేకుండా పోతాయా చెప్పండి!" అన్నాడు సూరిబాబు.

ప్రెసిడెంటుకు సూరిబాబు హృదయం అర్థమై పోయింది.

గ్రామస్థులు తెలివితక్కువగా నోరుజారి లక్ష్మణ రావుకు కొంత సమాచారం అందించి ఉండవచ్చు. అంత మాత్రాన వారి మనసుల్లో సూరిబాబంటే భయంలేదని కాదు. అది కడవల్లో నీళ్ళలాగ వాళ్ళ మనసుల్లో సుర క్షితంగా ఉంటుంది.

"ఇంక నాకే బెంగ లేదండి—" అన్నాడాయన చటుక్కున.

ఆయనలాగని ఇరవై నాలుగు గంటలు తిరక్కుండా నే వాళ్ళు బెంగపడవలసిన అవసరం ఏర్పడింది.

పట్నంనుంచి ఓ సీఐడీ ఆఫీసరు వచ్చి సూరిబాబును కలుసుకుని తన ఐడెంటీకార్డు చూపించాడు.

సూరిబాబు సీఐడీకి మంచి మర్యాదచేశాడు.

"నన్ను మన్నించాలి. మీమీద కొన్ని ఫిర్యాదులు వచ్చాయి. అవి విచారించి నిజానిజాలు తెలుసుకోడానికి వచ్చాను—" అన్నాడు సీఐడీ.

సూరిబాబు కాస్త దెబ్బతిన్నాడు — "నామీద ఫిర్యాదులా?"

మొత్తం పది ఫిర్యాదులు చదివి వినిపించాడు సిఐడీ.

అవి వింటూ సూరిబాబు ఆశ్చర్యపడ్డాడు. ఈ సమా చారం సీఐడీకి లక్ష్మణరావు ద్వారానే అంది ఉండాలి.

అప్పిగాడనే మనిషిని పోషిస్తూ తనమీద ఇంక్వయిరీకి వచ్చిన ఆఫీసర్లని బెదిరిస్తున్నాడన్నది కూడా ఆ పది ఫిర్యాదుల్లోనూ ఒకటి. సత్యాన్ని చంపించడం కూడా ఉంది. మొత్తం ఫిర్యాదులు వేటిలోనూ అబద్ధంలేదు.

"అన్నీ అబద్ధాలు—" అన్నాడు సూరిబాబు.

"అది విచారించి రిపోర్టు తయారు చేయడానికే వచ్చాను నేను—" అన్నాడు సీఐడీ.

"అయితే ఇందులో కొందరు మనుషులకు కబురు పంపాల్సి వుంది. నా మనుషుల్ని పంపమంటారా?" అన్నాడు సూరిబాబు.

"అవసరంలేదు. నేను సిబ్బందితో వచ్చాను. మా మనుషులు వెళ్ళవలసిన వాళ్ళందరి ఇళ్ళకూ వెళ్ళారు. నేనిలా వచ్చాను. వాళ్ళు సమాచారం సేకరించుకుని వస్తారు. ఈలోగా మీరు నేనడిగిందానికి సమాధానాలు చెప్పండి—" అన్నాడు సీఐడీ.

సూరిబాబుకు పచ్చి వెలక్కాయ గొంతుకలో పడ్డట్లయింది. ఎంత పని జరిగింది? తనకు క్షణం కూడా వ్యవధి లేకుండా లక్ష్మణరావు ఎంత పనిచేశాడు? ఇలా జరుగుతుందని తానూహించలేదు.

"మీకు ఫిర్యాదులు అంది ఎంతకాలమయింది?"

"ఈ ప్రశ్న మీకు ఏ విధంగా సహకరిస్తుంది?"

సూరిబాబు గొంతు సవరించుకున్నాడు — "కొంత కాలంక్రితం ఈ ఊరికి లక్ష్మణరావు అనే నడివయస్కుడు వచ్చాడు. ఈ ఊళ్లో తనకు కంట్రాక్టులు ఇప్పించమని నా చుట్టూ తిరిగాడు. వీలుకాదన్నానని నాపై పగబట్టి నామీద తప్పుడు ఫిర్యాదులు చేస్తానని బెదిరించాడు. నిన్న తెల్లారేసరికి ఊళ్ళోంచి మాయమయ్యాడు. అతనే

మీ దగ్గరకొచ్చి ఈ ఫిర్యాదులు ఇచ్చి ఉంటాడని నా అనుమానం—"

"మాకీ ఫిర్యాదులు అంది వారం రోజాలు కావస్తోంది—" అన్నాడు సీఐడీ గంభీరంగా.

"అయితే ఊళ్ళో ఉండే ఫిర్యాదులు పంపేడన్న మాట—" అన్నాడు సూరిబాబు అప్రయత్నంగా.

"మీరిక నేనడిగిన ప్రశ్నలకు జవాబులు చెబుతారా?" అంటూ గొంతు సవరించుకున్నాడు సీఐడీ.

సూరిబాబు దేవుడిమీద భారంవేసి అన్నీ అబద్ధాలు చెప్పడానికి సిద్ధపడ్డాడు.

# 8

"మిమ్మల్నెలా అభినందించాలో నాకు తెలియడం లేదు—" అన్నాడు ప్రెసిడెంటు.

సూరిబాబు చెమ్మగిలిన కళ్ళు తుడుచుకుని — "నిజంగా నే ఈ ప్రజలకోసం ఏమైనా చేయాలనిపిస్తోంది. వీళ్ళు నా పట్ల చూపించే విశ్వాసం ఇంతా అంతా కాదు. ఒక్కరంటే ఒక్కరు కూడా నా గురించి ఒక్కటంటే ఒక్క పొల్లుమాట చెప్పలేదు. సీఐడీ తెల్లముఖం వేసుకుని వెళ్లాడు. ఇలా జరుగుతుందని నాకు నమ్మకం ఉంది. అయితే నమ్మకం వేరు-జరగడం వేరు—"

"మీరు ఊరు అంటే ప్రజలకోసం ఏదైనా చేయాలని నాకూ ఉంది—" అన్నాడు ప్రెసిడెంటు ఆత్రుతగా.

సూరిబాబు ఆయన వంక చురచురా చూసి-"ఊళ్ళో లోపాయికారీగా నా గురించి గ్రామస్థు లేమనుకుంటారో తెలుసా? ఆ సూరిబాబు గురించి కానీ ప్రెసిడెంటు గారికి ఊరికోసం ఏమైనా చేయాలన్న తపన ఉందని! ఇప్పటి మీ మాటలు ఆ విషయాన్ని ఋజువు చేస్తున్నాయి.

నా గురించి తప్పితే మీరు ప్రజాసేవ ధారాళంగా చేసే వారన్నమాట—అంతేగా!" అన్నాడు.

ప్రెసిడెంటు కంగారుపడ్డాడు — "నా మాటల్లో మరేదైనా అర్థం మీకు గోచరిస్తే నన్ను మన్నించాలి. మీ అంత తెలివిగా మాట్లాడడం నాకు రాదు. అసలు సంగతి చెబుతాను వినండి—" అంటూ ప్రారంభించాడు.

సాధారణంగా ప్రతి మనిషికి అన్యాయమో, మోసమో చేసి—అందరికంటే ఎక్కువ సంపాదించాలని ఉంటుంది. న్యాయానికీ, సత్యానికీ తెలివి అవసరంలేదు. అన్యాయానికీ, మోసానికీ తెలివి తేటలుకావాలి. ఆ తెలి వి తే ట లు ప్రెసిడెంటుకుపయోగపడుతున్నాయి. అందువల్ల ఏం చేయాలన్నా ఆయన సూరిబాబుమీదే ఆధారపడతాడు. అదీ ప్రెసిడెంటు చెప్పదల్చుకున్నది.

"ఏదో ఆవేశంలో అలా అనేశాను గానీ—నిజంగా ప్రజాసేవ ప్రారంభించామంటే మనం మట్టయిపోతాం. అది కూడా ఒక వ్యసనం లాంటిది. అసలైన ప్రజా సేవకుణ్ని ప్రజలు కూడా గౌరవించరు. నాలుగు డబ్బు లున్నవాణ్ని, నలుగుర్నీ వంచగలిగిన వాణ్నీ మాత్రమే ప్రజలు గౌరవిస్తారు. అసలు సిసలు ప్రజాసేవకు అలవాటు పడ్డామంటే మనలో స్వార్థం నశించిపోతుంది—" అని సూరిబాబు క్షణం ఆగాడు—

"నేనే అసలు సిసలు ప్రజాసేవకుడిననుకోండి. అప్పు డెవరో కిట్టనివాళ్ళు నామీద ఫిర్యాదులు చేశారను కోండి. అప్పుడు గ్రామస్థులు ఇంత కచ్చితంగా నాకు అనుకూలంగా చెప్పరు. అప్పుడు నన్ను సీఐడీ అరెస్టు చేయొచ్చు. అయినా నన్ను రక్షించుకు నేందుకు ఎవ్వరూ ముందుకు రారు. మంచివాడనుకునే వాళ్ళం — కాదన్న

మాట—అని వూరుకుంటారు. డబ్బొక్కటే మనకు అన్ని శక్తులూ ఇస్తుంది. ఈ రోజు వాళ్ళంతా నాకు అనుకూలంగా చెప్పారంటే అది నా మీద భక్తికాదు. భయం. ఆ భయాన్ని ఎప్పటికీ అలా ఉంచగలిగితే నే మనం ఇలా ఉండగలుగుతాం—"

"అయితే ఇప్పుడేం చేయాలంటారు?"

"ప్రజల్ని అలాగే ఉండనిద్దాం. మనం ఇలాగే ఉండిపోదాం—"

## 9

"మీ సలహాకోసం వచ్చాను—" అన్నాడు ప్రెసిడెంటు.

"ఇంకా ఏముందీ — అసలు సమస్య పరిష్కారమై పోయిందిగదా—" అన్నాడు సూరిబాబు.

"ఇది కొత్త సమస్య—" అన్నాడు ప్రెసిడెంటు.

"చెప్పండి—"

"ప్రభుత్వం నుంచి ఓ హెచ్చరిక అందింది—"

"ఇంకా నా?"

"నన్ను పూర్తిగా చెప్పనివ్వండి—" అన్నాడు ప్రెసిడెంటు — "ప్రస్తుతం జయరాజ్ అనే ఓ బందిపోటు దొంగ బయల్దేరాడట. వాడు తన ముఠాతో గ్రామాలమీదపడి దోచుకుంటున్నాట్ట. జయరాజ్ కావడానికి పాతికేళ్ళ వయసువాడైనా మహా జిత్తులమారి అట. ఈ విషయంలో ప్రభుత్వం తను చేయగలిగింది చేస్తున్నప్పటికీ ఎప్పుడు ఏ గ్రామంమీద వాడి దాడి జరుగుతుందో తెలియక పోవడంవల్ల గ్రామాలన్నీ కూడా అప్రమత్తంగా ఉండాలట. అన్ని గ్రామాలతో పాటు నాకూ ఈ హెచ్చరిక అందింది. హెచ్చరికతో పాటు

వాడి ఫోటో కూడా పంపారు—"

సూరిబాబు ఫోటో అందుకుని చూసి — "కుర్రాడు చాలా బాగున్నాడు. దొంగంటే నమ్మడం కష్టం—" అని — "అవునూ — ఫోటో సంపాదించిన పోలీసులు మనిషిని పట్టుకోలేకపోయారా?" అన్నాడు.

"అందులో ఆశ్చర్యమేమీ లేదు. ఏడాది క్రితంవరకూ జయరాజ్ మామూలు మనిషే! ప్రభుత్వ పాలనలో ప్రజలకన్యాయం జరుగుతోందని అతను కొంతమంది కుర్రాళ్ళను కూడగట్టుకుని చట్టాన్ని తన చేతిలోకి తీసుకున్నాడట. అతడు చేసే నేరాలన్నీ తన పేరుతోనే చేస్తున్నాడు. పోలీసులు అతని ఇంటికి వెళ్ళి ఫోటో తీసుకొచ్చారు. మనిషిని మాత్రం ఇంతవరకూ పట్టుకోలేకపోయారు—"

"అంటే అతగాడు నక్సలైటయుంటాడు-" అన్నాడు సూరిబాబు ఏదో ఆలోచిస్తూ.

"ప్రభుత్వపు హెచ్చరికతోపాటు నాకు లక్ష్మణరావునించి కూడా వేరే ఉత్తరం అందింది—" అన్నాడు ప్రెసిడెంటు.

"లక్ష్మణరావునుంచా?" అన్నాడు సూరిబాబు ఆశ్చర్యంగా.

"అవునండి. జయరాజ్ మనగ్రామంమీదకు కూడా ఏ రోజైనా రావచ్చునట. అతగాడిని ఎదుర్కొనడం చాలా కష్టమట. మెరుపులా ఇట్టే వచ్చి అట్టే మాయమైపోతాట్ట. అతడు వెళ్ళిపోగానే పిడుగు పడిన ప్రభావం కనబడుతుందట. జయరాజ్‌ను ఆపాలంటే ప్రభుత్వ సహాయం అవసరమట. తను వచ్చి సాయపడగలడట. అయితే అందుకో షరతు పెట్టాడు. మీరు, నేను

ప్రజలకు చేస్తున్న అన్యాయాలను తక్షణం ఆపు చేయాలిట. ఒక నెల రోజులు మనని గమనించి మనలో మార్పు రాకపోతే తను మన గ్రామం గురించి పట్టించు కోడట!"

"ఓహో—అప్పిగాణ్ని చూసి బెదిరిపోయిన లక్ష్మణ రావు — మనూర్ని బందిపోట్ల బారినుంచి కాపాడ తాడట—" అని నవ్వాడు సూరిబాబు.

"ఏ పుట్టలో ఏ పాముంటుందో—పోనీ మనం అతడి సాయం కూడా తీసుకుంటే?" అన్నాడు ప్రెసిడెంటు.

"ఏ పుట్టలో ఏ పాముందో నాకు బాగా తెలుసు— జయరాజ్ కాదు — వాడి తల్లో జేజేమ్మ వచ్చినా మనూరికేం భయంలేదు. నా దగ్గర ఆ సత్తా వుంది—" అన్నాడు సూరిబాబు నమ్మకంగా. సూరిబాబు దగ్గర అప్పిగాడు మాత్రమే కాదు. పాతికమంది మెరికల్లాంటి మనుషులున్నారు. నాటు బాంబులున్నాయి.

సూరిబాబుతో గొడవంటే ఊరందరికీ భయమే! మరి జయరాజ్ ఎలా ఫీలవుతాడో?

# 10

ఒక రాత్రివేళ గ్రామంలో కలకలం ప్రారంభ మయింది.

ఊళ్ళోకి దొంగలు వచ్చారు. యింటింటికీ వెళ్ళి మనుషుల్ని బయటకు లాగి ఊరిమధ్య మైదానానికి తర లిస్తున్నారు.

కాసేపటికి మైదానమంతా గ్రామస్థులితో నిండి పోయింది. ఇళ్ళన్నీ కాళీ అయిపోయాయి. పదిమంది దొంగలు జనాల్ని కాపలా కాస్తున్నారు. తుపాకులు మధ్య మధ్య గాలిలోకి పేల్చి బెదిరిస్తున్నారు. అక్కడ

చేరిన వారిలో అందరూ వున్నారు—ఒక్క, సూరిబాబు, ప్రెసిడెంటుల కుటుంబాలు తప్ప.

కొంతమంది దొంగలు ఇంటింటికీ వెళ్ళి దోచుకువచ్చిన డబ్బు — బంగారం రెండు కుప్పలుగా పోస్తున్నారు. డబ్బుకు రెండు కుప్పలు—బంగారానికి రెండు కుప్పలు..

తమ కళ్ళ ముందు జరిగిపోతున్న ఈ దోపిడీని అసహాయంగా చూస్తూ హాహాకారాలు చేస్తున్నారు గ్రామసులు. వాళ్ళ హాహాకారాలు వినబడినపుడల్లా గాలిలోకి తుపాకులు పేల్తున్నాయి. అంతా నిశ్శబ్దమై పోతున్నారు—పిల్లలు తప్ప!

ఆ నిశ్శబ్దంలో వినబడే పిల్లల ఏడుపుతో అక్కడి వాతావరణం చాలా తమాషాగా వుంది. ప్రజలందరూ ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకున్నారు.

అలా కొంత సేపు గడిచింది.

అప్పుడక్కడికి ఓ వ్యక్తి హుందాగా నడుచుకుంటూ వచ్చాడు. అతడి ముఖానికి ముసుగు వుంది. అతడు జనాన్ని ఉద్దేశించి-"ప్రబభుత్వాన్ని గడగడలాడిస్తున్న బందిపోటు జయరాజ్ ను నేనే!" అన్నాడు.

ఒక్కసారిగా చీమ చిటుక్కుమన్నా వినిపించేటంత నిశ్శబ్దం ఏర్పడిందక్కడ. పసిపాపల ఏడ్పులు కూడా ఆగిపోయాయి.

"నిజానికి నేను ప్రభుత్వాన్ని గడగడలాడించడం లేదు. ప్రభుత్వానికి సహకరిస్తున్నాను. ఉదాహరణకు బిల్లా రంగాల విషయం తీసుకోండి. వాళ్ళు పసిపాపల్ని హత్యచేశారు. ప్రభుత్వం వారికి ఉరిశిక్షను విధించింది. వాళ్ళకు ఉరిశిక్ష విధించకపోతే అలాంటి ఘోరాలు వారి కారణంగా మరెన్నో జరుగుతాయని ప్రభుత్వానికి

తెలుసు. అందుకే వారి జీవితాలు అర్ధాంతరంగా ముగిసి పోయాయి. అయితే బిల్లాల్ని, రంగాల్ని ప్రోత్సహించి పోషించే నూరిబాబులాంటి వాళ్ళను ఏం చేయాలి? వాళ్ళ నేరాలు బయటపడితే ప్రభుత్వమే వారిని ఉరి తీస్తుంది. కానీ వారి నేరాలు ఎవరు బయటపెడతారు?"

జయరాజ్ క్షణం ఆగి అందరివంకా చూశాడు. అంతా నిశ్శబ్దంగా వింటున్నారు. అతను మళ్ళీ కొనసాగించాడు—

"మీ అందరికీ అప్పిగాడి గురించీ వాడు చేస్తున్న నేరాల సంగతీ తెలుసు. కానీ వాడికి ఉరిశిక్ష పడదు. అందుకు కారణం మీరే! ఆ సంగతలాగుంచండి—ఇక్కడ డబ్బంతా రెండు రాసులుగానూ బంగారమంతా రెండు రాసులుగానూ పోయబడి వుంది. మీ ఊరి జనాభా మూడు వేలు దాటింది. అయితే చిన్నవిగా కనబడుతున్న ఆ రాసులు రెండూ ఊరందరినీ దోచగా వచ్చినవి. పెద్దవిగా కనబడే ఆ రాసులు రెండూ — నూరిబాబు, ప్రెసిడెంటు వగైరా మొత్తం నలుగురు పెద్దల్ని దోచగా వచ్చినవి. ఈ తేడా ఎలా వచ్చింది? ఎందుకు వచ్చింది? దీన్ని మీరెలా సహిస్తున్నారు?"

ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు.

జయరాజ్ మళ్ళీ మాట్లాడేడు—"మీరంతా చవట దద్దమ్మలు. ఎందుకూ పనికిరానివారు. మనిషి రూపంలో వున్న పశువులు. మీరు మనుషులుగా మారడానికి ఒకే ఒక్క అవకాశం ఇస్తున్నాను. మొత్తం ఇక్కడ పేర్చిన రాసులు కలిపేస్తాను. మీతోపాటే నా అనుచరులు కూడా అంతా సమంగా పంచుకుంటాం. ఇక మీదట మీ గ్రామంలో కొద్దీ గొప్ప తేడాలు మరీ

ఇంత ఎక్కువగా వుండకూడదు....” అని ఆగాడతను.

జయరాజ్ అనుచరులిద్దరు ఆ రాసుల్ని సమీపించారు. ఒకడు ధనరాసుల్ని కలిపేశాడు. మరొకడు నగలను కలిపేశాడు. వాళ్ళిప్పుడు తమ నాయకుడివంక చూశారు.

జయరాజ్ తన జేబులోంచి ఒక కాగితం తీశాడు. అందులో ఆ గ్రామంలోని మొత్తం కుటుంబాల పేర్లు వున్నాయి. ఒక్కొక్కరినీ పేరు పేరున పిలిచాడు. అక్కడున్న డబ్బు, బంగారం అక్కడి వారందరికీ పంచిపెట్టడమయ్యాక మిగిలింది అనుచరులు మూటగా కట్టారు.

అప్పుడు జయరాజ్ మళ్ళీ ఇలా అన్నాడు—

“సూరిబాబు గోదాములనిండా ధాన్యరాసులున్నాయి. అవన్నీ అమ్మగా వచ్చిన డబ్బు ప్రెసిడెంటు మీకు సమంగా పంచిపెడతాడు. ఎక్కువ తక్కువలు లేకుండా ఊళ్ళో వున్న భూమిని అంతా సమంగా పంచుకుని హాయిగా జీవించండి. మీకింక సూరిబాబు పీడలేదు. ఆయనే కాదు ఆయన భార్యకానీ, కుమారుడు కానీ మీకింక కనబడరు. ఆయన అనుచరుడు అప్పిగాడు కూడా మీకింక కనబడడు.

గతంలో సూరిబాబు ఎందరో మనుష్ముల్ని మాయం చేశాడు. అదే పద్ధతిలో ఆయన కుటుంబమూ మాయమయింది. ఆయన కుటుంబం మొత్తాన్ని ఎందుకు మాయం చెయ్యాల్సి వచ్చిందంటే—మిమ్మల్నందర్నీ అష్టకష్టాలు పెట్టినప్పటికీ మీకాయన కుటుంబంమీద సానుభూతి పోదని నాకు తెలుసును కాబట్టి!

అంతా నేను చెప్పినట్లు చేయడానికి ప్రెసిడెంటు

ఒప్పుకున్నాడు. ఈ రోజునుంచీ మీరు పూర్తిగా ఋణ విముక్తులు. ఈ రోజునుంచి మీకిష్టమైన స్వతంత్ర జీవనం గడపాలి మీరు. ఇదీ నా కోరిక. మీకేదైనా లోటు జరిగిందో నేను మళ్ళీ వచ్చి తప్పెవరిదో విచారిస్తాను. తప్పు నాయకుడిదైతే అతడికి సూరిబాబుకు పట్టిన గతే పడుతుంది. తప్పు మీదే అవుతుందీ—మీకో నమస్కారం పెట్టి వూరుకుంటాను—" అతనీ మాటలు పూర్తిచేసి తన ముఖంమీది ముసుగు తొలగించాడు.

అందమైన పాతికేళ్ళ ఆ యువకుడిని చూడగానే అక్కడున్న జనాలందరూ అప్రయత్నంగా — "జయ రాజుకీ జై!" అంటూ జయజయధ్వానాలు చేశారు. ఆ తర్వాత గాలిలో ఏదో ప్రేలినట్లయింది.

చూస్తూండగా అక్కడున్న జనాలందరూ స్పృహ తప్పి పడిపోయారు. దొంగలంతా ఒకచోట చేరారు.

జయరాజ్ వాళ్ళందరి వంకా చూసి—"మళ్ళీ అవసర పడితే తప్ప — ఇలాంటి పనికి తలపడకూడదు. మీరు మామూలుగా మీమీ స్వంత వ్యవహారాలు చూసుకోండి—" అన్నాడు.

"ఇప్పటికి నాలుగూళ్ళయ్యాయి. అయినా నీ కింకా అహింసావాదంమీద నమ్మకం పోలేదా?" అన్నాడు దొంగల్లో ఒకడు.

"హింస అనాగరికం. అందుకని నేను దాన్ని ద్వేషిస్తాను. శాంతి కోసం యుద్ధం అవసరమైనట్లు హింసను తొలగించడానికి హింస అవసరమైతే—అప్పుడు దాన్ని ఆశ్రయిస్తాను. సూరిబాబు ఈ గ్రామస్థులను దారుణంగా హింసించాడు. అందు గురించి ఆ గ్రామస్థులే ఆయనపై తిరగబడతారేమోనని ఆశించాను. వాళ్ళను

అజ్ఞానాంధకారంలోంచి బయటకు తీసుకురావాలని ప్రయత్నించాను. ఆయన తను కన్నబిడ్డల్నే మాయం చేసినా ఆయనకు వ్యతిరేకంగా మాట్లాడే సాహసం ఒక్కరికి లేకపోయింది.

ఆయనపై పోలీసులు ఎంక్వయిరీకొస్తే నిజం చెప్పే ధైర్యం ఒక్కరికీ లేకపోయింది. ఇలాంటి వాళ్ళు ఎలా బాగుపడతారు? సూరిబాబు అనే రాక్షసుడినీ ఊరునుంచి తొలగిస్తే మిగతావారందరూ స్థిమితపడి తమ ఆలోచనలకు పదును పెట్టగలరనిపించింది. అందుకే సూరిబాబును కూడా హెచ్చరించి ఒక నెలరోజులు టయిమిచ్చాను. ఆయనది లక్ష్యపెట్టలేదు. చివరికి నాకు హింస తప్పలేదు.

అయితే అంతమాత్రాన అన్ని వూళ్ళూ ఇలాగే వుంటాయని నేననుకోవడంలేదు. అందుకే నేనిప్పుడు మరో గ్రామంలోకి అడుగుపెట్టనున్నాను. ప్రజల ఆలోచనల్లో మార్పులు తీసుకురావడానికీ, వూరి పెద్దల మనసుల్లో భయం రగిలించడానికీ, మరో ప్రయత్నం చేస్తాను. విజయం సాధిస్తే ఏ బాధా లేదు. లేనిపక్షంలో మీరందరూ మళ్ళీ నాకు సాయపడాల్సి వుంటుంది—"

"ప్రజలు నిన్ను గుర్తిస్తారని భయంలేదా?"

జయరాజ్ నవ్వి—"లక్ష్మణరావుగా ఈ గ్రామంలోని అందరికీ పరిచయమైన నేను ఈ రోజు జయరాజ్‌గా వారందరిముందూ నిలబడితే ఒక్కరూ కూడా నన్ను గుర్తుపట్టలేదు. అందువల్ల గుర్తింపబడతానన్న భయం నాకు లేదు. అయితే నేను తలపెట్టిన కార్యక్రమం ఎల్లకాలం జయప్రదంగా కొనసాగించగలనన్న నమ్మకం నాకు లేదు. మనం ప్రజలకోసం పాటుపడుతున్నప్పటికీ — మనం తొక్కుతున్నదారి చట్టవిరుద్ధమైనది. ఏదో ఒకరోజున

నేను పట్టుబడవచ్చు.

కానీ నేను ఎక్కువ శ్రమపడనవసరంలేకుండా ప్రజల్లో చైతన్యం రావాలంటే మన కథలకు మంచి ప్రచారం లభించేలా చేయండి. మన ఆశయాలు ప్రజల మధ్యకు వెళ్ళేలా చేయండి. ఎవరో వచ్చి అన్యాయాల్ని అరికట్టరనీ—అన్యాయాలకూ, అక్రమాలకూ వ్యతిరేకంగా తామే తిరగబడవలసిన ఆవశ్యకత వున్నదనీ వారందరూ గుర్తించేందుకు అనువైన ప్రజల పత్రికను ఎన్నుకోండి-" అన్నాడు.

ఈ కథ ఏ పత్రికలో చూస్తారో వేరే చెప్పనవసరం లేదు. అయితే ఈ కథ చదివి ప్రజలు మారిపోతారనుకుని జయరాజ్ ఉపేక్షించడంలేదు. అతడివద్ద మొత్తం నూరు గ్రామాం పేర్లున్నాయి. ఇప్పటికి నాలుగు గ్రామాలయ్యాయి. మిగతా తొంభైయారు వూళ్ళలో అతనో వూరిని ఎన్నుకోబోతున్నాడు.

వూరి పెద్దలూ జాగ్రత్త! ఏ వూరి పేరో చెబుతామంటే నాకూ తెలియదు. కానీ మీ వూరి పేరు జయరాజ్ లిస్టులోంచి తొలగించగలగడం మాత్రం మీ చేతిలోనే వుంది.

—:ఐ పో యి ం ది:—

# దయ్యం చేసిన హత్యలు

## విశ్వమోహిని

'మేరే అంగ్ సేమే
తుమ్ హారా క్యా కామ్ హై....'

—రాత్రి పదకొండు గంటలకు హుషారుగా పాడు కొంటూ ఇంటి తాళం తీసాడు వెంకట్రావు.

ఓ మిత్రుడితో కలిసి 'లావారిస్' సినిమాకు ఫస్టు షోకి వెళ్ళాడు. సినిమా అయ్యాక యిద్దరూ కలిసి హోటల్ కి వెళ్ళి భోజనం చేసారు. ఆ తరువాత స్నేహితుణ్ని తన కారులో డ్రాప్ చేసి యింటికి చేరుకునేసరికి ఆ వేళ అయింది.

పాంటూ, షర్టూలో నుండి లుంగీ, బనియన్లలోకి మారి, బాత్ రూంలోకి వెళ్ళాడు. పియర్స్ సోపుతో ముఖం కడుక్కొని, టర్కీ టవల్ తో తుడుచుకున్నాడు. తరువాత లివింగ్ రూంలో వున్న డ్రెస్సింగ్ టేబిల్ వద్ద కూర్చుని దువ్వెనతో తల దువ్వుకొన్నాడు. అంత సేపూ ఆతని నోట్లో 'లావారిస్' పాప్యులర్ సాంగ్ నాను

తూనే వుంది.

లివింగ్ రూంలో లైటార్పి, బెడ్ రూంకి వెళ్ళాడు. స్విచ్ వేసినా లైటు వెలగలేదు. బల్బు ఫ్యూజ్ అయి వుంటుందనుకున్నాడు. పడుకునేందుకు బెడ్ వైపు నడిచాడు.

చూపులు బెడ్ మీద పడడంతో — పెద్దగా ఉలిక్కి పడ్డాడు వెంకట్రావు. ఒక క్షణం అతని గుండె ఆగినంత పనయింది. వొళ్ళంతా ముచ్చెమటలు పోసాయి. భయంతో నిలువెల్లా వొణికి పోయాడు. నోట మాట లేదు.

అతని స్థితి చూసా అన్నట్టు దీర్ఘంగా నవ్వింది బెడ్ మీదున్న అస్థిపంజరం!!

కళ్ళు నులుముకుని మళ్ళీ చూశాడు వెంకట్రావు.

తాను కలగనడంలేదు.

అస్థిపంజర మే!

అటు అస్థిపంజరమూ కాకుండా, ఇటు పూర్తిగా మానవశరీరమూ కాకుండా మధ్యస్థంగా వుంది రూపం. ఎక్స్‌రే ఫోటోలు వలె శరీరంలోని ఎముకల గూడు ట్రాన్స్‌పరెంటుగా చీకట్లో మెరుస్తోంది. డెలీరియంలోలా నవ్వు యింకా వినిపిస్తూనే వుంది.

స్వతహాగా ధైర్యవంతుడైన వెంకట్రావు, దిగజారి పోతున్న ధైర్యాన్ని కూడదీసుకుంటూ, "ఎ....ఎవరు.... నువ్వు?" అన్నాడు తడబడుతూ.

సమాధానంగా మళ్ళీ నవ్వు.

ఆ నవ్వు వికృతంగా, విపరీతంగా అతని గుండెలను చీల్చుతోంది....శరీరమంతా జలదరింప జేస్తోంది.

"నువ్వు....నువ్వెవరు?" మళ్ళీ ప్రశ్నించాడు వెంక

ట్రావు.

"నన్నే ఎరుగవూ?" ఎదురు ప్రశ్న.

ఆ స్వరంలోని తీవ్రతకు భయకంపితుడయ్యాడు వెంకట్రావు.

అస్పష్టంగా వున్న ఆ రూపం యెక్కడో అలకించినట్లు అనిపిసోంది.

ఎక్కడో?....ఎవరో??....

"గుర్తుపట్టలేదూ?" తీక్ష్ణమయిన ప్రశ్న.

భయంతో నే తలను అడ్డుగా త్రిప్పాడు.

"లేదు" అన్నాడు హీనస్వరంతో.

"నాగభూషణాన్ని!"

చేతిలో బాంబు ప్రేలినట్లు అదిరిపడ్డాడు వెంకట్రావు.

పరీక్షగా చూసాడు ఆ ఆకారంవంక.

ఔను!

నాగభూషణంలాగే వున్నాడు!

గొంతు నాగభూషణానిదే ననడంలో సందేహంలేదు.

కాని....??

"అసంభవం!" అన్నాడు అస్పష్టంగా.

వికృతంగా నవ్వు.

"నాగభూషణం చచ్చిపోయాడు!" అన్నాడు వెంకట్రావు ధైర్యంగా.

మళ్ళీ అదే నవ్వు....

"నాగభూషణం దయ్యం బ్రతికే వుంది....!"

అంతే!

"బాబోయ్! దయ్యం!!" అంటూ భయంతో పెద్దగా అరిచి పడిపోయాడు వెంకట్రావు.

# 2

అర్ధరాత్రివేళ—

ఎవరో పట్టి కుదిపినట్లయి హఠాత్తుగా మెలకువ వచ్చింది ఇస్మాయిల్‌కి.

కళ్ళు తెరిచాడు.

గదిలో చీకటిగా వుంది.

బ్లూ నైట్‌లాంప్ ఎందుకు ఆరిపోయిందా అనుకున్నాడు.

బెడ్ వద్ద యెవరో నిలుచున్నట్లు అనిపించింది.

కళ్ళు నులుముకుని చూసాడు.

అటు అస్థిపంజరమూ కాకుండా, ఇటు పూర్తిగా మానవ శరీరమూ కాకుండా మధ్యస్తంగా వున్న రూపం. ఎక్స్‌రే ఫోటోలలోవలె శరీరంలోని ఎముకలగూడు ట్రాన్స్‌పరెంట్‌గా చీకట్లో మెరుస్తోంది.

ఉలిక్కిపడ్డాడు ఇస్మాయిల్.

డెలీరియంలోలా సన్నని నవ్వు....

ఇస్మాయిల్ గుండెలు జారిపోయాయి.

"లే, ఇస్మాయిల్!...." ఆ ఆకారం అంది.

మలేరియా జ్వరం వచ్చినవాడిలా నిలువెల్లా వొణికిపోతున్నాడు ఇస్మాయిల్.

"ఇస్మాయిల్!....పాపాల పుట్టవు-నీకూ భయమే?!" వ్యంగ్యంగా వున్న మాటలు—యెక్కడినుండో 'ఎకో' అవుతున్నాయి.

ఆ స్వరం ఎక్కడో విన్నట్లనిపించింది ఇస్మాయిల్‌కి.

"ను....నువ్వెవరు?...."

"నాగభూషణం .. దెయ్యాన్ని....!!" వికృతమయిన నవ్వు.

"బాబోయ్! సై .... తా .... న్!!" భయంతో అరుస్తూ పడిపోయాడు ఇస్మాయిల్.

# 3

మర్నాడు ఇస్మాయిల్ ఇంట్లో కలుసుకున్నారు అతనూ వెంకట్రావూను.

"అరె, భాయ్! ఆ నాగభూషణంగాడి సైతాన్ మూడు రోజులుగా రాత్రులు కనిపిస్తోంది నాకు" అన్నాడు ఇస్మాయిల్.

"నాకూ మూడు రాత్రులుగా కనిపిస్తోంది. అసలు ఇంట్లో పడుకోవాలంటేనే భయంగా వుంది" అన్నాడు వెంకట్రావు భయంగా.

ఆ ఆలోచన రావడంతోనే భయంతో వొణికి పోతున్నారిద్దరూ.

"మా దేశ్ళ్యక్రితం చచ్చి పోయిన నాగభూషణం ఇప్పుడు సైతాన్ అవ్వడం నమ్మబుద్ధి కాకుండా వుంది" అన్నాడు ఇస్మాయిల్.

"అది వాడి దయ్యమే ననడంలో సందేహంలేదు. ఆ రూపం, స్వరం ఎలా మరిచిపోగలం?" అన్నాడు వెంకట్రావు.

"మన రహస్యం తెలుసుకున్న వాడెవడైనా ఆ రూపంలో మనల్ని బ్లాక్ మెయిల్ చేస్తున్నాడేమోనని నా అనుమానం" అన్నాడు ఇస్మాయిల్.

"ఆ రహస్యం ఎవరికీ తెలియదు. ఇది నాగభూషణం దయ్యమే!" అని తేల్చేసాడు వెంకట్రావు.

"ఇన్నేళ్ళ తరువాత ఆ సైతాన్ మన వెంటపడ డానికి కారణమేమిటంటావ్?" సాలోచనగా అన్నాడు ఇస్మాయిల్.

"బహుశా మనల్ని వెతికి పట్టుకు నేసరికి మూడేళ్ళు పట్టివుంటుంది వాడి దయ్యానికి" అన్నాడు వెంకట్రావు.

తల పంకించాడు ఇస్మాయిల్ మౌనంగా.

ఇస్మాయిల్ కి నలభై ఏళ్ళుంటాయి. తెల్లగా, ఎత్తుగా, దృఢంగా వుంటాడు. మానేజిమెంట్ స్టైయిల్ గడ్డం.

వెంకట్రావుదీ అదే వయసు. ఛామనఛాయ రంగులో పొట్టిగా, లావుగా వుంటాడు.

"ఇప్పుడేం చేయాలి మనం?" అడిగాడు వెంకట్రావు.

"అదే ఆలోచిస్తున్నాను" అన్నాడు ఇస్మాయిల్ గడ్డం రాసుకుంటూ.

"వెంటనే ఏ భూతవైద్యుణ్ణో తీసుకొచ్చి ఆ దయ్యం పని పట్టించకపోతే — భయంతోనే చచ్చేలా వున్నాం మనం" అన్నాడు వెంకట్రావు.

"నిజమే. తలచుకుంటేనే గుండె ఆగుతోంది. ఆ సైతాన్ పీడవదిలించుకోవడానికి ఏదో చేయాలి మనం" అన్నాడు ఇస్మాయిల్.

"నాకు తెలిసిన భూతవైద్యుడొకడున్నాడు. వెంటనే అతన్ని పిలిపిస్తాను" అన్నాడు వెంకట్రావు లేస్తూ.

'సరే'నన్నాడు ఇస్మాయిల్

అంతలో టెలిఫోన్ మ్రోగింది.

రిసీవరందుకొని "హలో!" అన్నాడు ఇస్మాయిల్.

"నాగభూషణం దయ్యాన్ని....!"

గతుక్కుమన్నాడు ఇస్మాయిల్.

నాగభూషణం దయ్యం ఫోన్ చేస్తోంది!!

ముచ్చెమటలు పోసాయి ఇస్మాయిల్ కి.

చేతిలో ఫోన్ జారిపోయింది.

"ఏమయింది?" అన్నాడు వెంకట్రావు మిత్రుడి అవస్థ చూసి.

"నాగభూషణం.... సైతాన్!" గొంతు పెకల్చుకుని అన్నాడు ఇస్మాయిల్.

కట్లపాముని చూసినవాడిలా ఉలిక్కిపడ్డాడు వెంకట్రావు.

అంతలో—

టేబిల్ పైకి జారిపోయిన రిసీవరులోనుండి మాటలు స్పష్టంగా వినిపించాయి-'ఇస్మాయిల్!.... వెంకట్రావ్!.. నాగభూషణాన్ని వదిలించుకున్నంత సులభంకాదు— నాగభూషణం దయ్యాన్ని వదిలించుకోవడం .... వంద మంది భూతవైద్యులు వచ్చినా నన్నేం చేయలేరు.... ఇలాంటి పిచ్చి పిచ్చి వేషాలు వేశారో — జాగ్రత్త!.... మళ్ళీ రాత్రికి కలుసుకుందాం....'

రిసీవరులో మాటలు ఆగిపోయాయి.

కొయ్యబొమ్మల్లా వుండిపోయారిద్దరూ.

వారి ముఖాలలో నెత్తురుచుక్క లేదు.

దయ్యం ఫోన్ చేసింది!!

తమ ప్రతి ఆలోచనా దయ్యం పసిగట్టేస్తోంది!

తమ ప్రతి ఎత్తూ దయ్యం కనిపెట్టేస్తోంది.

కింకర్తవ్యతా మూఢులై నిరీక్షంగా ముఖాలు చూసుకుంటూ వుండిపోయారు మిత్రులిద్దరూ.

## 4

అర్ధరాత్రికి ఓ గంటముందు—

తన బెడ్‌రూంలో ఓ భూతవైద్యుణ్ని రహస్యంగా దాచి వుంచాడు ఇస్మాయిల్. నైట్‌లాంప్ వెలిగించి, ముసుగుతన్ని నిద్రపోతున్న వాడిలా పడుకున్నాడు.

అరరాత్రి అయేసరికి నైట్ లాంప్ దానంతటదే ఆరి పోయింది.

నాగభూషణం దయ్యం ఆ గదిలో ప్రత్యక్షమయింది!

'ఇస్మాయిల్ ....!' అన్న పిలుపు.

భయంతో గజగజలాడాడు ఇస్మాయిల్.

"సై ... తా .... న్ ...." అన్నాడు బలవంతంగా నోరు పెకల్చుకుని—దాగివున్న భూతవైద్యుడికి తెలియడం కోసం—

దయ్యం నవ్వింది—డెలీరియంలోలా....

కునికిపాట్లు పడుతున్న భూతవైద్యుడు వులిక్కిపడి లేచాడు.

'ఓం ....హ్రీం .... హ్రూం ....' అంటూ పెద్దగా మంత్రాలు పఠిస్తూ వేపమండలను ఝుళిపిస్తూ ఒక్కో అడుగు వేసుకుంటూ దయ్యాన్ని సమీపించసాగాడతను.

భూతవైద్యుణ్ణి చూడగానే దయ్యం పారిపోలేదు. నిరంగా నిలుచుని అతనివంకే చూస్తూ వుండిపోయింది.

ఇస్మాయిల్‌లో భయమూ, ధైర్యమూ రెండూ సమపాళ్ళలో కలుగుతోన్నాయి.

భూతవైద్యుడు రెట్టించిన చురుకుదనంతో దయ్యాన్ని సమీపిస్తున్నాడు గెంతుతూ.

అతని వేపమండల నృత్యాన్ని ఆసక్తిగా తిలకిస్తోంది దయ్యం.

భూతవైద్యుడు దయాన్ని సమీపించాడు.

"శాకినీ!.... ఢాకినీ!.... శంఖినీ!.... లంఖినీ!.... ఓం... హ్రీం.... హ్రూం...." అంటూ వేపమండల్ని దయ్యం వైపు విసిరాడతను. "చెప్పు, ఎవరు నువ్వు?"

"నీ పాలిట మృత్యువుని!" అంది దయ్యం తొణ

న్కుండా.

ఉలిక్కిపడ్డాడు భూతవైద్యుడు.
సరుకుని మంత్రాల స్థాయిని పెంచాడు.
"ఎందుకొచ్చావిక్కడికి?" మళ్ళీ ప్రశ్నించాడు.
"నిన్ను యమపురికి పంపడానికి!" దయ్యం జవాబు.
త్రుళ్ళిపడ్డాడు భూతవైద్యుడు.
అలజడిని కప్పిపుచ్చుకుంటూ, "నీ పెంకితనం మాని తిరిగి చూడకుండా పారిపో .... లేకుంటే నిన్ను భూస్థాపితం చేసేస్తాను" బెదిరించాడు భూతవైద్యుడు.
"అంతకంటే ముందు నిన్ను పాతాళానికి అణగ్రొక్కేస్తాను" అంది దయ్యం.

అదిరిపడ్డాడు భూతవైద్యుడు.
ఇస్మాయిల్ బెడ్ మీద గజగజ వణికిపోతున్నాడు. అంతవరకు భూతవైద్యుడు వున్నాడన్న ధైర్యం క్రమంగా సడలిపోతోంది.
"ఇది సామాన్యమైన దయ్యంలా లేదు ...భూతమో, పిశాచమో అయివుండాలి!...." స్వగతంలా పైకే అన్నాడు భూతవైద్యుడు. "దీనినిప్పుడే సీసాలోకి దించేసి సముద్రంలో విడిచిపెడతాను."

"అంతకుముందే నిన్ను భూమిలో పాతిపెడతాను.." అంటూ అమాంతంగా భూతవైద్యుణ్ని చేతుల్లో పైకి ఎత్తింది దయ్యం. భయంతో కేకలు పెట్టాడు అతను. తీసుకువెళ్ళి ఫ్రెంచ్ విండోలోంచి నిర్లక్ష్యంగా బయటకు విసిరేసిందతన్ని.
ఆ దృశ్యం వోరకంట గమనించిన ఇస్మాయిల్ కి భయంతో గుండె ఆగినంత పనయింది.

"... ఇదీ సంగతి, ఫ్రాంక్ గారూ! ఎలాగైనా నన్ను కాపాడాలి మీరు" అన్నాడు వెంకట్రావు ప్రాధేయ పడుతూ.

ఆశ్చర్యంతో చూసాడు డిటెక్టివ్ ఫ్రాంక్.

"నేను భూతవైద్యుణ్ని కాను, మంత్రాలతో దయ్యాలను పారద్రోలడానికి. నేర పరిశోధన నా వృత్తి" అన్నాడు.

"నాకు తెలుసు.... కాని, ఆ దయ్యాన్ని వదిలించుకునే మార్గం కనిపించడంలేదు. భూతవైద్యులవల్ల ఆ పని జరుగుతుందన్న నమ్మకం పోయింది. కనుక ఈ విష యంలో నన్నేంచేయమంటారో, ఎలా కాపాడతారో భారమంతా మీమీద పెడుతున్నాను.... మీరు కోరినంత ఫీజు ఇస్తాను. నన్ను కాపాడండి ప్లీజ్ ...." అన్నాడు వెంకట్రావు. భయందోళనలతో సరిగా నిద్రాహారాలు లేక సగం చిక్కిపోయాడతను.

అతన్ని చూస్తూంటే జాలి కలిగింది డిటెక్టివ్ కి.

"మిమ్మల్ని ఏ విధంగా రక్షించగలనో నాకే తెలి యడంలేదు. ఇది చాలా విచిత్రమయిన కేసు.... అయినా, ఆ దయ్యం మిమ్మల్ని నిజంగానే చంపుతుందని మీరు నమ్ముతున్నారా?" అని అడిగాడు.

"ఔను సార్! ఇంతవరకు భయపెట్టి చంపాలని ప్రయత్నించింది. కాని, అలా జరక్కపోవడంతో ఏ పీక పిసికో చంపేస్తుందన్న భయం పట్టుకుంది" అన్నాడు వెంకట్రావు.

"నాగభూషణం బ్రతికుండగా మీరు స్నేహితులని చెప్పారు. మీవల్ల అతనికేదైనా అన్యాయం జరిగిందా?

నిజం చెప్పడం మీకే మంచిది" అన్నాడు ప్రాణ్.

ఒక క్షణం తటపటాయించి, "ఓ వ్యాపారంలో నేను, నాగభూషణం, ఇస్మాయిల్ భాగస్తులం. తెలిసి నేనేమీ అపకారం చేయలేదు నాగభూషణానికి. అయినా, మేమిద్దరమూ కలిసి తనను మోసంచేసినట్లు నాగభూషణం భావిస్తూం దేవాడనుకుంటాను" అన్నాడు వెంకట్రావు.

తరువాత మరికొన్ని వివరాలను సంపాదించాడు ప్రాణ్. నాగభూషణం ఎలా వుంటాడో వెంకట్రావు వర్ణించగా నోట్ చేసుకున్నాడు. మూడేళ్ళక్రితం నాగభూషణం తాంబరంలో ఓ బోట్ ట్రాజెడీలో మరణించినట్లు తెలుసుకున్నాడు.

"వెంకట్రావుగారూ! ఈసారి నాగభూషణం దయ్యం మళ్ళా మీ వద్దకు వచ్చినట్లయితే వెంటనే నాకు టెలిఫోన్ చెయ్యండి" అన్నాడు ప్రాణ్.

డిటెక్టివ్‌కి ఫీజులో కొంత అడ్వాన్సుగా ఇచ్చి, సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు వెంకట్రావు.

తరువాత అసిస్టెంట్ మిస్ గీతను పిలిచాడు ప్రాణ్.

"గీతా! నువ్వు తాంబరం వెళ్ళి నాగభూషణం అనే వ్యక్తి వివరాలను తెలుసుకునిరా. అతని మరణం ఎలా సంభవించిందో, సహజ మరణం అవునో, కాదో కూడా తెలుసుకో" అని పురమాయించాడు.

# 6

టెలిఫోన్ విడవకుండా మ్రోగడంలో మెలకువ వచ్చి రిసీవరు అందుకున్నాడు డిటెక్టివ్ ప్రాణ్.

ఫోన్‌లో వెంకట్రావు గొంతు కంగారుగా వినిపించింది — "ప్రాణ్‌గారూ! తక్షణం బయలుదేరి

రావాలి మీరు...."

"ఏమయింది?" ప్రశ్నించాడు ప్రాణ్.

కాని, అటువైపునుండి జవాబు రాలేదు.

ఫోన్ డిస్‌కనెక్టు అయిపోయింది.

టైము చూసాడు ప్రాణ్.

అర్ధరాత్రికింకా అయిదు నిముషాలుంది.

గబగబా డ్రెస్ చేసుకుని, రివాల్వర్ జేబులో వేసుకుని, గీతను తలుపు వేసుకొమ్మని చెప్పి హడావుడిగా బయటకు పరుగుత్తాడు.

మైలాపూర్‌లో కచేరీరోడ్‌లో వుంది వెంకట్రావు ఇల్లు. పాతదయినా, యిల్లు పెద్దదే.

పోర్టికోలో ప్రాణ్ కారాపుతూంటే, ఎక్కడినుండో క్రాకర్స్ బర్స్టు అయినట్లు శబ్దం వినిపించింది, ఆ నిశ్శబ్ద నిశీధిని చీల్చుకుంటూ.

హఠాత్తుగా అనిపించింది ప్రాణ్‌కి అది పిస్టల్ పేలిన శబ్దమనీ, వెంకట్రావు యింట్లో నుండే వినవచ్చిందనీను.

తక్షణం కారులో నుండి బయట కురికాడు.

ఇల్లంతా చీకటితో నిండివుంది.

వీధి తలుపులు బార్లా తెరిచి వున్నాయి.

లోపల యెక్కడో అడుగుల చప్పుడు వినిపించింది.

అడుగులో అడుగు వేసుకుంటూ ఆ చీకట్లోనే ముందుకు సాగాడు.

లోపల గదులలో ఎక్కడో లైటు వెలుగుతున్నట్టు సన్నని వెలుతురు కనిపిస్తోంది.

మెల్లగా అటువైపు నడిచాడు.

కొన్ని అడుగులు వేసేసరికి హఠాత్తుగా అనిపించింది,

తనను చేరువలో ఎవరో వున్నారని.

జేబులోనుండి రివాల్వర్ తీయబోయాడు.

అప్పటికే ఆలస్యమయిపోయింది.

దేనితోనో అతని తలమీద కొట్టారెవరో!

ఎవరో పరుగెత్తుతున్నట్లు అడుగుల చప్పుడు!!

సమ్మెటపోటులాంటి ఆ దెబ్బతో క్రింద పడిపోయాడు ప్రాణ్. ఏం జరిగిందో గ్రహించేలోపునే అతనికి స్పృహ తప్పింది.

# 7

ఓ అరగంట తరువాత ప్రాణ్‌కి స్పృహ వచ్చింది.

లోపల గదిలోనుండి వెలుతురు కనిపిస్తోంది. ఎక్కడా అలికిడి మాత్రం లేదు.

తల దిమ్ముగా వుంది. ఒకసారి కణతలు గట్టిగా రుద్దుకుని లేచాడు. జేబులు తడుముకున్నాడు. రివాల్వర్ జేబులోనే వుంది. వెలుతురు వస్తూన్న గదిలోకి వెళ్ళాడు.

అది బెడ్‌రూం.

లోపల వెంకట్రావు నేలపైన నెత్తురుమడుగులో పడివున్నాడు. ఛాతీలో బుల్లెట్ గాయముంది.

హత్య....!

తనను కొట్టినవాడు హంతకుడయివుంటాడనుకున్నాడు ప్రాణ్.

గబగబా వెదికాడు యేమైనా క్లూస్ కనిపిస్తాయేమోనని.

హత్యాయుధం కనిపించలేదు.

టీపాయ్‌మీద ఓ కాగితం కనిపించింది. దానిని తీసి చదివిన ప్రాణ్ ఆశ్చర్యపోయాడు.

అది లలిత వెంకట్రావుకు రాసిన లేఖ!

అందులో ఇలా వుంది—

'డార్లింగ్!—

కారణాంతరాలవల్ల ఇవాళ రాలేక పోతున్నాను. రేపు రాత్రి తప్పకుండా వస్తాను. కోపగించుకోవు కదూ?

—నీ లలిత.'

గత దినం రాయబడిన వుత్తరం అది.

అది ప్రాణ్ కి బాగా పరిచయమున్న దస్తూరీ. గీత స్నేహితురాలు లలిత తరచు గీతకు వుత్తరాలు రాస్తూంటుంది, ఒకే సిటీలో వున్నా.అందుకే దానిని సులభంగా పోల్చగలిగాడు.

ఆ వుత్తరం ప్రాణ్ ని ఆశ్చర్యచకితుణ్ని చేసింది.

హఠాత్తుగా బయట పోలీస్ సైరన్ వినిపించడంతో త్రుళ్ళిపడ్డాడు ప్రాణ్.

వెంటనే వుత్తరం మడిచి జేబులో పెట్టుకుని హాల్లోకి వెళ్ళాడు త్వరత్వరగా. లైట్ వేసాడు.

పోలీస్ జీప్ వచ్చి వెంకట్రావు యింటిముందు ఆగింది.

క్రయింబ్రాంచ్ ఇన్ స్పెక్టర్ మాధవ్ జీప్ దిగి లోపలికొచ్చాడు.

హాల్లో ఎదురయిన డిటెక్టివ్ ప్రాణ్ ని చూసి ఉలిక్కిపడి ఆగిపోయాడు.

ఇన్ స్పెక్టర్ వదనంలో ఆశ్చర్యం కొట్టవచ్చినట్టు కనిపించింది.

"గుడ్ గాడ్!....ప్రాణ్! ఇక్కడికెలా వచ్చావ్?" అన్నాడు ఎగిరిపడుతూ.

మందహాసం చేసాడు ప్రాణ్.

"నీకు స్వాగతమిద్దామని" అన్నాడు.

"వాట్ హాపెన్డ్ హియర్?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"మర్డర్."

"అదే — యెవర్ని చంపావని అడుగుతున్నాను" డిమాండ్ చేశాడు ఇన్‌స్పెక్టర్.

"నేను చంపలేదు.... ఈ ఇంటి యజమాని వెంకట్రావుని ఎవరో చంపేసారు" అన్నాడు ప్రాణ్. "శవం బెడ్‌రూంలో వుంది పద."

బెడ్‌రూంలో ప్రవేశించారిద్దరూ.

శవాన్ని, గదినీ పరిశీలనగా చూశాడు ఇన్‌స్పెక్టర్ మాధవ్.

గదిలో చిన్న బుక్ షెల్ఫ్ ఒకటివుంది. అది కొద్దిగా స్థానభ్రంశం చెందినట్లు అనిపించడంతో దానిని జరిపి చూశాడు మాధవ్. గోడలో ఓ చిన్న ఐరన్ సేఫ్ కనిపించింది. దాని తలుపు వోరగా తెరిచి వుంది.

జేబురుమాలుతో దాన్ని పూర్తిగా తెరిచాడు మాధవ్.

సేఫ్ ఖాళీగా వుంది!

డిటెక్టివ్ వంక చూసాడు ఇన్స్‌పెక్టర్.

సాభిప్రాయంగా తలపంకించాడు ప్రాణ్.

"ఇందులోవి ఏమయ్యాయి?" ప్రశ్నించాడు మాధవ్.

"నాకెలా తెలుస్తుంది?" ఎదురు ప్రశ్న వేశాడు ప్రాణ్.

అంబులెన్స్‌కీ, ఫింగర్ ప్రింట్స్ ఎక్స్‌పర్టుకీ, ఫోటోగ్రాఫర్ వగైరాలకు ఫోన్ చేశాడు ఇన్స్‌పెక్టర్.

పోలీసులకు ఆ హత్యను గురించి ఫోన్ చేసింది హంతకుడే అయివుండాలనీ వూహించాడు ప్రాణ్.

వెంకట్రావు బాగా డబ్బున్నవాడనీ, నగరంలోని ఒకటి, రెండు నైట్ క్లబ్స్‌లో వాటాలు వున్నాయనీ తెలుసుకున్న ప్రాణ్, సేఫ్ ఖాళీగా వుండడంతో ఆ హత్య కేవలం ధనంకోసమే జరిగివుంటుందా అనుకొని ఆశ్చర్యపోయాడు.

"ప్రాణ్! యెప్పుడు, యెక్కడ హత్య జరిగినా మాకంటె ముందు నువ్వే ప్రత్యక్షమవుతూంటావు.... టెల్ మీ మాన్, వాటీజ్ యువర్ స్టోరీ నౌ?" అన్నాడు మాధవ్ నిర్మొహమాటంగా.

చిరునవ్వు నవ్వాడు ప్రాణ్. చేతిలోనుండి సిగరెట్ ప్యాకెట్ తీసి ఇన్స్‌పెక్టర్‌కి ఆఫర్ చేశాడు.

"డామ్ యువర్ సిగరెట్!" అన్నాడు మాధవ్ కటువుగా. "స్పిల్ ద స్టోరీ క్విక్‌లీ."

యూనిఫాంలో వుండగా చాలా స్ట్రబర్న్‌గా వుంటాడు మాధవ్. స్నేహితం కూడా గుర్తుకురాదు. అది అతని వృత్తి నేర్పిన విద్య అని తెలిసిన ప్రాణ్ అతని పలుకుల్ని ప్రవర్తనను అంత సీరియస్‌గా తీసుకోడు.

సిగరెట్ వెలిగించి, "వెల్, ఇన్స్‌పెక్టర్! మొదటి నుండీ చెబుతాను విను...." అన్నాడు ప్రాణ్, అసహనంగా చూస్తూన్న మాధవ్‌తో.

రెండు రోజుల క్రితం వెంకట్రావు తనను కలుసుకున్నది మొదలు, ఆ రాత్రి తనకు ఫోన్ కాల్ రావడం వరకు చెప్పాడు. తరువాత తాను పోర్టికోలో వుండగా పిస్టల్ పేలుడు వినిపించడమూ, తాను హాల్లోకి అడుగు పెట్టగానే ఎవరో కొట్టి పారిపోవడమూ వివరించాడు.

అపనమ్మకంగా చూశాడు ఇన్స్పెక్టర్.

"సో, ఈ హత్య దయ్యం చేసిందని నన్ను నమ్మమంటావు కదూ?" అన్నాడు.

"నీ ఇష్టం" అన్నాడు ప్రాణ్.

"యూ ఆర్ రియల్లీ ఇన్ ఎ సూప్ దిస్ టైమ్, మాన్!" అన్నాడు మాధవ్. "మరో మంచి కథ ఏదైనా ఆలోచించు, తప్పించుకోవాలని వుంటే."

"డోంట్ బీ సిల్లీ, మాధవ్! నిజం చెప్పాను. నమ్మకపోతే నీ ఖర్మ!" అన్నాడు ప్రాణ్.

ఎక్స్పర్ట్స్ వచ్చారు. వారు తమ పనులను చేసుకు పోతూంటే దగ్గరుండి సూపర్వైజ్ చేస్తున్నాడు ఇన్స్పెక్టర్.

గదిలో సేఫ్ మీద తప్ప ఎక్కడా వ్రేలిముద్రలు లభించలేదు.

ఇక అక్కడవుండి తాను చేసేదేమీ లేదని గ్రహించిన ప్రాణ్, మెల్లగా అక్కడనుండి జారుకున్నాడు.

అతని మనసంతా గీత స్నేహితురాలు లలిత దస్తూరీలో వున్న వుత్తరం మీదే వుంది.

వెంకట్రావు హత్యతో లలితకు సంబంధం వున్నదా??

# 8

తిన్నగా అన్నానగర్లో వున్న లలిత యింటికి వెళ్ళాడు ప్రాణ్. హౌసింగ్ బోర్డు కట్టించిన ఆ ఇంట్లో అద్దెకుంటోంది లలిత.

టైమ్ రెండు కావస్తోంది.

బజర్ మ్రోగించిన వెంటనే తలుపులు తెరుచుకున్నాయి. లలిత భర్త సుబ్బారాయుడు తలుపుతీశాడు.

"గుడ్ నైట్ మిస్టర్ డిటెక్టివ్!" అంటూ ప్రాణ్ని

ఏప్ చేశాడతను.

సుబ్బారాయుడివంక ఓ క్షణం పరీక్షగా చూశాడు ప్రాణ్.

అతని వయసు దాదాపు నలభయ్ వుంటుంది. సన్నగా, పొడవుగా వుంటాడు. నిద్రలేనట్లు కళ్ళు లోతుకుపోయి, ముఖం పీక్కుపోయినట్లుంది. ఏదో కంపెనీలో సేల్స్‌రిప్రజెంటేటివ్ గా పనిచేస్తున్నాడు అతను.

ఫుల్ డ్రెస్‌లో వున్న అతన్ని చూసి, "ఇంకా నిద్ర పోలేదా?" అని ప్రశ్నించాడు ప్రాణ్, లోనికి నడుస్తూ.

లేదన్నట్లు తలూపాడతను. త్రాగినట్లు వాసన కొడుతోంది.

"లలిత పడుకుందా?" ప్రశ్నించాడు ప్రాణ్.

"లలిత ఇంకా ఇంటికి తిరిగిరాలేదనేగా మీకు ఫోన్ చేశాను?" అన్నాడతను.

"నాకు ఫోన్ చేశారా?!"

"ఔను. ఓ అరగంట క్రితమే మీ అసిస్టెంట్ గీతతో ఫోన్‌లో మాట్లాడాను" అన్నాడు సుబ్బారాయుడు.

"ఏం జరిగింది?" ఆతృత నణచుకుంటూ అడిగాడు ప్రాణ్.

"స్నేహితురాలితో ఫస్టు షో సినిమాకు వెళ్తానంది లలిత. అర్ధరాత్రి దాటినా రాకపోయేసరికి కంగారు పుట్టింది."

"ఆ స్నేహితురాలెవరో తెలుసా?"

"మీ గీత కావచ్చుననుకున్నాను."

ఆశ్చర్యంగా చూశాడు ప్రాణ్.

"అప్పుడప్పుడు మిస్ గీతతో సినిమాలకు వెళుతూం టుంది. అందుకే, ఒకవేళ ఏ కారణంగానో ఆలస్యమయి పోవడంతో ఈ రాత్రికి మీ ఇంట్లో వుండిపోయిం దేమోనని ఫోన్ చేస్తే, అసలు ఇవాళ లలితను చూడనే లేదన్నారు గీత" అన్నాడు సుబ్బారాయుడు. అతని పలుకుల్లో ఆత్రుత, వదనంలో ఆందోళన స్పష్టంగా కని పిస్తున్నాయి.

'లలిత ఏమయింది?' అనుకున్నాడు ప్రాణ్.

అతని ఆలోచనలను పసిగట్టినవాడిలా, "లలిత ఏమ యిందో బోధపడకుండా వుంది. ఏదో భయంగా వుంది. పోలీసు రిపోర్టు ఇద్దామా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు సుబ్బారాయుడు.

లలితకు పాతికేళ్ళుంటాయి. చక్కని పర్సనాలిటీతో అందంగా వుంటుంది. గ్రాడ్యుయేట్....ఏదో ప్రయివేట్ కంపెనీలో స్టెనోగా పనిచేస్తోంది. గీతకు క్లాస్ మేట్ కావడంతో ప్రాణ్ కుటుంబంతో బాగా పరిచయముంది. సీతాకోకచిలుకలా అలంకరించుకుని పురుషులను పిచ్చి వాళ్ళను చేస్తుందే తప్ప, ఆమె తిరుగుబోతు కాదని ఆమె స్నేహితుల అభిప్రాయం.

బిజినెస్ రీత్యా తమ కంపెనీకి తరచుగా వస్తూండే సుబ్బారాయుడితో పరిచయమయింది లలితకు. ఆర్నెల్ల క్రితం వివాహమాడారిద్దరూ. లవ్ మ్యారేజ్ కావ డంతో ఎంతో అన్యోన్యంగా వుంటారు.

ప్రాణ్ కి జేబులోని లలిత వుత్తరం మదిలో మెది లింది.

"టెల్ మీ ఫ్రాంక్లీ....లలితకు ఇతర పురుషులతో పరిచయముందా?" సూటిగా ప్రశ్నించాడు ప్రాణ్.

ఆ ప్రశ్నకు విస్తుపోయినట్లు చూశాడు సుబ్బారాయుడు. "లలిత అలాంటిదికాదని మీకూ తెలుసు" అన్నాడు. అతని స్వరంలో ఆ ప్రశ్న పట్ల అయిష్టత ధ్వనించింది.

"ఇంతకుముందు ఎప్పుడైనా యిలా చెప్పకుండా రాత్రులు స్నేహితురాళ్ళ ఇళ్ళలో గడిపేదా?"

"ఈమధ్య అప్పుడప్పుడు జరుగుతోంది. కాని, ఏ ప్రక్కింటికో ఫోన్ చేసయినా ఆ విషయం నాకు తెలియపరచేది... నాకు తెలిసిన స్నేహితులందరికీ — ఫోన్లు వున్నవాళ్ళందరికీ ఫోన్ చేశాను. ఎక్కడా లేదట. అందుకే కంగారు పట్టుకుంది" అన్నాడు సుబ్బారాయుడు. "పోలీస్ స్టేషన్‌కి వెళదామని డ్రెస్ చేసుకుంటుంటే మీరొచ్చారు."

ప్రాణ్ ఏదో అనబోయేంతలో బయట జీప్ ఆగిన చప్పుడు వినిపించింది. కొన్ని సెకన్లలో టక్‌టక్‌మంటూ బూట్ల శబ్దం వినిపించడంతో గుమ్మంవైపు చూసారిద్దరూ.

ఇన్స్‌పెక్టర్ మాధవ్ ప్రత్యక్షమయ్యాడు.

డిటెక్టివ్‌ని అక్కడ చూసి షాక్ తిన్నాడు ఇన్స్‌పెక్టర్.

"యూ....! మళ్ళీ ఇక్కడ తయారయ్యావా!?" అన్నాడు మాధవ్, ప్రాణ్ నుద్దేశించి ఆశ్చర్యంగా.

"వాటీజ్ ద మాటర్?" అన్నాడు ప్రాణ్ చిరునవ్వుతో.

"మిసెస్ లలితా సుబ్బారాయుడి ఇల్లు ఇదేకదా?" ప్రశ్నించాడు మాధవ్.

"ఔను. నేనే సుబ్బారాయుణ్ని. ఏం కావాలి?"

అన్నాడు సుబ్బారాయుడు ఇన్స్పెక్టర్‌తో. ఎటువంటి వార్త వినవలసివస్తుందోనన్న భయం అతని వదనంలో స్పష్టంగా కనిపిస్తోంది.

"మీ భార్య లలిత ఇంట్లో వున్నదా?"

"లేదు. నేనూ ఆమెకోసమే ఎదురుచూస్తున్నాను."

అతని పలుకులు పూర్తిగా వినిపించుకోకుండా నే డిటెక్టివ్ వంక తీక్షణంగా చూశాడు ఇన్స్పెక్టర్.

"నువ్విక్కడ ప్రత్యక్షమయి లలితను దాచేసావన్న మాట!" అన్నాడు. "అయినా, నేను ఇక్కడికి వస్తానని ఎలా వూహించగలిగావ్?"

"వాట్ డూ యూ మీన్?" అన్నాడు ప్రాణ్ ప్రొటెస్టు చేస్తూ.

"అర్థరాత్రి వెంకట్రావు ఇంటికి వెళ్ళావు. అతను హత్య చేయబడ్డాడు. అక్కడనుండి జారుకుని ఇక్కడికొచ్చావు. లలిత అదృశ్యమయింది" కోపంగా అన్నాడు మాధవ్. "డామిట్....ప్రాణ్! మా పరిశోధనల్లో ఇలా అడ్డుతగులుతున్నందుకు ఏదో రోజున నిన్ను లాకప్‌లో త్రోసేస్తాను."

"లెటజ్ సీ" అన్నాడు ప్రాణ్ మందహాసంతో.

లేడీస్ హేండ్‌బ్యాగ్ ఒకటితీసి సుబ్బారాయుడి ముందుంచాడు మాధవ్.

"ఇది మీ భార్య లలితదేనా?" అని ప్రశ్నించాడు.

ఔనన్నాడు సుబ్బారాయుడు. దానిని చూడడంతో అతని గుండెలు గుభేలుమన్నాయి.

"ఇన్స్పెక్టర్! ఏం జరిగింది? నా లలితకేమయింది?" అంటూ బావురుమన్నాడు.

అనునయంగా అతని భుజంమీద చేయివేశాడు

ప్రాణ్. "లలితకు ఏమీ జరగలేదు గాని, నువ్వు వూరికే భయపడకు" అన్నాడు.

తరువాత, ఇన్స్పెక్టర్ నుద్దేశించి, "ఏమయింది మాధవ్? లలిత హ్యాండ్ బాగ్ నీకెలా వచ్చింది?" అని అడిగాడు.

"నిజంగా నీకేం తెలియదూ?" సూటిగా ప్రశ్నించాడు మాధవ్.

"తెలిస్తే ఎందుకడుగుతాను?"

"వెంకట్రావు బెడ్ రూంలో మంచం క్రిందపడివుందది" అన్నాడు మాధవ్. "లలిత ఎక్కడ?"

ఇన్స్పెక్టర్ ప్రశ్నతో మనసు కుదుటపడిన సుబ్బారాయుడు, తన భార్య ఎవరో స్నేహితురాలితో ఫస్టు షో సినిమాకు వెళ్ళిందనీ, ఇంకా తిరిగిరానందున కంగారు పడుతూ పోలీస్ రిపోర్టు ఇచ్చేందుకు తాను తయారవుతున్నట్లూ చెప్పాడు.

"ఇంత రాత్రివేళ నువ్విక్కడికి ఎందుకొచ్చావ్?" ప్రాణ్ వంక అనుమానాస్పదంగా చూస్తూ అడిగాడు మాధవ్.

"లలిత, గీతకు క్లోజ్ ఫ్రెండు. అర్ధరాత్రయినా భార్య ఇంటికి రాకపోవడంతో మాకు ఫోన్ చేసాడితడు. లలిత వచ్చిందో లేదో చూద్దామని వచ్చాను" అన్నాడు ప్రాణ్.

"మూడ గడ్డికోసం ఈతచెట్టు ఎక్కావన్నా నమ్మ్తాను కాని, నువ్వు వూరికే ఇక్కడకొచ్చావంటే నేను నమ్మను" అన్నాడు మాధవ్.

"అది వృత్తితో అబ్బిన బుద్ధి నీకు!" అన్నాడు ప్రాణ్ చిరునవ్వుతో. "హంతకుడి ఆచూకీ ఏమైనా

తెలిసిందా?"

లేదన్నట్టు తలూపాడు మాధవ్. "డబ్బుకోసం ఎవడో వెంకట్రావును చంపేసివుంటాడనుకుంటున్నాను."

వారి సంభాషణ ఒక్క ముక్కా అర్థంకాలేదు సుబ్బారాయుడికి.

"వెంకట్రావు....హత్య .... అంటున్నారేమిటి? నా భార్య హ్యాండ్‌బాగ్ అక్కడికెలా వెళ్ళింది?" అయోమయంగా ఇన్స్‌పెక్టర్‌ని ప్రశ్నించాడు.

"మిస్టర్ సుబ్బారాయుడూ! మైలాపూర్‌లో వెంకట్రావు అనే ఓ ధనికుడు హత్యచేయబడ్డాడు. హత్యా ప్రదేశంలో మీ భార్య హ్యాండ్‌బాగ్ పడి వుంది" అన్న ఇన్స్‌పెక్టర్ పలుకులతో, అతని ముఖం పాలిపోయింది.

"మీ భార్య తిరిగిరాగానే క్రయింబ్రాంచ్ పోలీస్ స్టేషన్‌కి తీసుకొనిరండి—" అని చెప్పి బయలుదేరాడు ఇన్స్‌పెక్టర్ మాధవ్.

గుమ్మంవరకు వెళ్ళి చటుక్కున వెనక్కు తిరిగి డిటెక్టివ్ వంక చూశాడు మాధవ్ — "ప్రాణ్! వాచ్ యువర్ స్టెప్ .... ఆ తరువాత విచారించి ప్రయోజన ముండదు" అన్నాడు.

పోలీస్ జీప్ వెళ్ళిపోగానే, సుబ్బారాయుడి నుద్దేశించి "లలితకు బాయ్‌ఫ్రెండ్స్ ఎవరైనా వున్నారేమో తెలుసా?" అని ప్రశించాడు ప్రాణ్.

మునుపటిలా వెంటనే లేదని జవాబివ్వలేదు సుబ్బారాయుడు. కాసేపాలోచించి, "ఆ మధ్య నాలుగైదు సార్లు ఒక వ్యక్తితో తిరగడం చూశాను. అడిగితే, అతను తన ఆఫీసు కొలీగ్ అనీ, ఏదో పనిమీద ఇద్దరూ

కలిసి బయటకు వెళ్ళినట్టూ చెప్పింది" అన్నాడు.

"అతనెలా వుంటాడో చెప్పగలరా?"

"తెల్లగా, ఎత్తుగా, దృఢంగా వుంటాడు. వంకీల జుత్తు, మానేజ్‌మెంట్ స్టయిల్ గడ్డం వుంటాయి. కుడి కణతపైన పొడుగ్గా కత్తిగాయం లాంటిది వుంటుంది."

ఆ వర్ణన వినడంతో ఆశ్చర్యపోయాడు ప్రాణ్. 'సీవ్యూ' నైట్ క్లబ్ ప్రొప్రయిటర్ ఇస్మాయిల్‌కి సరిపోతోంది ఆ వర్ణన. ఇస్మాయిల్ వెంకట్రావు స్నేహితుడూ, నైట్‌క్లబ్ భాగసుదూను. పైగా, ఇద్దరూ ఒకప్పుడు నాగభూషణానికి బిజినెస్ పార్ట్‌నర్స్. నాగభూషణం దయ్యం ఇస్మాయిల్‌ని కూడా బెదిరిస్తోంది.

"సీవ్యూ నైట్‌క్లబ్‌కి మీరెప్పుడైనా వెళ్ళారా?" ప్రశ్నించాడు ప్రాణ్.

"లేదు."

"పోనీ, లలిత అక్కడికి ఎప్పుడైనా వెళ్ళేదేమో తెలుసా?"

తెలియదన్నాడు సుబ్బారాయుడు "ఏం?"

"ఏం లేదు."

"ప్రాణ్ గారూ! వెంకట్రావు ఎవరు? లలిత హ్యాండ్ బ్యాగ్ హత్యా ప్రదేశంలోకి ఎలా వచ్చింది? లలితకు ప్రమాదమేమీ జరగలేదు గదా?" ఆత్రంగా ప్రశ్నించాడు సుబ్బారాయుడు.

'ఈ ప్రశ్నకు జవాబు తెలిస్తే ఈ మిస్టరీ ఎప్పుడో తేలిపోయేది' అనుకున్నాడు ప్రాణ్. భార్య గురించి సుబ్బారాయుడి ఆందోళన చూస్తూంటే జాలివేసింది.

"డోంట్ వర్రీ టూ మచ్....లలితకు ఏమీ కాలేద నే

ఆశిద్దాం" అన్నాడు ప్రాణ్ బయలుదేరుతూ, "లలిత రాగానే నాకు ఫోన్ చేయండి."

వెళ్ళిపోతున్న డిటెక్టివ్ వంక అయోమయంగా చూస్తూ వుండిపోయాడు సుబ్బారాయుడు.

# 9

ప్రాణ్ త్యాగరాయనగర్‌లో వున్న తన భవనానికి తిరిగొచ్చేసరికి తెల్లవారుఝాముననూ మూడు దాటింది. కారు గ్యారేజ్‌లో వుంచి బయటకు వచ్చాడు.

అదే క్షణంలో—

ఎక్కడినుండో ఇద్దరు వ్యక్తులు వచ్చి హఠాత్తుగా ప్రాణ్ మీద పడ్డారు.

చెరో చేయీ పట్టుకున్నారతన్ని.

మెయిన్ గేటు దగ్గరున్న సోడియం వేపర్ లాంప్ కాంతి అక్కడ పడుతోంది. ఆ వెలుతురులో ఆగంతకుల ముఖాలను చూడాలని ప్రయత్నించాడు. ఒకడు సన్నగా, పొడవుగా వుంటే, రెండోవాడు పొట్టిగా లావుగా వున్నాడు.

"ఎవరు మీరు?" అన్నాడు ప్రాణ్.

"మేము ఎవరన్నది కాదు—ఆ కాగితాలు నువ్వెక్కడ దాచావన్నది ముఖ్యం" అన్నాడొక వ్యక్తి.

"ఏ కాగితాలు?" ఆశ్చర్యంగా అన్నాడు ప్రాణ్.

"వెంకట్రావు సేఫ్‌లోనుండి నువ్వు సంగ్రహించిన కాగితాలు" అన్నాడు రెండవవాడు.

వున్నట్టుండి మోచేత్తో ఆ వ్యక్తి కడుపులో పొడిచాడు ప్రాణ్.... రెండవ వ్యక్తి మోకాలిపైన షూతో తన్నాడు.

ఇద్దరూ పట్టు వదిలేశారు. ఒకడు నేలకూలితే,

మరొకడు కడుపు పట్టుకుని ముందుకు వొంగిపోయాడు.

చటుక్కున ముందుకు గెంతాడు ప్రాణ్.

పొట్టివ్యక్తిని చేతిని చాకులా చేసి మెడపైన కొట్టాడు. నేలను కరచాడతను.

పొడుగు వ్యక్తి పైకిలేస్తూంటే అతన్ని డొక్కలో తన్నాడు ప్రాణ్. ఎగిరిపడ్డాడతను.

లేవబోతూన్న పొట్టి వ్యక్తిని మళ్ళీ మెడపైన గుద్దాడు ప్రాణ్. మళ్ళీ పడిపోయాడతను.

అదే సమయంలో—

పొడుగు వ్యక్తి జేబులోనుండి పిస్టల్ తీసి ప్రాణ్‌ని షూట్ చేశాడు. అది చూసిన ప్రాణ్ నేలపైన బోర్లా పడ్డాడు. పైకి లేచి నిలుచుంటూన్న పొట్టి వ్యక్తిని బలిగొంది పిస్టల్. అరిచి మళ్ళీ పడిపోయాడు అతను.

జరిగింది గ్రహించిన పొడుగు వ్యక్తి ఆగ్రహంతో మళ్ళీ ప్రాణ్‌కి గురిపెట్టాడు. కాని, అతను ట్రిగర్ నొక్కేలోపునే, ప్రాణ్ జేబులోనుండి రివాల్వర్ తీసి అతన్ని షూట్ చేశాడు. బులెట్ కడుపులో దూరడంతో 'అమ్మా' అంటూ పడిపోయాడు ఆ వ్యక్తి.

పిస్టల్ శబ్దాలకు లోపలినుండి గీత, కాబిన్‌నుండి వాచ్‌మాన్ పరుగెత్తుకొచ్చారు.

పోర్టికోలో లైట్ వేసింది గీత. ఆ వెలుతురులో ఆగంతకులను పరిశీలనగా చూశాడు ప్రాణ్.

ఇద్దరికీ వెంటనే ప్రాణంపోయింది. సన్నటి వ్యక్తిని అంతకుముందు ఎక్కడో చూసినట్లనిపించింది ప్రాణ్‌కి. ఆలోచించగా గుర్తుకొచ్చింది—అతను 'సీవ్యూ' నైట్ క్లబ్ మానేజింగ్ ప్రొప్రయిటర్ ఇస్మాయిల్ యొక్క అనుచరుడన్న విషయం. రెండేళ్ళ క్రితం ఒకసారి ఆ

నైట్ క్లబ్ కి వెళ్ళాడు ప్రాణ్. ఆ సందర్భంలో ఏదో విషయమై ఆ వ్యక్తితో చిన్న పోట్లాట జరిగింది. ఆ సంగతి ఇప్పుడు జ్ఞాపకమొచ్చింది.

'ఇస్మాయిల్ అనుచరులు హఠాత్తుగా నా వెనక ఎందుకు పడ్డట్లు?' అన్న ఆలోచన ఉదయించింది అతనిలో. ఆశ్చర్యం కూడా కలిగింది.

"బలమైన కారణం లేనిదే ఇస్మాయిల్ తన పిచ్చి కుక్కల్ని మీ మీదకు ఉసిగొల్పడు" అంది గీత సీరియస్ గా.

"అదే బోధపడడంలేదు. వెంకట్రావు సేఫ్ లోనుండి ఏవో ముఖ్యమయిన కాగితాలు మాయమయినట్లు తెలుస్తోంది. ఏమిటా కాగితాలు? ఇస్మాయిల్ కీ, ఆ కాగితాలకూ సంబంధం ఏమిటి?" అన్నాడు ప్రాణ్ సాలోచనగా.

"ఇస్మాయిల్ తన బిజినెస్ పార్టనర్ ని హత్య చేయించాడేమో ఆ కాగితాల కోసం. తీరా చంపాక ఆ కాగితాలు కనిపించివుండవు. మీరు తీసి వుంటారన్న అనుమానంతో మీ వెంటపడివుంటారు" అంది గీత.

"రెండు పాసిబులిటీస్ వున్నాయి .... మొదటిది— వెంకట్రావును ఎవరో హత్య చేసి కాగితాలు తీసుకుపోయి వుండాలి. రెండవది — ఇస్మాయిల్ అతన్ని చంపించి వుంటే, అంతకుముందే ఇంకెవరో సేఫ్ ఖాళీచేసి కాగితాలు దొంగిలించుకుపోయి వుండొచ్చు" అన్నాడు ప్రాణ్.

"ఆ కాగితాలు ఏమిటో తెలిస్తే వెంకట్రావు హత్యకు క్లూ దొరకొచ్చు" అంది గీత.

తలూపాడు ప్రాణ్ ఆలోచిస్తూ, "ఇందులో నీ

ఫ్రెండ్ లలిత పాత్ర ఏమిటో వూహాకందకుండా వుంది" అన్నాడు.

"లలితకు ఒకరిద్దరు బాయ్ ఫ్రెండ్స్ వున్నట్లు వినికిడి అయినా, పెళ్ళయ్యాక వాళ్ళకు దూరమయిందను కున్నాను. పువర్ గాల్! ఏమయిందో?" సానుభూతిగా అంది గీత.

"పాపం, సుబ్బారాయుడు పెళ్లాంకోసం తెగ ఆందోళన చెందుతున్నాడు" అన్నాడు ప్రాణ్.

"నాగభూషణం దయ్యం సంగతేమిటి? వెంట్రావు హత్యకూ ఆ స్టోకాల్డు డెవిల్ కి ఏదైనా సంబంధం వున్నదేమో?" అంది గీత. "దయ్యాలు హత్యలు చేస్తాయా?"

"దయ్యాలు పీక నొక్కి చంపుతాయని చిన్నప్పుడు మా నాన్నమ్మ చెబుతూండేది. కాని, వాటికి పిస్టల్ ప్రేల్చడం చాతవునని ఎప్పుడూ అలకించలేదు" అన్నాడు ప్రాణ్ నవ్వుతూ.

"మాడర్న డెవిల్స్ ఫైర్ ఆమ్స్ హేండిల్ చేయడం నేర్చుకుని వుంటాయి!" అంది గీత అతని నవ్వులో శ్రుతి కలుపుతూ.

టెలిఫోన్ మోగడంతో వెళ్ళి రిసీవరందుకుంది గీత. తరువాత కళ్ళతోనే ప్రాణ్ ని పిలిచి రిసీవరు అందించింది.

ఫోన్ లో సుబ్బారాయుడి గొంతు వినిపించింది. ఏడుస్తున్నట్లుంది స్వరం—"ప్రాణ్ గారూ! లలిత జాడ కని పెట్టారు పోలీసులు....బీచ్ దగ్గర గాంధీ బొమ్మవద్ద ఓ కారులో పడివుందట లలిత శవం...."

వులిక్కిపడ్డాడు ప్రాణ్.

"ఇప్పుడే పోలీసులు వచ్చి చెప్పారు. అక్కడికి వెళుతూ మీకు ఫోన్ చేస్తున్నాను .... వస్తారు కదూ?" అన్నాడు సుబ్బారాయుడు గద్గద స్వరంతో.

వెంటనే బయలుదేరుతున్నట్లు చెప్పి, రిసీవరు పెట్టేశాడు ప్రాణ్.

స్నేహితురాలి మరణవార్త వినేసరికి గీత వదనం జేవురించింది.

"గీతా! క్రయింబ్రాంచ్‌కి ఫోన్ చేసి బయటపడున్న ఇస్మాయిల్ గాడి తగ్స్ శవాల్ని తీసుకుపొమ్మని చెప్పు. నేను సుబ్బారాయుణ్ని ఓదార్చి వస్తాను" అని చెప్పి హడావుడిగా బయటకు పరుగెత్తాడు ప్రాణ్.

# 10

బీచ్‌లో గాంధీజీ స్టాట్యూకెదురుగా రోడ్డుపైన ఒక లైట్ గ్రీన్ స్టాండర్డ్ కారు ఆగివుంది. వెనుక సీటులో లలిత శవం పడివుంది. పిస్టల్‌తో షూట్ చేయబడింది ఆమె. కుడి కణతమీద బుల్లెట్ గాయముంది.

అందగత్తె అయిన లలితను ఆ స్థితిలో చూసేసరికి మనసు ఎలాగో అయిపోయింది ప్రాణ్‌కి.

సుబ్బారాయుణ్ని ఓదార్చడం కష్టంగావుంది. "లలిత ఆత్మహత్య చేసుకున్నదంటున్నారు పోలీసులు. నేను నమ్మను. ఆత్మహత్య చేసుకోవలసిన అవసరం లలితకు లేదు....ఇది హత్య! ఎవరో నా లలితను దారుణంగా హత్యచేశారు" అంటూ బావురుమన్నాడతను ప్రాణ్‌ని చూస్తూనే.

ప్రేమించి పెళ్ళాడి ఆర్నెల్లు కూడా కాలేదు. ఇంతలోనే అంత దారుణం—అతని గుండెల్ని బ్రద్దలు చేయడంలో ఆశ్చర్యంలేదనుకున్నాడు ప్రాణ్. అతన్ని

చూ సే జాలికలిగింది.

"హ్హో! ప్రాణ్! మళ్ళీ యిక్కడ ప్రత్యక్ష మయ్యావ్!?" అంటూ వచ్చాడు, ఇన్స్పెక్టర్ మాధవ్. అంతవరకు ఆ పరిసరాలలో క్లూస్ కొరకు వెదుకుతూ డిటెక్టివ్ రాకను గమనించలేదతను.

"సుబ్బారాయుడు పిలిస్తే వచ్చాను" అన్నాడు ప్రాణ్ మందహాసంతో. "లలితను యెవరు చంపా రంటావ్?"

"ఎవరూ చంపలేదు. పిస్టల్‌తో కణతపైన కాల్చుకుని ఆత్మహత్య చేసుకున్నదామె. ప్రక్కనే పిస్టల్ పడివుంది. అదే పిస్టల్‌తో వెంకట్రావు చంప బడ్డాడు" అన్నాడు ఇన్స్పెక్టర్ మాధవ్.

"లలితకు ఆత్మహత్య చేసుకోవలసిన అగత్యంలేదని సుబ్బారాయుడు అంటున్నారు" అన్నాడు ప్రాణ్.

"ఇది ఆత్మహత్యే ననడంలో సందేహం లేదు" అన్నాడు మాధవ్ దృఢంగా. "ఏ కారణంచేతనో వెంకట్రావును అతని పిస్టల్‌తోనే కాల్చి చంపిందామె. ఆ తరువాత పోలీసులకు పట్టుబడక తప్పదన్న భయంతో ఇక్కడికొచ్చి తనూ కాల్చుకుని చనిపోయింది. ఇటీజ్ సో సింపుల్."

"అయితే మా ఇంటికొచ్చి నన్ను ఎటాక్ చేసిన తగ్స్ మాటేమిటి?" అన్న ప్రాణ్ పలుకులు వింటూనే చిన్నగా వులిక్కిపడ్డాడు మాధవ్.

"వాట్ డిడ్ యూ సే?"

"నేను సుబ్బారాయుడి ఇంటినుండి తిరిగివెళ్ళాక ఇద్దరు ఆగంతకులు మా యింటి కాంపౌండ్‌లో నన్ను ఎటాక్ చేశారు. పిస్టల్‌తో నన్ను షూట్ చేయబోయి

తన సహచరుణ్ణే చంపేసాడు ఒకడు. వాణ్ని నేను షూట్ చేసేశాను" అన్నాడు ప్రాణ్.

"గాడ్! మరో రెండు శవాలా?" అన్నాడు మాధవ్ ఎగిరిపడుతూ — "ప్రాణ్! వాణ్ని చంపడానికి నీకు లైసెన్స్ ఎవరిచ్చారు?"

"వాళ్ళ చేతుల్లో చావడానికి నాకిచ్చారా లైసెన్స్?" అన్నాడు ప్రాణ్ వొళ్ళు మండడంతో. "సెల్ఫ్ డిఫెన్స్ కోసం వాణ్ని చంపక తప్పలేదు"

"ఎవరు వాళ్ళు? నిన్నెందుకు అటాక్ చేశారు?" ప్రశ్నించాడు మాధవ్.

"వాళ్ళు సీవ్యూ నైట్ క్లబ్ ప్రొప్రయిటర్ ఇస్మాయిల్ యొక్క గన్ బాయ్స్ అని నా అనుమానం. వెంకట్రావు ఇంట్లోని సేఫ్ నుండి తీసిన కాగితాలు కావాలన్నారు."

ఊపిరి బిగబట్టాడు ఇన్స్పెక్టర్.

"సో, వెంకట్రావ్ సేఫ్ ఖాళీ చేసింది నువ్వేనన్న మాట!" అన్నాడు.

"నో!" అన్నాడు ప్రాణ్ దృఢంగా. "వెంకట్రావు సేఫ్ లోనుండి ముఖ్యమయిన డాక్యుమెంట్సు ఏవో మిస్ అయుండాలి. వాటిని నేను తీశానన్న అపోహతో ఆగంతకులు నన్ను అటాక్ చేసివుంటారు."

"నిజంగా నువ్వు వాటిని తియ్యలేదా?"

"రామాయణం సామెత నీకే చెందుతుంది. అంతా విని ఇటువంటి చచ్చు ప్రశ్న వేస్తున్నావు" అన్నాడు ప్రాణ్. "దీనినిబట్టి చూస్తే నీ థియరీ—అదే, లలిత ఆత్మహత్య థియరీ వీడిపోవడంలేదూ?"

ఇన్స్పెక్టర్ మాట్లాడలేదు. ఏదో ఆలోచిస్తూ వుండి

పోయాడు.

"ఈ కారు ఎవరిదో తెలుసుకున్నావా?" ప్రశ్నించాడు ప్రాణ్.

"రెండురోజుల క్రితం సఫైర్ థియేటర్ దగ్గర మాయమయింది. నైట్ బీట్ కానిస్టేబుల్ ఇక్కడ ఈ కారు చూసివస్తే, లోపల శవం కనిపించిందట."

పోలీసులు తమ తతంగం సాగిస్తూంటే, "మాధవ్ మీవాళ్ళను మా ఇంటికి వెళ్ళి ఆ శవాల్ని కూడా పికప్ చేసుకోమని చెప్పు. తెల్లవారాక వచ్చి స్టేట్‌మెంట్ ఇస్తాను. వస్తాను" అంటూ సుబ్బారాయుణ్ని తీసుకుని బయలుదేరాడు ప్రాణ్.

## 11

ప్రాణ్ మస్తిష్కంలో రకరకాల ఆలోచనలు రేగుతున్నాయి.

'సివ్యూ'కి వెళ్ళి ఇస్మాయిల్‌ని కలుసుకోవాలనుకున్నాడు ప్రాణ్. తనను అటాక్ చేసింది అతని మనుషులే కనుక, అందులో అతని పాత్ర ఏమిటో తెలుసుకోవాలనుకున్నాడు.

త్రోవలో కారాపి పబ్లిక్ టెలిఫోన్‌బూత్‌నుండి ఇస్మాయిల్‌కి ఫోన్‌చేశాడు. అతను నైట్ క్లబ్‌లోనే వున్నాడు.

"ఇస్మాయిల్! డిటెక్టివ్ ప్రాణ్ హియర్....నువ్వు పంపించిన తగ్స్ సరాసరి నరకానికి వెళ్ళిపోయారు" అన్నాడు.

ఒక క్షణం అటువైపునుండి జవాబు లేదు. ఊపిరి బిగబట్టిన శబ్దం సన్నగా వినిపించింది.

"ఆర్ యూ ష్యూర్ దట్ ది ఆర్ మై మెన్?"
అన్నాడు ఇస్మాయిల్ కొంత సేపటికి.

"నువ్వు కాదన్నా నమ్మను."

"ఆల్ రైట్ .... వాట్ డూ యూ సే నౌ?"

"నువ్వు వెదుకుతున్న కాగితాలు నా దగ్గరే వున్నాయి" అన్నాడు ప్రాణ్.

మరో క్షణం నిశ్శబ్దం.

"ఏం కాగితాలు?"

"నటించకు, ఇస్మాయిల్!" అన్నాడు ప్రాణ్. "వెంకట్రావు సేఫ్‌లో నుండి అదృశ్యమైన కాగితాల కోసం నీ అనుచరుల్ని నాపైన ఉసిగొల్పిన సంగతి నాకు తెలుసు..."

"ఆల్ రైట్..ఆల్ రైట్.." అన్నాడు ఇస్మాయిల్. "ప్రాణ్! ఒకసారి ఇక్కడకు రాగలవా, నీతో మాట్లాడాలి?"

ఓ క్షణం ఆలోచించి, "ఓ.కే. అయాం కమింగ్ రైట్ నౌ" అని ఫోన్ పెట్టేశాడు ప్రాణ్.

సుబ్బారాయుణ్ని ఇంటి దగ్గర డ్రాప్ చేయాలంటే అన్నానగర్ వెళ్ళాలి. అంత దూరం వెళ్ళి తిరిగిరావడం లేటవుతుంది. సీవ్యూ నైట్‌క్లబ్ నార్త్ బీచ్ రోడ్‌లో వుంది. రెండూ చెరో మూలా వున్నాయి.

కారు స్టార్టు చేస్తూ, "మిష్టర్ సుబ్బారాయుడూ! నేనిప్పుడు నైట్‌క్లబ్‌కి వెళ్తున్నాను. నాతో వస్తారా? ఆ తరువాత మిమ్మల్ని యింటివద్ద డ్రాప్ చేస్తాను" అన్నాడు ప్రాణ్.

"ఓ.కే. ఇన్ ఫాక్ట్ ఐ బాడ్‌లీ నీడ్ ఎ డ్రింక్ నౌ" అన్నాడు సుబ్బారాయుడు. నెర్వస్ బ్రేక్ డౌన్‌కి సమీ

పంలో వున్నాడతను.

ఓ పావుగంటలో 'సీవ్యూ' పోర్టికోలో ఆగింది డిటెక్టివ్ కారు.

ప్రాణ్, సుబ్బారాయుళ్ళు దిగి లోపలకు నడిచారు.

బార్‌లో ప్రవేశిస్తూంటే ఒక వ్యక్తి హడావుడిగా వైటకొస్తూ సుబ్బారాయుణ్ని ఢీకొట్టాడు. అతని చేతిలో వున్న గ్రీన్ కలర్ పెయింట్ టిన్‌లోనుండి పెయింట్ సుబ్బారాయుడి బట్టలమీద వొలికింది. అనాలోచితంగా దాన్ని చేత్తో తుడవబోతే చేతినిండా అంటుకుంది. విసుక్కున్నాడతను. 'సారీ' చెప్పి వెళ్ళిపోయాడు పెయింట్ వాలా.

నాలుగడుగులు ముందున్న ప్రాణ్ ఆగి అతనివంక చూశాడు. జేబులోనుండి రుమాలుతీసి చేయి తుడుచుకున్నాడు సుబ్బారాయుడు. పెయింట్ పూర్తిగా పోలేదు. నవ్వొచ్చినా ఆపుకున్నాడు ప్రాణ్.

ఇద్దరూ బార్‌లో ప్రవేశించారు. సుబ్బారాయుడు డ్రింక్‌కి ఆర్డర్ చేశాడు.

"మీరు డ్రింక్ తీసుకుంటూ వుండండి నేనిప్పుడే వస్తాను" అని సుబ్బారాయుడితో చెప్పి, మేడపైకి వెళ్ళిపోయాడు ప్రాణ్.

నైట్ క్లబ్ అంతటా సందడిగా వుంది. ఒక్కొక్క గదిలోనూ ఒక్కొక్క గాంబ్లింగ్ గేమ్‌తో, కేకలతో అరుపులతో దద్దరిల్లిపోతోంది. గదులన్నీ ఎయిర్ కండిషన్డ్ కావడంతో ఒకచోటనుండి మరోచోటుకు డిస్టర్బెన్స్ జరగడంలేదు.. డాన్స్ ఫ్లోర్‌లో ఓ అందమైన అమ్మాయి గుడ్డలు విప్పుకుని నగ్నంగా కాబరే డాన్స్ చేస్తోంది.

ఒక్కో గది దాటుకుంటూ చివరకు ఇస్మాయిల్ వుండే గదికి చేరుకున్నాడు ప్రాణ్.

ఇద్దరు వ్యక్తులు అతన్ని అటకాయించారు.

"మీ బాస్ నా కోసం ఎదురుచూస్తున్నాడు. ప్రాణ్ వచ్చాడని చెప్పండి" అనడంతో, అతన్ని లోపలికి పంపించారు వాళ్ళు.

విశాలమైన ఓ ఎయిర్ కండిషన్డ్ రూంలో ఓ పెద్ద టేబిలు వెనుక రివాల్వింగ్ చెయిర్‌లో కూర్చుని పైపు కాలుస్తున్నాడు ఇస్మాయిల్.

"వెల్‌కమ్, మిష్టర్ డిటెక్టివ్!" అన్నాడు ఇస్మాయిల్ ఆసనం చూపుతూ.

అతనికెదురుగా కూర్చున్నాడు ప్రాణ్.

"ఆ కాగితాలు తీసుకొచ్చావా?" సూటిగా ప్రారంభించాడు.

"యే కాగితాలు?"

"వెంకట్రావు సేఫ్‌నుండి నువ్వు సంగ్రహించినవి."

"వాటిలో యేముంది?" ప్రశ్నించాడు ప్రాణ్.

"తెలియనట్టు నటించకు" కటువుగా అన్నాడు ఇస్మాయిల్. "మర్యాదగా వాటినిలా ఇయ్యి."

"కాగితాలు దగ్గర పెట్టుకు తిరుగుతానని ఎలా అనుకున్నావ్?" అన్నాడు ప్రాణ్. "అయినా, వాటిని నీకివ్వడంవల్ల నాకొరిగేదేమిటి?"

"నిన్నిక్కడినుండి ప్రాణాలతో వెళ్ళనిస్తాను" అన్నాడు ఇస్మాయిల్ కూల్‌గా.

అవోలా నవ్వాడు ప్రాణ్.

"నాకు తెలుసు. ఆ కాగితాల కోసం వెంకట్రావును చంపేశావు. అవి కనిపించకపోవడంతో లలిత తీసి

వుంటుందనుకుని ఆమెనూ చంపేసావు. రెండు హత్యలు చేసినవాడికి మూడో హత్య కష్టంకాదు."

"ఆ కాగితాలు నాకు కావాలి!" అన్నాడు ఇస్మాయిల్, ప్రాణ్ పలుకుల్ని పట్టించుకోనట్లు.

"ఇంతకూ ఆ కాగితాలు నీకెలా ఉపకరిస్తాయో చెప్పనేలేదు" అన్నాడు ప్రాణ్.

ఇస్మాయిల్, వెంకట్రావులకు ఆ సీవ్యూ నైట్ క్లబ్‌లోనే కాక మరో రెండు బిజినెస్ హౌసెస్‌లో భాగాలున్నాయి. ముఖ్యంగా స్మగ్లింగ్ బిజినెస్‌లో వారి లావాదేవీలకు సంబంధించిన వివరాలను రాసి దాచుకున్నాడతను. బ్లాక్ మెయిలింగ్ వెంకట్రావు హాబీ. లలితకూ, ఇస్మాయిల్‌కీ ఎలాగో సంబంధం ఏర్పడింది. దాని తాలూకు, సాక్ష్యాధారాలను, ఫోటోలనూ సేకరించి దాచుకున్నాడు వెంకట్రావు. వాటితో లలితను బెదిరించి లొంగదీసుకున్నాడు. వెంకట్రావు హత్యా సమయంలో లలిత అక్కడే వుంది.

వెంకట్రావు హత్యా విషయం తెలిసి తన మనుషుల్ని పంపించాడు ఇస్మాయిల్ ఆ కాగితాలను తీసుకొచ్చేందుకు. అవి సేఫ్‌లోనుండి మాయమయ్యాయి. లలిత తీసిందేమోననుకుంటే ఆమె కూడా హత్య చేయబడింది. డిటెక్టివ్ తీసివుండొచ్చన్న అనుమానంతో మనుషుల్ని పంపడం జరిగింది.

ఇస్మాయిల్ చెప్పిందంతా విని ఆశ్చర్యపోయాడు ప్రాణ్.

"ప్రాణ్! ఈ వివరాలు నీకెందుకు చెప్పానో తెలుసా? ఆ కాగితాలు నాకెంత అవసరమో గుర్తించి వాటిని సంపాదించడం కోసం దేనికీ వెనుదీయనన్న

సంగతి గ్రహిస్తావని. ఆ కాగితాలు నా చేతిలో పడ్డాక ఆ రహస్యాలు నీకు తెలిసినా పరవాలేదు. ఒకవేళ కాగితాలివ్వనని మొండికేస్తావంటే ఈ గదిలోంచి ప్రాణాలతో బయటపడలేవు .... అర్థమయింది కదూ?" అన్నాడు ఇస్మాయిల్.

"నన్ను చంపడం అంత తేలికకాదు. నేను ఇక్కడికి వచ్చినట్టు తెలిసినవాళ్ళున్నారు. పైగా, నన్ను చంపితే నేను కాగితాలు దాచిన స్థలం నీకు తెలియదు." అన్నాడు ప్రాణ్.

"నిన్ను ఒకేసారి చంపుతానని భ్రమపడకు. మొదట ఒక్కో అవయవంలోనూ బులెట్ దూరుతుంది" అన్నాడు ఇస్మాయిల్. "ఆ వాల్ పానెల్‌లో వున్న రహస్య ద్వారం వెనుక ఓ వ్యక్తి సైలెన్సర్‌ను నీకు గురిపెట్టి సిద్ధంగా వున్నాడు. నేను సిగ్నల్ ఇవ్వగానే బులెట్ వచ్చి నీ శరీరంలో దూరుతుంది."

అటువైపు చూశాడు ప్రాణ్. పట్టిచూస్తే తప్ప వాల్ పానెల్ డిజైన్‌లో కలిసిపోయిన రంధ్రం కనిపించదు. ఇస్మాయిల్ అబద్ధం చెప్పడం లేదని గ్రహించాడు. అయినా బింకంగా, "బెదిరింపులతో నన్ను లొంగదీసుకోలేవు" అన్నాడు.

"ఆల్ రైట్ మచ్చు చూపిస్తాను" అన్నాడు ఇస్మాయిల్. "ఇప్పుడు బులెట్ వచ్చి నీ భుజంలో దూరుతుంది."

టేబిల్ ప్రక్కనున్న బటన్ ఏదో నొక్కాడు అతను.

ప్రమాదాన్ని శంకించి చటుక్కున ముందుకు వంగాడు ప్రాణ్.

అదే క్షణంలో—పిస్టల్ ప్రేలుడు వినిపించింది.

'అమ్మా' అంటూ ఇస్మాయిల్ కూలిపోయాడు.

ఆశ్చర్యంతో లేవబోయాడు ప్రాణ్.

మరో షాట్ వినవచ్చింది. ఈసారి బులెట్ దాదాపు ప్రాణ్‌ని రాచుకుంటూ వెళ్ళింది.

కుర్చీతోపాటు నేలపైన పడిపోయాడు ప్రాణ్. రివాల్వర్ తీసి అటువైపు షూట్ చేశాడు. వాల్‌పానెల్ విరిగి, ఓ గది ప్రత్యక్షమయింది.

హఠాత్తుగా గదిలో లైట్లారిపోయాయి.

ఆ చీకట్లోనే వాల్‌పానెల్ వైపు పరుగెత్తాడు ప్రాణ్.

ఎవరో ప్రాణ్ మీదికి వురికారు....ప్రాణ్ చేతిలోని రివాల్వర్ జారిపోయింది. చీకట్లో ఆగంతకుడితో పెనుగులాడాడు ప్రాణ్. డిటెక్టివ్ కొట్టిన దెబ్బకు ఎగిరి పడ్డాడు అతను. అతని మీదికి ఉరికాడు ప్రాణ్ షూట్ చేయడానికి అవకాశమివ్వకుండా. కాని ఆ వ్యక్తి కడుపులో తన్నడంతో దూరంగా వెళ్ళిపడ్డాడు ప్రాణ్. అలా పడడంతో ఏ మీటమీద వో తిడి కలిగిందోగాని, బయట ఎక్కడో అలారం బెల్ మ్రోగిన శబ్దం వినిపించింది.

చటుక్కున లేచి నిలుచున్నాడు ఆగంతకుడు. ఆ ఆ చీకట్లోనే ప్రాణ్ వైపు గురిచూసి పిస్టల్ ప్రేల్చాడు. బుల్లెట్ ప్రాణ్ భుజంలో దూరింది. ప్రాణ్ లేచి నిలుచునేలోపునే అతను పారిపోయాడు.

అకస్మాత్తుగా లైట్సు వెలిగాయి.

ఇస్మాయిల్ అనుచరులు బిలబిలమంటూ గదిలో ప్రవేశించారు.

టేబిల్ వద్ద పడివున్న ఇస్మాయిల్ శవం వారిని గ్రీట్ చేసింది.

# 12

"డామిట్ ప్రాణ్! నువ్వెక్కడుంటే అక్కడే ఓ శవం వెలుస్తోంది!" అన్నాడు యిన్స్పెక్టర్ మాధవ్ కటువుగా. "ఇస్మాయిల్ని ఎందుకు చంపావ్?"

"నేను చంపలేదు" అంటూ జరిగిందంతా వివరించాడు ప్రాణ్.

అంతా విని సాలోచనగా తల పంకించాడు యిన్స్పెక్టర్.

"నీ డేర్ డెవిల్రీ మా ప్రాణాలు తీస్తోంది. కొన్నాళ్ళ పాటు నిన్ను కటకటాల వెనక కూర్చోబెడితే తప్ప పబ్లిక్ పీస్కి భంగం కలిగేలా వుంది" అన్నాడు.

ప్రాణ్ గాయానికి ప్రథమ చికిత్స చేయబడింది.

ఇన్స్పెక్టర్ అచ్చటి తతంగాన్ని జరిపిస్తూంటే, ప్రాణ్ ఆలోచనలోపడ్డాడు. ఇస్మాయిల్ చెప్పినట్టు ఆ వ్యక్తి తనను షూట్ చేయకుండా, డైరెక్టుగా ఇస్మాయిల్నే షూట్ చేశాడు. ఇస్మాయిల్ మరణం యాక్సిడెంటల్ కాదు — డెలిబరేట్ మర్డర్! పైగా, అతను చెప్పినట్టు ఆ వ్యక్తి వుపయోగించినది సైలెన్సర్ కాదు!

మరో విషయం బయటపడింది. వాల్ పానెల్ వెనుకనున్న గదిలో ఇస్మాయిల్ అనుచరు డొకడు స్పృహ తప్పి పడివున్నాడు. చేరువలో సైలెన్సర్ పడి వుంది.

ఇస్మాయిల్ని చంపినదీ, తనను అటాక్ చేసినదీ— వెంకట్రావు లలితలను చంపిన వ్యక్తే అయివుండాలని పించింది హఠాత్తుగా. హంతకుణ్ని చేజార్చినందుకు విచారించాడు ప్రాణ్.

అక్కడ పని పూర్తికాగానే ప్రాణ్ ని, "నువ్వీ స్థితిలో కారు డ్రయివ్ చేయలేవేమో, నిన్ను యింటి దగ్గర డ్రాప్ చేస్తాను, పద" అన్నాడు ఇన్స్పెక్టర్ మాధవ్ ఏ కళనున్నాడో.

బార్ లో తాగి పడివున్న సుబ్బారాయుణ్ని పికప్ చేసుకుని బయలుదేరాడు డిటెక్టివ్.

## 13

ప్రాణ్ ని ఆ స్థితిలో చూడగానే కంగారుపడింది గీత.

"రక్తపుమరకలకు తోడు ఆ పచ్చరంగేమిటి బట్టల మీద?" అందామె.

"రంగా?" అన్నాడు ప్రాణ్ ఆశ్చర్యంగా.

"ఔను. వెనుక వీపుమీద, భుజాల వెనుక షర్టుమీద అక్కడక్కడ గ్రీన్ పెయింట్ లా వుంది" అందామె.

నిలువుటద్దంలో చూసుకున్నాడు ప్రాణ్. ఆమె చెప్పింది నిజమే!

ఆ మరకల్ని చూస్తూంటే — హఠాత్తుగా అతని మెదడులో ఏదో తళుక్కుమంది.

"గీతా! తాంబరంనుండి నువ్వు సంపాదించుకొచ్చిన నాగభూషణం ఫోటో ఒకసారిలా తీసుకురా" అన్నాడు.

గీత ఫోటో తెచ్చింది. అది పాత ఫోటోకావడంవల్ల కాబోలు ముఖం అస్పష్టంగా తెలుస్తోంది.

దానిని ఇన్స్పెక్టర్ కి చూపించాడు ప్రాణ్—

"మాధవ్! నాగభూషణం దయ్యం అని చెప్పాను కదూ? ఇదే అతని ఫోటో" అంటూ.

దానిని పరిశీలనగా చూసి, "అయితే ఇప్పుడేమంటావ్?" అన్నాడు మాధవ్.

"ఈ పోలికలున్న వ్యక్తిని ఎక్కడైనా చూసావా?" ప్రశ్నించాడు ప్రాణ్.

మరోసారి పరీక్షగా చూసి, "ఎక్కడో చూసినట్లనిపించినా, చెప్పడం కష్టం" అన్నాడు మాధవ్. "అయినా ఇప్పుడు అతని గొడవెందుకు?"

"ఈ హత్యలన్నీ చేసింది నాగభూషణమే కనుక!" అన్నాడు ప్రాణ్ చల్లగా.

చిన్నగా ఉలిక్కిపడ్డాడు మాధవ్.

"వాటార్ యూ టాకింగ్? ఇవన్నీ దయ్యం చేసిన హత్యలంటావా?" అన్నాడు తీక్షణంగా.

"దయ్యం చేసిందని ఎవరన్నారు? ఆ నాగభూషణం చేశాడన్నాను కాని—" అన్నాడు ప్రాణ్.

"మూడేళ్ళ క్రితం చచ్చినవాడు బ్రతికొచ్చాడంటావా హత్యలు చేయడానికి?" కోపంగా ప్రశ్నించాడు మాధవ్.

"అసలు చస్తేగా బ్రతికి రావడానికి! పూర్తిగా వింటే నీకే తెలుస్తుంది" అంటూ చెప్పుకుపోయాడు ప్రాణ్. "నాగభూషణం, వెంకట్రావు, ఇస్మాయిల్ బిజినెస్ పార్టనర్స్. దాదాపు పెట్టుబడి అంతా నాగభూషణానిదే. అతన్ని మోసం చేసి ఆ డబ్బంతా కాజేయాలన్న ఉద్దేశ్యంతో లేక్‌లో ఓ బోటు ప్రమాదాన్ని సృష్టించారు వెంకట్రావు, ఇస్మాయిల్‌లు. అందులో నాగభూషణం మరణించాడని నమ్మారు. అతని సొమ్మును ఇద్దరూ పంచుకుని బొంబేకు పారిపోయారు. రెండేళ్ళకు మద్రాసు తిరిగొచ్చి నైట్ క్లబ్ పెట్టారు. కాని, నాగభూషణం ఎలాగో బ్రతికి బయటపడ్డాడు. మిత్రద్రోహుల్ని కనిపెట్టేసరికి ఇన్నాళ్ళు పట్టిందతనికి...."

ఆగి, సుబ్బారాయుడి వంక చూశాడు ప్రాణ్ చిరునవ్వుతో. నోరు తెరుచుకుని వింటూన్న అతను అయోమయంగా చూశాడు.

"ఇన్స్పెక్టర్! నాగభూషణం ఒక వర్కింగ్ గర్లుని పెళ్ళిచేసుకున్నాడు. ఆమె ఇస్మాయిల్, వెంకట్రావులతో తిరుగుతోండడం చూసి, వారిద్దరినీ గుర్తుపట్టడం జరిగింది.... నాగభూషణం ఓ ప్లాన్ వేశాడు. దయ్యంగా రూపొంది వెంకట్రావు, ఇస్మాయిల్లను తెలివిగా ఏడిపించసాగాడు. భయాందోళనలతో వారికి మనశ్శాంతి కరువుచేసి ఆ తరువాత ఇద్దరినీ చంపి తన పగ తీర్చుకోవడం నాగభూషణం వుద్దేశ్యం కావచ్చు" చెప్పుకుపోయాడు ప్రాణ్.

"వెంకట్రావు నన్ను కలుసుకున్న విషయం తెలిసి త్వరపడ్డాడు నాగభూషణం. నేను వెళ్ళేసరికి అతన్ని చంపేశాడు. ఆ సందర్భంలో వెంకట్రావు కోసం వెళ్ళిన లలిత కంట్లోపడ్డాడు హంతకుడు. ఆ సంగతి గ్రహించి దొంగిలించి తెచ్చిన కారులో లలితను సముద్రపు ఒడ్డుకు తీసుకువెళ్ళి అక్కడ ఆమెను షూట్ చేసి చంపేశాడు. లలిత అతనితో కార్లో వెళ్ళడాన్నిబట్టి హంతకుణ్ని ఆమె బాగా ఎరిగివుండాలని స్పష్టమవుతోంది...."

ఆశ్చర్యంతో నోరు వెళ్ళబెట్టి వింటూ వుండిపోయాడు మాధవ్.

"వెంకట్రావు సేఫ్లో వున్న ధనము, ముఖ్యమైన కాగితాలు తీసుకుపోయాడు నాగభూషణం. ఇస్మాయిల్కి ఫోన్ చేసి వెంకట్రావును చంపేసినట్టూ, అతన్ని కూడా చంపబోతున్నట్టూ చెప్పి వుంటాడు. వెంకట్రావు చావు వార్త వినగానే అతని సేఫ్లో వున్న కాగితాలకోసం

ప్రయత్నించాడు. అవి మాయమయినట్లు తెలియడంతో నన్ను అనుమానించి నా మీదకు వుసిగొల్పాడు తన అనుచరుల్ని....

"ఇస్మాయిల్‌ని కలుసుకున్నాను నేను. ఆ సమయంలో పొంచియున్న నాగభూషణం అతన్ని చంపేశాడు. నేను గుర్తుపడతానన్న భయంతో నన్ను కూడా అటాక్ చేసి, చివరకు తప్పించుకుని పారిపోయాడు...."

ఆగి, మందహాసం చేశాడు ప్రాణ్. "హంతకుడు పారిపోయినా, అతని గుర్తుల్ని నావద్ద విడిచిపెట్టి వెళ్ళడంతో—అతన్ని గుర్తించగలిగాను."

"ఏమిటా గుర్తులు?" ప్రశ్నించాడు మాధవ్.

"పెయింట్ మరకలు...." అన్నాడు ప్రాణ్.

"హంతకుడు నన్ను అటాక్ చేసినప్పుడు అతని చేతికున్న గ్రీన్ పెయింట్ నా దుస్తులకంటుకుంది...."

అప్రయత్నంగా చేయి చూసుకున్నాడు సుబ్బారాయుడు.

అది గాంచి మందహాసం చేశాడు ప్రాణ్.

"బార్‌లో ప్రవేశిస్తున్నప్పుడు పెయింట్ వాలాకు డాష్ ఇచ్చావు కదూ? అప్పుడు గ్రీన్ పెయింట్ నీ చేతులకు అంటుకుంది సుబ్బారాయుడూ — సారీ— నాగభూషణం!" అన్నాడు.

ఇన్స్పెక్టర్ వులిక్కిపడ్డాడు. "వాట్ డూయూ మీన్?" అన్నాడు అయోమయంగా.

"ఇంకా అర్థంకాలేదా, మాధవ్? ఆ నాగభూషణమే ఈ సుబ్బారాయుడు. గడ్డాలూ, మీసాలు పెంచుకుని రూపం మార్చుకున్నాడు" అని ప్రాణ్ అంటూంటే

"అబద్ధం!" అంటూ అరిచాడు సుబ్బారాయుడు.

"పటవ్, మాన్! హేతువాదంతో రెండూ రెండూ కలిపితే నాలుగవుతోందని నేను వూహించినా- నీ వ్రేలిముద్రలను వెంకట్రావు సేఫ్‌మీదా, నువ్వు నీ భార్యను చంపిన కారుపైనా వున్నవాటితో పోలిస్తే నీ నేరం రుజువవుతుంది" అన్నాడు ప్రాణ్. "నీకు నీ మిత్రులవల్ల అన్యాయం జరిగుండొచ్చు. కాని, చట్టాన్ని నీ చేతుల్లోకి తీసుకోవడం క్షమార్హంకాదు .... పైగా అన్యాయంగా లలితను కూడా చంపావు."

చటుక్కున లేచి నిలుచున్నాడు సుబ్బారాయుడు. అతని చేతిలో పిస్టల్ వుంది. గుమ్మంవైపు గెంతి, పిస్టల్ని ఇద్దరికీ గురిపెట్టాడు.

"డామిట్! యూ నో టూ మచ్, ప్రాణ్! నీ బుర్ర ఇంత క్విక్‌గా పనిచేస్తుందనుకోలేదు"అన్నాడతను. "ఇస్మాయిల్ రూంలోనే నిన్ను చంపేసివున్నట్టయితే ఇప్పుడు ఈ పరిస్థితి ఏర్పడేదికాదు....జాగ్రత్త! ఎవరూ కదలకండి....చేతులు పైకెత్తండి!"

నిస్సహాయంగా చేతులుపైకెత్తి కోపంతో పళ్ళు కొరుకుతూ వుండిపోయాడు ఇన్స్‌పెక్టర్ మాధవ్.

"గుడ్! నీ చర్యతో, నాకేమాత్రం సందేహంవున్నా తీరిపోయిందనే చెప్పొచ్చు" అన్నాడు ప్రాణ్. "వెంకట్రావు సేఫ్‌నుండి దొంగిలించిన ధనమూ, కాగితాలూ ఎక్కడ దాచావ్?"

"నా ఇంట్లో దాచానన్న సంగతి చెప్పడం వలన నాకొచ్చే నష్టమేమీ లేదనుకుంటాను...." అంటూన్న సుబ్బారాయుడు—

"పిస్టల్ క్రిందపడేసి చేతులు పైకెత్తు సుబ్బారాయుడూ!" అన్న గీత స్వరం వెనుకనుండి వినిపించ

డంతో త్రుళ్ళిపడ్డాడు.

లోపల, వారికోసం డ్రింక్స్ ప్రిపేర్ చేస్తూన్న మిస్ గీత, డ్రాయింగ్ రూంలో జరుగుతూన్న డ్రామాను ఆలకించి, తొంగి చూసింది. వెంటనే రివాల్వర్ తీసుకుని మరో గుమ్మంద్వారా వీధి వరండాలోకి వెళ్ళి, సుబ్బారాయుడు వెనుకగా వచ్చింది.

రివాల్వర్ వీపుకు ఆనడంతో చేసేదిలేక పిస్టల్ నేలకు జారవిడిచాడు సుబ్బారాయుడు.

తక్షణం అతని ముందుకురికి బంధించాడు ఇన్స్పెక్టర్ మాధవ్.

డిటెక్టివ్ వంక ఆరాధనగా చూస్తూ, "యూ ఆర్ రియల్లీ సుపర్బ్, ప్రాణ్! ట్రిబుల్ మర్డర్స్ చేసిన హంతకుణ్ని ఆరుగంటల్లోనే పట్టించావ్" అన్నాడు. "నిన్ను పోలీస్ రివార్డుకి రికమెండ్ చేస్తాను."

"రివార్డు మాట దేవుడెరుగు! ఆ సమానూ నన్ను బొక్కలో తోస్తానంటూ బెదిరించకుండా వుంటే చాలు" అని ప్రాణ్ అనడంతో, ఫక్కుమంది గీత.

—:ఐ పో యిం ది:—

# కామ పిశాచం

## టెంపోరావ్

పద్మ ఇంటిముందు వరండా మీద నిలబడింది. రోడ్డువైపు చూసింది. ఆ సమయంలో జనసంచారంలేదు. మరో సారి టైము చూసింది. మూడున్నర అయింది.

మూడింటికి రాము యింటికొచ్చేసేవాడు. ఇవాళ యెందుకు రాలేదు? ఏదైనా పరీక్ష పెట్టారా? అదు కునేందుకు నర్సరీ స్కూలుకు వెళ్ళే పిల్లలకు పరీక్ష లేమిటి?

ఇంట్లో అల్లరిచేసే అవకాశం లేకుండా చేసేందుకు తలిదండ్రులు చిన్నపిల్లలను నర్సరీ స్కూళ్ళకు పంపేస్తూ వుంటారు. అక్కడకు వెళ్ళి వాళ్ళు నాలుగు ఇంగ్లీషు పాటలు నేర్చుకుని, యింట్లో వాటిని పదేపదే వల్లిస్తూ వుంటారు. ముద్దుగా పాడే ఆ పాటలు విని తలిదండ్రులు ఆనందిస్తారు. పద్మ ఆలోచిస్తూ రోడ్డుకేసి చూస్తోంది.

నర్సరీ స్కూలు సమీపంలోనే వుంది. అక్కడకు వెళ్ళి చూడ్డం మంచిదేమో! పద్మ లోపలకు వెళ్ళింది.

బయటకొచ్చి వీధి తలుపు మూసి తాళంవేసింది. మెల్లిగా దగ్గరలో వున్న స్కూలువైపు నడిచింది.

పిట్టగేటు తెర్చుకుని ఆమె లోపలకు వెళ్ళింది. స్కూలు కటకటాల తలుపు మూసివుంది. బయట తాళం వేసివుంది. అనేకమంది పిల్లలు వూచల కటువైపున వున్నారు. కొందరు ఏడుస్తున్నారు. కొందరు నిద్ర పోతున్నారు. మరికొందరు హాల్లో కూర్చుని బొమ్మలతో ఆడుకుంటున్నారు.

ఏడుస్తూన్న రామూ తల్లివైపు చూసి యింకా ఎక్కువగా ఏడ్వసాగాడు.

"మమ్మీ! మమ్మీ!" ఏడుస్తూ అర్చాడు రామూ.

"మిస్సమ్మలు ఎక్కడ?" అడిగిందామె.

"లంచ్‌కి వెళ్ళారు. లేరు" అన్నాడు మరో కుర్రాడు.

ఇలా పిల్లల్ని యింట్లో బెట్టి బయట తాళంవేసి ఇద్దరు మిస్సమ్మలూ ఎక్కడకు పోయారు? ఏడుస్తూన్న రామూను చూసి ఆమె బాధపడింది. తాళం తెరిస్తేగాని రామూ బయటకు రాలేదు.

"రామూ, నేనిప్పుడే వస్తాను, ఏడ్వకు!" అని ఆమె వేగంగా బయటకు వెళ్ళింది.

ఆ స్కూల్లో పనిచేసే ఒక పంతులమ్మ సమీపంలోనే నివశిస్తోంది. పద్మ వేగంగా అటువైపు వెళ్ళింది.

పాతకాలపు పెంకుటింటిముందు ఆమె ఆగింది. ముందు తలుపుమీద వేళ్ళతో తట్టింది.

యెవ్వరూ తలుపు తీయలేదు. తోయగానే తలుపు తెర్చుకుంది. ఆమె లోపలకు వెళ్ళింది. చిన్నహాలు. అక్కడ ఎవ్వరూ లేరు.

"మిస్సమ్మా!" పిల్చింది పద్మ.

జవాబు లేదు.

తలుపు యిలా తెరిచివుంచి మిస్సమ్మ ఎక్కడకుపోయి వుంటుంది?

పక్కనున్న మరో గదివైపు ఆమె అడుగులేసింది. పడగ్గది!

పైకిచూసి ఆమె భయంకరంగా అర్చింది. పైనున్న వుయ్యాల కొక్కికి కట్టిన తాడునుంచి మిస్సమ్మ వేళ్లాడు తోంది!

పద్మ బయటకు పరుగెత్తింది. రోడ్డుమీదకు చేరు కుంది. ఇరుగుపొరుగు స్త్రీలు ఆమె దగ్గరకొచ్చారు.

"ఏమైంది?"

"మిస్సమ్మ యింట్లోకి వెళ్ళి చూడండి!" అందామె.

పద్మ మెదడులో ఏడుస్తూన్న తన రాముా మొహం మెదిలింది. తను వెళ్ళి తాళం తెర్చి వాడినీ, తతిమ్మా పిల్లల్నీ యిళ్ళకు చేర్చాలి!

కొందరు స్త్రీలు యింట్లోకి వెళ్ళారు. ఆలోచిస్తూ పద్మ వాళ్ళ వెనకనే వెళ్ళింది. హాల్లో వున్న చిన్న టేబులుమీద రెండు తాళంచెవులున్నాయి. స్కూలు తాళంచెవులు అవేనేమో! వాటిని తీసుకుని ఆమె బయటకు పరుగెత్తింది. వేగంగా స్కూలుముందుకు వెళ్ళింది. సులువుగా తాళాన్ని తెరిచి కటకటాల తలుపును పక్కకు తోసింది.

పిల్లలందరూ సంతోషంగా బయటకొచ్చారు. వాళ్ళ వైపు చూస్తూ ఆమె నిలబడింది. రాముా తల్లి చెయ్యి పట్టుకుని పక్కనే ఉన్నాడు.

కటకటాల తలుపు మూసి ఆమె బయట తాళం వేసింది. రామూతో ఆమె నడవసాగింది. పిల్లలందరూ వెళుతున్నారు.

మిస్సమ్మ యింటిముందు చాలామంది స్త్రీలు నిలబడి ఉన్నారు. పద్మ లోపలకు వెళ్ళి, తాళంచెవులను టేబులు మీద పడేసి, రోడ్డుమీదకు చేరుకుంది.

"పోలీసు రిపోర్టు యిచ్చారా?" అడిగింది పద్మ.

"మా ఆయన వెళ్ళారు" అంది కామాక్షి.

కామాక్షి భర్త రైల్వేలో పనిచేసి రిటైరయ్యాడు. ఆర్థ్రైటిస్‌తో బాధపడుతున్నాడు. ఎక్కువ దూరం నడవలేడు. మొగాళ్ళెవరూ లేకపోవడంవలన, అందరూ ఆఫీసులకు పోవడంవలన కామాక్షి భర్త ఫోన్ చేయడానికి వెళ్ళవలసివచ్చింది.

"అంతదూరం ఆయన నడవగలరా?" అంది హేమలత.

"ఎమర్జన్సీగా, వెళ్ళక తప్పదు!" అంది రమ.

పద్మ తన కొడుకుతో యింటికి వెళ్ళిపోయింది. స్కూల్లో ఖైదీగా పడున్న తన బిడ్డకు మాల్టోవా ఇచ్చి కాస్సేపు పడుకోమనాలి.

ఇరుగుపొరుగువాళ్ళు మిస్సమ్మ యింటిముందు అలా నిలబడే ఉన్నారు.

"మన నగర్‌లో ఇంత ఘోరం జరుగుతుందని నేను కలలో కూడా అనుకోలేదు" అంది కామాక్షి.

"ఎవరు కలగన్నారా?" అంది హేమలత.

"ఆమె భర్తకు ఫోన్ చేసి చెప్పడం మంచిది" అంది రమ.

"అదంతా పోలీసులు చూసుకుంటారు. అతడి ఫోన్

నంబరు మనకు తెలియదుగా!" అంది కామాక్షి.

హేమలత ఏదో చెప్పబోయి ఆగింది.

"యేమిటి అనబోయావు?" అంది కామాక్షి.

"ఆమె భర్త యిల్లు విడిచి వెళుతోంటే నేను కిటికీ లోంచి చూశాను" అంది హేమలత.

"ఎన్నింటికి చూశావు?"

"ఒంటిగంట దాటాక. టైం సరిగ్గా తెలియదు!"

"పోలీసులకది నువ్వు చెప్పాలి!" అంది కామాక్షి.

"అడిగితే చెప్తాను. అనవసరంగా ఇందులో యిరుక్కుంటే ఆయన నా పళ్ళూడగొడ్తారు" అంది హేమలత.

"భర్తంటే ఎంత భయం!" అంది మంగమ్మ, అప్పుడే అక్కడికొచ్చి.

"మీ ఆయనలా మా వాడు నే నేం చేసినా వూరుకోరు!" అంది హేమలత వ్యంగ్యంగా.

"నా భర్త పైకి అలా కనిపిస్తారు కాని ఆయనకు కోపంవస్తే యింటి కప్పు ఎగిరిపోతుంది" అంది మంగమ్మ.

మిస్సమ్మ యింటిముందు నిలబడి "పాల్!" అని పాలమ్మే ఆమె అర్చింది.

"పాలు తీసుకునే స్థితిలో మిస్సమ్మ లేదు. వెళ్ళిపో!" అని కామాక్షి చెప్పింది.

## 2

అప్పుడే నిద్రనుంచి లేచి మూడు కప్పులు స్ట్రాంగ్ కాఫీ తాగి సిగరెట్ పీలుస్తూ సోఫాలో కూర్చున్నాను.

టైమ్ నాలుగున్నర అయింది. టెలిఫోన్ మ్రోగింది. వెళ్ళి రిసీవర్ని అందుకుని, "హాలో!" అన్నాను.

"బ్రదర్, యిన్స్పెక్టర్ నాయర్!" అందో

బొంగురు కంఠం అటువైపునుంచి.

"వాట్ న్యూస్?"

"బోస్ నగర్‌లో ఎవరో పంతులమ్మ వురేసుకుని చచ్చిందట. అక్కడికి వస్తావా?"

"నాయర్ భాయ్ నువ్వు రమ్మంటే వస్తాను."

"నేనెప్పుడూ రమ్మంటాను."

"ఎక్కడకు రావాలో వివరంగా చెప్పు!"

"బోస్ నగర్, రాజా నగర్ ప్రక్కనుంది. ఆరో వీధి, నంబరు 7!"

"వస్తాను" అని రిసీవర్ పెట్టేశాను.

నా దగ్గరున్న సిటీ మాప్ చూశాను. బోస్ నగర్, అన్నా నగర్ సమీపంలో వుంది. అన్నా నగర్ నలువైపులా చాలా నగర్లు వున్నాయి.

సూటూ, బూటూ ధరించి కిందకు వెళ్ళాను. డాడ్జి కారును శరవేగంగా బోస్‌నగర్ వైపు పోనిచ్చాను.

కారు పోతూండగా బోస్ నగర్ బోర్డు పెద్ద అక్షరాల్లో కనిపించింది. స్లోగా కారును పోనిచ్చాను. అన్నీ చిన్న బంగళాలు. మధ్యతరగతి కుటుంబాలు యిక్కడ నివశిస్తూ వుండాలి.

7వ స్ట్రీట్‌లో పోలీస్ జీప్ వెనకనే కారాపి దిగాను. వీధిలో అనేకమంది నిలబడి వున్నారు. అన్ని యిళ్ళూ కొత్తగా కట్టినవే. కాని పోలీస్ జీప్ ఆగిన ప్రాంతంలోని యిల్లు పాతగా కనిపిస్తోంది.

ఇన్స్‌పెక్టర్ నాయర్ గబగబా వచ్చి నాతో కరచాలనం చేశాడు.

"రా బ్రదర్ లోపలకు వెళ్దాం" అన్నాడు నాయర్.

ఇన్స్‌పెక్టర్ నాయర్‌తో లోపలకు వెళ్ళాను. చిన్న

హాలు. హాలులో ఒక పాత కుర్చీ, చిన్న టేబులు వున్నాయి. పడగ్గదిలోకి వెళ్ళాము. లైట్ వెలుగుతోంది.

స్కిప్పింగ్ తాడు ఆమె మెడచుట్టూ వుంది. తాడు రెండో కొస పైనున్న ఉయ్యాల కొక్కానికి కట్టబడి వుంది. ఎత్తుగా వున్న స్టూలు గదిలో పక్కగా పడుంది.

తాడుకు వేళ్ళాడుతున్న ఆమెవైపు పరీక్షగా చూశాను. కళ్ళు తెరిచే వున్నాయి కాని ఆమె చూపులో జీవం లేదు. ఆమె వయసు ఇరవై రెండు దాటివుండదు. పొడుగ్గా, సన్నగా వుంది. అందమైన ముఖం. మెళ్ళో గొలుసుంది. చెవులకు కమ్మలున్నాయి. ఎడం చేతికి చౌకబారు వాచ్ వుంది. నీలం గాజులు మెరుస్తున్నాయి. మాసిపోయిన పావడా, జాకెట్ లో వుందామె. ఒంటిమీద గాయాలు లేవు. మెడ వుబ్బినట్లు కనిపిస్తోంది.

గది నలువైపులా చూశాను. గోడవారగా వున్న చాపమీద చుట్టిన పరుపుంది. లైబ్రెరీనుంచి అద్దెకు తీసుకున్న పుస్తకాలు, పత్రికలు నేలమీద వున్నాయి.

చిన్న అద్దం గోడకున్న మేకుకి వేళ్ళాడుతోంది. చిన్న గది. ఒకే కిటికీ. కిటికీ తలుపులు మూసున్నాయి. కొన్ని గుడ్డలు పెద్ద ట్రంకు పెట్టెమీద కుప్పలా పడున్నాయి. ఆ పెట్టె పక్కనే మరో పెట్టె వుంది.

వెనక్కి తిరిగి వంటగదిలోకి వెళ్ళాను. చాలా చిన్న గది. వంటగది ప్రక్కనే లెట్రిన్ కమ్ బాత్ రూం వుంది.

వంటగదిలో రెండు కిరసిన్ స్టవ్ లు వున్నాయి. స్టెయిన్ లెస్ స్టీలు పాత్రలు, గరిటలు. వంటగదిలో కూర్చుని తినడం కష్టం. వాళ్ళు హాల్లో తింటూ వుంటారేమో!

వంటగదిలో గోడవారగా రెండు స్టీలు కంచా

లున్నాయి. పై కంచంలో ఎంగిలి మెతుకులు స్పష్టంగా అగుపిస్తున్నాయి.

రెండు కంచాలు. ఇద్దరు భోజనంచేసి వుండాలి. కంచాల్ని ఆమె కడగలేదు. ఎందువలన? ఆలోచిస్తూ హాల్లోకి నడిచాను.

టేబులుమీదున్న రెండు తాళంచెవులవైపు చూస్తూ, పక్కనున్న కుర్చీలో కూర్చున్నాను.

సిగరెట్ వెలిగించి ఆలోచిస్తున్నాను. ఇన్స్పెక్టర్ నాయర్ నాముందుకొచ్చాడు.

"ఆమె పేరు శాంత. సమీపంలో వున్న నర్సరీ స్కూల్లో ఆమె మిస్సమ్మగా పనిచేస్తోంది. భర్త పేరు రామ్మూర్తి. అతడు మెడికల్ రిప్రజెంటేటివ్ గా ఉన్నాడు. పొద్దుటే పోయి, రాత్రి వస్తాడట. వాళ్ళకు పిల్లలులేరు" అన్నాడు యిన్స్పెక్టర్.

"నాయర్ భాయ్, భర్త ఏ కంపెనీలో పని చేస్తున్నాడో కనుక్కున్నావా?"

"రెక్స్ మెడికల్సు కంపెనీ. అక్కడకు ఫోన్ చేయాలంటే యిక్కడనుంచి మైలు దూరం వెళ్ళాలి. ఈ నగర్ లో ఎవ్వరికీ ఫోన్ లేదు."

"డోంట్ బాదర్! చీకటిపడ్డాక అతనే రావచ్చు. స్కూల్లో ఎవరైనా వున్నారా?"

"స్కూలుకు తాళంవేసి వుందని మా కానిస్టేబులు కనుక్కున్నాడు."

"ఇవాళ శాంత స్కూలుకు వెళ్ళిందా?"

"ప్రస్తుతం ఏమీ తెలియదు. ఎవ్వరూ నోళ్ళు విప్పడంలేదు. ఒకే జవాబు యిస్తున్నారు. ఆమె భర్తను అడగమంటున్నారు. ఇందులో ఇరుక్కుంటామని అందరికీ

భయం" అన్నాడు నాయర్.

నవ్వుతూ కుర్చీలోంచి లేచాను. సిగరెట్ను మూలకు విసిరాను. టైమ్ చూశాను. ఆరుకావస్తోంది. గుమ్మందాటి బయటకు నడిచి రోడ్డుమీద తారాట్లాడుతున్న వాళ్ళ వైపు చూస్తూ వుండిపోయాను.

## 3

హాల్లోని లైట్లు వెలుగుతోంది. పడగ్గదిలోకి వెళ్ళి నేల మీద పడుకోబెట్టిన ఆమె శవంకేసి పరీక్షగా చూశాను. మెడమీదకు నా చూపు వెళ్ళింది. సందేహంలేదు, వురి మూలంగా ఆమె మరణించింది.

డాక్టర్ సుధాకర్ గదిలోకొచ్చి, నాకు నమస్కరించి తన పనిలో నిమగ్నుడయ్యాడు. నేనూ ఇన్స్పెక్టర్ నాయర్ హాల్లోకి వెళ్ళాం.

"బ్రదర్! మెడను పరిశీలించాక ఉరిపోసుకుని ఆత్మహత్య చేసుకుందని చెప్పొచ్చు. మొదట్లో ఇది హత్యేమో అనుకున్నాను" అన్నాడు నాయర్.

"నాయర్ భాయ్, నువ్వు ముందుకు దూకేస్తున్నావు!" అన్నాను నవ్వుతూ.

"ఏదేనా మిస్టరీ వుందంటావా?"

"చెప్పలేను. మనకు ప్రస్తుతం ఏమీ తెలియదు. ఆమె భర్తతో మనం మాట్లాడలేదు. అతడొచ్చాక, డాక్టర్ సుధాకర్ చెప్పింది విన్నాక మనం కొంతవరకు వూహించవచ్చు" అన్నాను.

ఇన్స్పెక్టర్ నాయర్ పడగ్గదిలోకి వెళ్ళాడు. కాస్సేపట్లో అతనూ, డాక్టర్ సుధాకర్ హాల్లోకి వచ్చారు. డాక్టర్ నా వైపు బాధతో చూశాడు.

"మిస్టర్ పరశురామ్, ఆమె రేప్ చేయబడింది.

తర్వాత మరణించింది. ఆత్మహత్య కావచ్చు! తనకు జరిగిన అపచారాన్ని భరించలేక వురిపోసుకుని ఆమె మరణించి వుండొచ్చు" అన్నాడు డాక్టర్ సుధాకర్.

"మరణ సమయాన్ని గురించి మీరు ఏం చెప్పగలరు?" ప్రశ్నించాడు నాయర్.

"ఆమె 2 గంటలలోపున మరణించి వుండాలి. పోస్టుమార్టమ్ అయ్యాక మరికొన్ని విషయాలు చెప్పగలను."

సిగరెట్ వెలిగించి బయటకు నడిచాను. రోడ్డు దీపాలు వెలుగుతున్నాయి. ఎదురుగా వున్న యింట్లోకి వెళ్ళాను. పడక కుర్చీలో కూర్చున్న ఒక వృద్ధుడు నన్ను కూర్చోమన్నాడు.

"జవహర్‌లాలు నగర్ టెలిఫోన్ బూత్ దాకా నడిచి నేనే పోలీసు రిపోర్టు ఇచ్చాను, సార్. నా పేరు రవీంద్రన్. నా భార్య పేరు కామాక్షి" అన్నాడతను.

గుమ్మంలో నిలబడిన కామాక్షివైపు అతను చెయ్యి చూపించాడు.

రవీంద్రన్ వయస్సు డెబ్బయి వుంటుంది. పొట్టిగా కత్తిరించిన జుత్తు తెల్లగా సున్నంలా వుంది.

గది నలువైపులా చూశాను. వాళ్ళిద్దరూ తప్ప మరెవరూ ఇంట్లో వున్నట్లు లేదు.

"మీకు పిల్లలు లేరా?" అడిగాను.

"ఇద్దరు కొడుకులు, ఆరుగురు కూతుళ్ళు. అందరికీ పెళ్ళిళ్ళయిపోయాయి. నా పెద్ద కొడుకు మస్కట్‌లో సివిలు ఇంజనీర్, రెండోవాడు దుబాయిలో వున్నాడు. రిటైరయ్యాక ఈ ఇల్లు కట్టించాను. మా ఆఖరి రోజులు గడిచిపోతున్నాయి."

"ఈ నగర్‌లో మీరు చాలా కాలంనుంచి వుం

టున్నారా?"

"పన్నెండేళ్ళు దాటింది సార్. నేనిక్కడికొచ్చేసరికి చుట్టుపక్కల యిళ్ళు లేవు. ఇప్పుడు చుట్టూ యిళ్ళు వచ్చేశాయి."

"ఎదురుగా వుండే రామ్మూర్తి, శాంత మీకు తెలుసా?"

"అతను యువకుడు సార్. పొద్దుటే తోలుపెట్టె పట్టుకుని వెళ్ళిపోతాడు. రాత్రి యింటికొస్తాడు. శాంత హుషారైన యువతి. ఇంట్లో వూరికే కూర్చోలేక పక్కనున్న నర్సరీ స్కూల్లో పని చేస్తోంది."

"వాళ్ళు ఆ యింట్లో ఎంతకాలంనుంచి వుంటున్నారు?"

"వాళ్ళు అక్కడికొచ్చి సంవత్సరం దాటింది. అంతకు ముందు తాంబరంలో వుండేవారని విన్నాను."

"వాళ్ళు దెబ్బలాడుకునేవారా?"

రవీంద్రన్ భార్యవంక చూశాడు.

"యింట్లో దెబ్బలాడుకునేవారేమో కాని వాళ్ళు యెప్పుడూ రోడ్డుమీద పడలేదు" అందామె.

కుర్చీలోంచి లేచాను. ఆమె వంక తీక్షణంగా చూశాను.

"మా పరిశోధనకు ఉపయోగపడేది ఏదైనా తెలిస్తే దాచకుండా చెప్పండి" అన్నాను.

"హేమలతను అడగండి!" అందామె.

"ఎవరామె?"

"ఆ యింటికి పక్కింట్లో వుంటోంది. ఆమె ఏదో చూశానంది."

ఆమెకు థాంక్స్ చెప్పి బయటకొచ్చాను. రోడ్డుదాటి

పక్కింట్లోకి ప్రవేశించాను.

ముందు హాల్లో లైటు వెలుతోంది. పెద్ద సోఫాలో ఒక స్త్రీ, మధ్య వయసులో వున్న పురుషుడు కూర్చుని వున్నారు. నన్ను చూసి వాళ్ళు లేచి నిలబడ్డారు.

"కూర్చోండి" అన్నాడతను.

సోఫాలో కూర్చున్నాను. గది అందంగా వుంది.

"నా పేరు మధుమూర్తి, ఈమె నా భార్య హేమలత. ఏంకావాలో చెప్పండి" అన్నాడతను.

"శాంత, రామ్మూర్తిలను గురించి మీకు తెలిసింది చెప్పండి" అన్నాను.

"అతడు చాలా హార్డు వర్కింగ్ మేన్, సార్. సెలవు రోజు కూడా అతడు పని చేస్తూ వుంటాడు" అన్నాడతను.

"శాంత చాలా మంచిది. అందరితోనూ కలిసి మెలిసి తిరిగేది. నవ్వుతూ మాట్లాడేది" అంది హేమలత.

"మీ రేదో చూశారని విన్నాను!"

"ఆ కామాక్షి వాగిందన్నమాట!"

"భయపడకండి. ఏం చెప్పినా మీరు యిందులో యిరుక్కోరు!"

"నేను నిద్రలో వుండగా గేటు చప్పుడైంది. కిటికీ లోంచి బయటకు చూశాను. గొడుగు పట్టుకుని శాంత భర్త రోడ్డమ్మట వెళ్తున్నాడు."

"ఎన్నింటికి?"

"ఒంటిగంట దాటింది. టైము సరిగ్గా తెలియదు."

"రామ్మూర్తిని మీరు స్పష్టంగా చూశారా?"

ఆమె క్షణకాలం ఆలోచిస్తూ వుండిపోయింది.

"అతడి మొహం నాకు కనపడలేదు. నీలంరంగు పాంటు, చారల షర్టు వేసుకుని గొడుగుకింద ఎవరో నడుస్తున్నారు. అటువంటి దుస్తులు అతడు వేసుకోడం చాలాసార్లు చూసాను. అతడు రామ్మూర్తే అయి వుండాలని వూహించాను" అందామె.

"టైమ్ ఎంత అయివుంటుందో జ్ఞాపకం తెచ్చుకోండి."

"ఒంటిగంటన్నర పైన కావచ్చు. తర్వాత నేను నిద్రలో మునిగిపోయాను."

"పక్కింట్లోంచి యేమైనా కేకలు మీకు వినబడ్డాయా?"

"లేదండి."

"మీరు ఎప్పుడు నిద్రనుంచి లేచారు?"

"ఎవరో భయంకరంగా అర్చారు. అది విని లేచి రోడ్డుమీదకు పరుగెత్తాను. అక్కడ కామాక్షి, ఆమె భర్త, రమాదేవి వున్నారు. లోపలకు వెళ్ళి మమ్మల్ని చూడమంది పద్మ."

"పద్మ ఎవరు?"

"ఆమె పక్కవీధిలో వుంటోంది. ఆమె శాంత యింట్లోకి వెళ్ళి అరుస్తూ బయటకొచ్చింది."

"ఆమె అక్కడికెందుకెళ్ళింది?"

"అది నాకేం తెలుసు? ఆమెనే అడగండి!"

"అడుగుతాను" అంటూ బయటకు నడిచాను.

ఇన్స్పెక్టర్ నాయర్ నావైపు పరుగెత్తుకొచ్చాడు.

"కమాన్ బ్రదర్, శాంత భర్త రామ్మూర్తి యిప్పుడే వచ్చాడు" అన్నాడు ఇన్స్పెక్టర్ నాయర్.

ఇద్దరం యింటివైపు వేగంగా వెళ్ళాం.

పడగ్గదిలో అడుగుబెట్టాను. రామ్మూర్తి భార్య శవం మీదపడి వెక్కి వెక్కి ఏరుస్తున్నాడు. ఆమె పక్కనే నేలమీద పడిపోయాడు.

అతడి కళ్ళు మూసుకుపోయాయి. అతడిలో కదలిక లేనట్టు అనిపించింది. డాక్టర్ సుధాకర్ అతడిని పరిశీలించి హాల్లోకి పరుగెత్తాడు. కాస్సేపట్లో వచ్చి అతడికి యింజక్షన్ ఇచ్చాడు.

"షాక్!" అన్నాడు డాక్టర్ సుధాకర్.

నేలమీద పడున్న రామ్మూర్తి వైపు పరీక్షగా చూశాను.

"ఇన్స్పెక్టర్, ఇతడిని పక్కవేసి హాల్లో పడుకోబెట్టడం మంచిది. ఓ గంటలో లేస్తాడు" అన్నాడు డాక్టర్ సుధాకర్.

ఇన్స్పెక్టర్ నాయర్ ఒక కానిస్టేబుల్‌కు సౌజ్ఞ చేశాడు. చాపమీద చుట్టిపడున్న పరుపును కానిస్టేబుల్ విడదీశాడు. పరుపు దగ్గరగా వెళ్ళాను.

పరుపుమీద బ్రాసియర్, ఒక చీర వున్నాయి. వాటి వైపు ఆశ్చర్యంగా చూశాను. సెక్స్ వాంఛ తీర్చుకున్నాక యీ పరుపును ఎవరో చుట్టేసి చాపమీద పడేసివుండాలి!

పరుపును కానిస్టేబులు హాల్లో వేశాడు. ఇద్దరు కానిస్టేబుల్స్ రామ్మూర్తిని మోసుకెళ్ళి పరుపుమీద పడుకోబెట్టారు.

"నాయర్ భాయ్, అలా వెళ్ళి వస్తాను" అని బయటకు నడిచాను.

రెండు నిమిషాల్లో పద్మ వుండే యిల్లును కను

క్కున్నాను. తలుపు మూసివుంది. తట్టాను.

ఒకతను తలుపు తెర్చాడు. హాల్లోకి వెళ్ళాను. నేల మీద ఒక కుర్రాడు నిద్రబోతున్నాడు.

"కూర్చోండి!"

కుర్చీలో కూర్చుని అతడివైపు చూశాను.

"పద్మ వున్నారా?"

ఒక స్త్రీ హాల్లోకొచ్చింది. నావైపు సీరియస్‌గా చూసింది.

"ఆమె నా భార్య పద్మ" అన్నాడతను.

"మీరు ఇవాళ మిస్సమ్మ శాంత ఇంటికి వెళ్లారా?"

ఆమె మాట్లాడలేదు. మౌనంగా వుండిపోయింది.

"ఏమీ భయంలేదు, చెప్పండి."

"వెళ్ళాను."

"ఎందుకు వెళ్ళారు?"

"మా అబ్బాయి రామూ ఆ స్కూల్లో చదువుతుంటున్నాడు. మూడున్నర అయినా వాడు ఇంటికి రాలేదు. రోజూ మూడింటికి వచ్చేవాడు. వాడికోసం స్కూలుకు వెళ్ళాను. స్కూలు ముందున్న కటకటాల తలుపుకు తాళం వేసివుంది. అనేకమంది పిల్లలు ఖైదీల్లా లోపల కూర్చుని ఏడుస్తున్నారు. లంచవర్‌లో తాళం వేసి మిస్సమ్మ వెళ్ళిపోయిందన్నారు. అది విన్నాక నా వొళ్ళు మండింది. శాంత యింటికి వెళ్ళాను. ఆమెను తిట్టాలనుకున్నాను. కాని అప్పటికే ఆమె మరో లోకంలో వుంది. ఆ దృశ్యం చూసి భయంకరంగా అర్చాను. బయటకు పరుగెత్తాను."

"మీ రామూను ఎలా యింటికి తీసుకొచ్చారు?" అడిగాను.

"శాంత యింట్లో స్కూలు తాళంచెవుల కోసం వెతికాను. హాల్లో టేబులుమీద అవున్నాయి. వేగంగా వెళ్ళి తాళం తెర్చి పిల్లలందర్నీ బయటకు పంపేశాను. కటకటాల తలుపు మూసి తాళంవేసి రామూతోసహా శాంత ఇంటికి వెళ్ళాను. ఆ తాళంచెవులను టేబులుమీద వుంచేసి యింటికి వచ్చేశాను."

"పొద్దుట రామూను స్కూలుకు ఎవరు తీసుకెళ్ళారు?"

"పక్కింటి అబ్బాయితో కలిసి వాడే వెళ్ళాడు. స్కూలు దగ్గరని అక్కడ మా అబ్బాయిని చేర్చాం, సార్" అందామె.

"మూడున్నర ప్రాంతంలో మీరు వెళ్ళేసరికి శాంత యింట్లో మరెవరేనా వున్నారా?"

"లేరు, సార్. నేను సరిగ్గా చూడలేదు సార్."

"ఆ స్కూలుకి మిస్సమ్మలు ఎంతమంది వున్నారు?"

"ముగ్గురు. ఒకావిడ హెడ్ మిస్ట్రెస్. ఎడ్మిషన్ల టైములో మాత్రం ఆమె రోజూ వస్తుంది. కమలా, శాంతా రోజూ స్కూలుకి వస్తారు."

"కమల ఎక్కడుంటోంది?"

"ఆమె విల్లివాకంనుంచి వస్తుంది, సార్. ఈ నగర్ లో వుండడంలేదు."

"ఆ స్కూలు ఎంతకాలంనుంచి నడుస్తోంది?"

"గత సంవత్సరంలో వాళ్ళు స్కూలు తెర్చారు. ఎక్కువమంది విద్యార్థులు లేరు. ఈ నగర్ లోని వాళ్ళే పిల్లల్ని అక్కడకు పంపుతూ వుంటారు" అందామె.

ఆమెకు థాంక్స్ చెప్పి మెల్లిగా శాంత యింటివైపు నడవసాగాను.

హాల్లోకి వెళ్ళాను. రామ్మూర్తి పరుపుమీద కూర్చుని

వున్నాడు. డాక్టర్ సుధాకర్ అతడిని పరీక్షించి నా వైపు తిరిగాడు.

"మిష్టర్ పరశురామ్, హీ యీస్ ఆల్ రైట్" అన్నాడు డాక్టర్.

రామ్మూర్తి వంక సూటిగా చూశాను. అతడి వయస్సు యిరవై ఎనిమిదేళ్ళు వుంటుంది. పొడుగ్గా, సన్నగా వున్నాడతను.

"మీరు పొద్దుట ఆఫీసుకు ఎన్నింటికి వెళ్ళారు?"

"యేడింటికి" అన్నాడతను.

ఇన్స్పెక్టర్ నాయర్, డాక్టర్ సుధాకర్ నా ప్రక్కనే వున్నారు.

"లంచ్ కి యింటికొచ్చారా?"

"లంచ్ కి నేను ఎప్పుడూ రాను. అరడజన్ చపాతీలు పాక్ చేసి శాంత నాకిచ్చింది. నేను వెళ్ళిపోయాను."

"ఒంటిగంట నుండి మూడుదాకా మీరు యెక్కడున్నారు?"

"ఒంటి గంటకు డాక్టర్ సీతారామన్ తో మాట్లాడి బయటకొచ్చాను. ఆయన కాంపౌండులో ఒక చెట్టుకింద కూర్చుని చపాతీలు తిని, బాటిల్లోని నీళ్ళు తాగాను. రెండు సిగరెట్లు కాల్చి మళ్ళా నా పనిమీద వెళ్ళాను."

"ఆ టైమ్ లో డాక్టర్లు మీకు దొరకరుగా?"

"అవును సార్. అటువంటి సమయాల్లో మందుల షాపుకు వెళ్ళి ఆర్డర్లు బుక్ చేస్తూ వుంటాను" అన్నాడు రామ్మూర్తి.

"మీ పెళ్ళయి ఎంతకాలమైంది?"

"మూడేళ్ళయింది."

"పిల్లలు లేరా?"

"పెళ్ళయిన ఐదేళ్ళదాకా పిల్లలు వుండకూడదని మేం నిశ్చయించుకున్నాం. ఆమె జాగ్రత్తపడేది."

సిగరెట్ వెలిగించి పొగ వదుల్తూ అతడివంక సూటిగా చూశాను.

"మిష్టర్ రామ్మూర్తి, మీరు ఇంటికి వచ్చి బయటకు గొడుగేసుకొని పోతూంటే ఒకామె చూసింది" అని అతడివంక చూశాను.

రామ్మూర్తి జంకలేదు. నా వైపు అదోలా చూశాడు.

"ఆ చూసిన వాళ్ళను ఇక్కడకు రమ్మనండి! నేను ఎప్పుడూ గొడుగు వాడను. గొడుగు కిందవున్న మనిషిని పోల్చడం కష్టం. ఆమె పొరబడి వుంటుంది!"

"మీ భార్యకు ఎవరేనా శత్రువులు వున్నారా?"

"శత్రువులు లేరుకాని మనోహార్ అనే అతడికి నా భార్య అంటే చాలా ఇష్టం. ఆమెను పెళ్ళాడాలని అతడనుకున్నాడు. కాని అది జరగలేదు."

"అతడు ఎక్కడుంటున్నాడు?"

"నెల్లూరులో వుంటున్నాడు. అప్పుడప్పుడు ఇక్కడకు వస్తూ వుంటాడు."

"అతడిని గురించి మీ భార్య మీకంతా చెప్పిందా?"

"అంతా చెప్పింది. మనోహార్ కూడా మంచివాడు. ఈ మధ్యనే అతడికి పెళ్ళయింది."

"ఇవాళ మనోహార్ యిక్కడకు వచ్చాడేమో!"

"నేను లేని సమయంలో అతడు ఇక్కడకు రాడు."

"అతడు స్కూలుకు వెళ్ళాడేమో!"

"వస్తే అక్కడనుంచి అలాగే వెళ్ళిపోతాడు. శాంత ఒంటరిగా వున్నపుడు ఇక్కడకు రాడు."

"మనోహార్ మీద మీకు బాగా నమ్మకం కుదిరింది!"

"నేనెవర్నీ అనవసరంగా అనుమానించను, సార్. నా భార్యకు నేనంటే ఎంతో ప్రేమ. ఆమె వురోసుకుని ఆత్మహత్య చేసుకుందంటే నేను నమ్మను. ఎక్కడో ఏదో కుట్ర జరిగివుండాలి! ఏం జరిగిందో వూహాతీతంగా వుంది!"

మధ్య వయసులో వున్న ఒకతను వేగంగా హాల్లోకొచ్చాడు. అతడి చేతిలో వున్న నీలం పాంటునూ, చారల షర్టునూ చూసి నేను ఆశ్చర్యపోయాను.

"ఇవి మీవా సార్?" అడిగాడతను రామ్మూర్తివంక చూస్తూ.

"నావే! ఇవి మీకెక్కడ దొరికాయి?"

"ఆఫీసునుంచి యింటికి వెళుతున్నాను. రోడ్డువారగా జిల్లేడు చెట్లపక్కన యివి పడున్నాయి. ఎవరో దొంగ భయపడి అక్కడ పారేసి వుంటాడని పట్టుకొచ్చాను. ఇంటింటికీ వెళ్ళి అడుగుతూ యిలా వచ్చాను" అన్నాడతను.

అతడివైపు చూశాను.

"మీ పేరు?"

"నాగరాజన్, సార్."

"ఇవి ఎక్కడ దొరికాయి?"

"ఈ నగర్ చివర. టార్చికాంతిలో వాటిని నేను చూశాను. ఇక్కడ దొంగతనాలు జరుగుతూ వుంటాయి, సార్. ఆరేసుకున్న గుడ్డల్ను ఎతుకుపోతూ వుంటారు. ఒకోసారి భయపడి వాటిని ఎక్కడో పారేసి దొంగలు వుడాయిస్తారు."

నాగరాజన్ వెళ్ళిపోయాడు. నేలమీద పడున్న

దుసుల వంక చూశాను. ఈ దుస్తుల్లోనే ఆ వ్యక్తి వెళ్తూంటే హేమలత కిటికీలోంచి చూసింది. ఈ దుస్తులు రామ్మూర్తివి కాని వాటిని మరెవరో ధరించి గోడుగు కింద నడుస్తూ వెళ్ళారు. ఎవరతను? మనోహరా? అతడు కాకపోతే మరెవరు?

రామ్మూర్తిని అనుమానించాలా? అతడు తనముందు నటిస్తున్నాడా? భార్య రహస్యం ఏదో తెలుసుకుని ఆమెను యీవిధంగా అతడు తుదముట్టించాడా?

ఆలోచనల్లో బుర్ర వేడెక్కుతోంది. సిగరెట్ వెలిగించి బయటకు వెళుతూంటే టేబులుమీదున్న రెండు తాళం చెవుల గుత్తి కనపడింది. దాన్ని తీసుకుని బయటకు వెళ్ళాను.

వీధిలోని లైట్లు వెలుగుతున్నాయి. చల్లటి గాలి వీస్తోంది. ఇంటిముందు యిద్దరు కానిస్టేబుల్సు మాత్రం పచార్లు చేస్తున్నారు.

రోడ్డుమీద ప్రజలు లేరు. పాగిపేల్చి వదుల్తూ స్కూలు వైపు అడుగులేశాను. స్కూల్లో ఇప్పుడు ఎవ్వరూ వుండరని నాకు తెలుసు కాని అక్కడకు వెళ్ళి ఓసారి చూడ్డం మంచిదనిపించింది.

# 5

స్కూలు కటకటాల తలుపుముందు నిలబడి లోపలకు చూశాను. చీకటిలో ఏదీ కనిపించలేదు. తాళం తెరిచి లోపలకు వెళ్ళాను.

హాల్లోకి వెళ్ళి స్విచ్ నొక్కాను. లైటు వెలిగింది. హాలు విశాలంగా వుంది. హాలునిండా అన్నం మెతుకులు. ఒక ప్లాస్టిక్ కేరియర్ గోడవారగా పడివుంది.

తలుపుకు తాళంవేసి మిస్సమ్మ వెళ్ళిపోయాక పిల్లలు

తిండితిని మెతుకులు నేలమీద పోసివుండాలి! పద్మ తాళం తెచ్చినదాకా స్కూల్లో ఖైదీలయిన పిల్లలకు విముక్తి లేదు.

హాల్లోంచి చూస్తే రెండు గుమ్మాలు కనిపించాయి. కుడివైపునున్న గదిలోకి వెళ్ళాను. చాపలు, బొమ్మలు అక్కడ వున్నాయి. వెనకవైపు గదిలోకి వెళ్ళాను. స్విచ్ నొక్కాను. గోడవారగా ఒక పరుపుచుట్ట పొదుపుగా పెట్టబడి వుంది. సమీపంలో కూజా అగుపించింది. కిరసన్ స్టవ్, కొన్ని పాత్రలు వున్నాయి. కొన్ని గుడ్డలు పరుపుమీద వున్నాయి. కాటన్ పాంట్ టీ షర్ట్!

ఈ సామానంతా ఎవరిది? మిస్సమ్మలు టీ లేక కాఫీ చేసుకోడంకోసం స్టవ్ వుందా? అయితే ఆ పురుష దుస్తులు ఎందుకున్నాయి?

ఆలోచిస్తూ సిగరెట్ వెలిగించాను. పొగ పీలుస్తూ నలువైపులా చూశాను.

వెనుక తలుపు తెరిచి బయటకు నడిచాను. పెరట్లో నుయ్యి వుంది. లోపలకు వెళ్ళి తలుపు మూశాను. హాల్లోంచి బయటకు నడిచాను. కటకటాల తలుపు మూసి తాళంవేసి కాస్సేపు నిలబడ్డాను.

చుట్టూ చీకటిగా వుంది. వేగంగా రామ్మూర్తి ఇంటి వైపు నడిచాను. హాల్లో రామ్మూర్తి పరుపుమీద కూర్చుని వున్నాడు.

అతని ఎదురుగా వెళ్ళి నిలబడ్డాను. అతడివైపు చూశాను.

"మిష్టర్ రామ్మూర్తీ, నీ భార్య పనిచేసే స్కూల్లో ఎవరేనా బస చేస్తున్నారా?" అడిగాను.

"పెదిరాజు అక్కడ వుంటున్నాడు. స్కూలుకు రాబడి తక్కువ. ఆ ఇంటికి అద్దె నూరు రూపాయలు. అందులో యాభైరూపాయలు పెదిరాజు ఇస్తాడు" అన్నాడు రామ్మూర్తి.

"అతను ఏం చేస్తున్నాడు?"

"ఏదో కంపెనీలో పని చేస్తున్నాడు. అతడితో నాకు అంతగా పరిచయం లేదు."

"అతడు స్కూలు నడిచేటప్పుడు కూడా ఆ గదిలో వుంటాడా?

"అతను పగలు అక్కడ వుండడు సార్. పొద్దుటే ఎనిమిదింటికి పోతాడు. రాత్రి పది తర్వాత వస్తాడు. స్కూలు తొమ్మిదినుంచి మూడు దాకా వుంటుంది."

"పెదిరాజు మీ ఇంటికి వస్తూవుంటాడా?"

"అతడు ఇక్కడకు రావడం నేనెన్నడూ చూడలేదు. నా భార్య అతడిని గురించి చెప్పింది. ఆమె చెప్పిందే నాకు తెలుసు."

"అతడిని గురించి ఆమె ఇంకా ఏం చెప్పింది?"

"అతడికి పెళ్ళయిందట. పెళ్ళాం పుట్టింట ఏదో ఊళ్లో వుంది. తనకొచ్చే జీతం చాలదని భావించి అతడు భార్యతో ఇక్కడ కాపురం పెట్టలేదు. ప్రమోషన్ వచ్చాక భార్యను ఇక్కడకు తీసుకురావాలని అతడి ఉద్దేశం."

"అతడెటువంటివాడు?"

"చాలా మంచివాడని నా భార్య చెప్పింది."

"ఎనిమిదింటికే అతడు గది వదిలిపోతే మీ భార్య అతడితో ఎలా మాట్లాడగలిగేది?"

"ఒక్కో రోజున అతడు పద్దాకా గదిలో వుంటాడు.

ఆ సమయంలో అతడితో మాట్లాడొచ్చు."

"ఆ స్కూల్లో పనిచేసే కమల మీకు తెలుసా?"

"తెలుసు. ఆమె ఇక్కడకు వస్తూ వుంటుంది."

"ఆమె ఎక్కడుంటోంది?"

"విల్లివాకంలో వుంటోంది. రెడ్ హిల్సు రోడ్డు, నంబరు 10 ఎ."

వెనక్కి తిరిగాను. యిన్స్పెక్టర్ నాయర్ నా దగ్గరగా వచ్చాడు. ఇద్దరం పడగ్గదిలోకి వెళ్లాం.

"బ్రదర్, రామ్మూర్తిని అరస్టు చెయ్యమంటావా?" ప్రశ్నించాడతను.

"ఎందుకు?"

"ఆ పాంటూ, చారల షర్టూ అతడివే. వాటిని ఎక్కడో పారేసి మరో దుస్తులు ధరించి అతడు ఆఫీసు పనిమీద పోయి ఏమీ ఎరగనట్లు రాత్రి యింటికి తిరి గొచ్చాడు. భార్య శవాన్ని చూడగానే షాక్ రావడం ఒక నటన. ఏదో కారణం మూలంగా అతడే ఆమెను ఉరేసి హత్యచేసి వుంటాడు" అన్నాడు నాయర్.

"నాయర్ భాయ్, నాగరాజన్‌కి దొరికిన దుస్తులు తనవని రామ్మూర్తి వెంటనే ఒప్పుకున్నాడు. ఏదేనా దాచాలనే ఉద్దేశముంటే అవి తనవి కావని అతడు అనొచ్చుగా? మన అనుమానాన్ని ఎవరిమీదకూ తోయ డానికి రామ్మూర్తి ప్రయత్నించడంలేదు. అతడు చాలా బాధపడ్తున్నాడు!"

"అయితే ఏం చేద్దాం?" అడిగాడు నాయర్.

"నాయర్ భాయ్, ఒకటి నాకు స్పష్టంగా తెలు స్తోంది. శాంతను ఎవరో చంపారు. ఎవరు అది చేసినదీ త్వరలోనే మనకు తెలుస్తుంది."

సిగరెట్ పొగ పీల్చి వదుల్తూ క్షణకాలం నాయర్ వైపు చూశాను.

"నాయర్ భాయ్, నువ్విక్కడ ఇంకా ఎంతసేపు వుంటావు?"

"మరో గంటదాకా వుంటాను."

"నేనలా వెళ్ళివస్తాను" అని బయటకు నడిచాను.

డాడ్జి కారులో కూర్చుని తలుపు మూశాను. స్టార్టు చేసి కారుని వేగంగా విల్లివాకం వైపు పోనిచ్చాను.

# 6

చిన్న ఇంటిముందు కారాపి దిగాను. ముందు తలుపు తెరిచే వుంది. ఒక వృద్ధుడు నాకు ప్రత్యక్ష మయ్యాడు.

"కమల వుందా?" అడిగాడు.

"అమ్మాయి, నీ కోసం ఎవరో వచ్చారు," అని గట్టిగా పిల్చాడతను.

ఇరవై ఎనిమిదేళ్ళ స్త్రీ గదిలోకొచ్చి నా వైపు చూసింది.

"కూర్చోండి, సార్" అందామె.

స్టూలుమీద కూర్చున్నాను. ఆమెవైపు చూశాను. ఆమెకింకా పెళ్ళికాలేదని తెలుస్తోంది.

"ఇవాళ లంచవర్‌లో స్కూలుకు తాళంవేసి మీరు ఎక్కడికెళ్లారు?"

ఆమె ఆశ్చర్యంగా నా వైపు చూసింది.

"నేను ఇవాళ స్కూలుకు వెళ్ళలేదు. ఇవాళ రానని నిన్ననే శాంతతో చెప్పాను."

"మీరు లేనప్పుడు శాంత ఒక్కత్తే స్కూలును నడుపుతుందా?"

"అవును, సార్. ఆమె రాకపోతే నేను నడు

ఫుతాను."

నా మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. కమల స్కూలుకు వెళ్ళలేదు. శాంత మాత్రం స్కూల్లో వుంది. స్కూలుకు తాళంవేసి లంచవర్‌లో ఆమె ఇంటికి వెళ్ళింది. ఆమె ఒంటరిగా వెళ్ళిందా? ఎవరేనా ఆమెతో వెళ్లారా?

ఆమె నా వైపు సూటిగా చూసింది.

"ఇదంతా మీరెందుకు అడుగుతున్నారు?"

"మిస్ కమలా, మీ కొలీగ్ శాంత ఇవాళ ఆకస్మికంగా మరణించింది!"

కమల సంభ్రమించిపోయినట్లు వుండిపోయింది. ఆమె వైపే చూస్తున్నాను. కొంతసేపైనాక ఆమె తేరుకుంది.

"సార్, మీరు ఇక్కడనుంచి ఆమె యింటికి వెళ్తారా?"

"వెళ్తాను."

"నేను మీతో రావచ్చా?"

"వెల్‌కమ్" అన్నాను.

ఆమె లోపలకు వెళ్ళి దుస్తులు మార్చుకుని వచ్చింది. ఇద్దరం కారు దగ్గరకు వెళ్ళాం. ఆమెముందు సీటుమీద కూర్చుంది. తలుపులు మూసి కారును పోనిచ్చాను.

"పైడిరాజుతో మీకు బాగా పరిచయముందా?"

"స్కూలు వెనక గదిలో వుంటున్నాడుగా! మాతో మాట్లాడుతూనే వుంటాడు."

కారును మెల్లిగా పోనిస్తున్నాను.

"అతను ఎటువంటివాడు?"

"పూర్ మేన్, అతడికి పెళ్ళయి మూడేళ్ళు దాటింది. కాని భార్యతో కలిసి జీవించే అదృష్టంలేదు. భార్య దగ్గరకు అప్పుడప్పుడు వెళ్ళి రెండురోజులుండి వస్తూ

వుంటాడు."

"ఇవాళ శాంత స్కూలుకు వెళ్ళేసరికి అతడు తన గదిలో వుండివుంటాడా?"

ఆమె క్షణకాలం ఆలోచించింది.

"ఇవాళ సోమవారంగా, అతడు ఏ ఒంటిగంటకో ఆఫీసుకు వెళ్తాడు."

"సోమవారం అతడు తన గదిలో వంట చేసుకుంటాడా?"

"ఒక్కోసారి వంట చేసుకుంటాడు. అతడి విషయంలో ఏదీ ఖచ్చితంగా చెప్పలేం. అతడికి మూడ్స్ ఎక్కువ. ఒకోసారి నవ్వుతూ మాట్లాడతాడు. కొన్ని సమయాల్లో సీరియస్‌గా వుంటాడు."

"శాంతను గురించి మీరు ఏం చెప్పగలరు?"

"చాలా మంచిది. రామ్మూర్తిగారంటే ఆమెకు ప్రాణం. వాళ్ళ సంసారం హాయిగా సాగుతోంది."

కారును ఆపాను. కమల దిగి ఏడుస్తూ లోపలకు పరుగెత్తింది. కారు దిగి తలుపు మూశాను. కారు పక్కనే నిలబడి సిగరెట్ వెలిగించాను.

చల్లటి గాలి వీస్తోంది. బోస్ నగర్ పట్నానికి చివరనున్న యిక్కడ నివసించే వాళ్ళకు చక్కటి గాలి దొరుకుతోంది.

వెనక్కి తిరిగి స్కూలువైపు అడుగులు వేశాను. ఇంటి ముందు చీకట్లో నుంచుని లోపలకు చూశాను. వెనుకవైపున్న లైట్ వెల్గుతోంది.

పైడిరాజు వచ్చుండాలి!

కటకాల తలుపును పక్కకు తోశాను. ఆ చప్పుడు విని అతడు హాల్లోకొచ్చి లైట్ వేశాడు.

హాల్లోకి వెళ్ళాను. అతడివంక పరీక్షగా చూశాను. పెడిరాజు చారల లుంగీలో వున్నాడు. పైన బనియన్ లేదు.

పొడుగ్గా, బలంగా వున్నాడు.

"మీ రెవరు? మీకేం కావాలి?" అన్నాడతను.

"ఇవాళ ప్రొద్దుట మీరు శాంతతో మాట్లాడారా?"

"ఆమె తొమ్మిదింటికి వచ్చింది. ఇవాళ నాకు పని వుండడంవలన ఆమెతో కాస్సేపు మాట్లాడి వెళ్ళి పోయాను."

"మిస్టర్ పెడిరాజు, మధ్యాహ్నం ఇంటికి వెళ్ళి ఆమె ఆత్మహత్య చేసుకోడానికి ప్రయత్నించింది. లక్కీలీ అదే టైములో పద్మ ఆమె ఇంటికి వెళ్ళింది. తాడుకు వేళ్ళాడుతూన్న శాంతను ఇరుగుపొరుగువాళ్ళు కిందకు దింపి వెంటనే ఇ.ఎస్.ఐ. హాస్పిటల్లో చేర్చారు. ఆమె రెండు గంటల తర్వాత కోలుకుంది" అని అబద్ధమాడాను.

అతడు తృళ్ళిపడ్డాడు. అతడివైపే చూస్తున్నాను. "గుడ్ గాడ్, ఆమె చాలా మంచిది. అలా ఎందుకు చేసిందో! క్షమించండి, హాస్పిటల్‌కి వెళ్ళి ఆమెను చూడాలి!"

"ఇంత రాత్రివేళ వీలుపడదు! రేపే వెళ్ళాలి!" అని బయటకు నడిచాను.

• • •

కటకటాల తలుపు మూసి అతడు తాళంవేశాడు. చేతిలో తోలుపెట్టె వుంది. అతడు గేటుదాటి వేగంగా అడుగులు వేస్తున్నాడు.

మొక్కల పక్క నుంచి గబగబా అతడివైపు

నడిచాను. తటాలున అతడి చెయ్యి పట్టుకున్నాను. అతడు వెనుదిరిగి నా వైపు చూశాడు.

"మీరా!" అన్నాడు ఆశ్చర్యంగా.

"మిస్టర్ పైడిరాజు, రాత్రి హఠాత్తుగా ఎక్కడకు ప్రయాణం?" ప్రశ్నించాను.

అతడు వెంటనే జవాబివ్వలేదు. ఏం చెప్పాలా అని సంశయిస్తున్నాడు.

"మిస్టర్ పైడిరాజు, నాతో రా!"

"నేను అర్జంటుగా వెళ్ళాలి, సార్."

అతడిని బలంగా వెనక్కి లాగాను. అతడు పారిపోవడానికి ప్రయత్నించాడు. కాని అతడి ప్రయత్నం ఫలించలేదు. అతడిని శాంత ఇంటివైపు లాక్కుపోయాను.

పైడిరాజును హాల్లోకి లాక్కెళ్ళాను. రామ్మూర్తి, ఇన్స్పెక్టర్ నాయర్, కమల నా వైపు ఆశ్చర్యంగా చూస్తున్నారు.

పైడిరాజు నేలమీద కూలిపోయాడు. పెట్టె పక్కనే పడింది. అతడివైపు సూటిగా చూసి ఇన్స్పెక్టర్ నాయర్ వైపు తిరిగాను.

"నాయర్ భాయ్, హాస్పిటల్ నుంచి శాంతను తీసుకొచ్చారా?" అని ఇన్స్పెక్టర్‌కి సౌజ్ఞ చేశాను.

నాయర్ తలూపించాడు.

"ఆమెను ఇక్కడకు రమ్మనండి!" గర్జించాను.

పైడిరాజు మొహాన్ని చేతుల్తో కప్పేసుకున్నాడు.

"ప్లీజ్, ఆమెను నేను చూడలేను! ఘోరమైన పాపం చేశాను" అర్చాడతను.

"ఏం చేశావు?"

"ఆమెతో యింటికొచ్చాను. ఆమెతో కలిసి భోజనం

చేశాను. ఆమె స్కూలుకు పోతానంది. కాని నాలో కామ పిశాచం తలెత్తింది. అమానుషంగా ఆమెను బలాత్కరించాను. అరవకుండా ఆమె నోట్లో జేబురుమాలు కుక్కేశాను. అటుపైన భయం నన్ను ఆవహించింది. స్కిప్పింగ్ తాడు పైనకట్టి ఉరితీశాను. ఆమె భర్త పాంటూ, షర్టూ వేసుకుని బయటకు వెళ్ళిపోయాను. గొడుగు కిందున్న నా మొహం ఎవరికీ కనబడదు. నా దుస్తులు గుర్తుంటాయి. అవి ఆమె భర్తవి. ఆ దుస్తులను ఒకచోట వదిలేసి నా దుస్తులు వేసుకొని వెళ్ళిపోయాను. నా మనస్సుకు శాంతిలేదు. పట్నంలో తిరిగి తిరిగి నా గది కొచ్చాను. అంత జరిగాక ఆమె ఇంకా బతికి ఉంటుందని నేననుకోలేదు" అన్నాడు పైడిరాజు.

అమాంతంగా అతడిమీదకు దూకాడు రామ్మూర్తి. అడ్డుపడి అతడిని ఆపాను.

"నన్ను వదలండి! ఈ దుష్టుడిని నా చేత్తో చంపి నా కసి తీర్చుకుంటాను" అన్నాడు రామ్మూర్తి.

రామ్మూర్తిని ఒక కానిస్టేబుల్ దూరంగా లాక్కుపోయాడు. ఇన్స్పెక్టర్ నాయర్ పైడిరాజు చేతులకు బేడీలువేశాడు.

కమల నా వైపు ఏడుస్తూ చూసింది.

"పరశురామ్‌గారూ, ఒక రోజు శాంత స్కూలుకు రాలేదు. ఆ రోజున పైడిరాజు నన్ను తన గదిలోకి తీసుకెళ్ళి ఏదో చెయ్యబోయాడు. అతడిని తిట్టి పిల్లల మధ్యకు వచ్చాను. అటుపైన అతడు నా జోలికి రాలేదు. అది నేను ఎవ్వరికీ చెప్పలేను. ఈ విషయం నేను శాంతతో చెప్పివుంటే ఆమె ఇలా బలైపోయేది కాదేమో!" అంది కమల.

పెడిరాజు ఆమె వైపు ఆశ్చర్యంగా చూశాడు.

"పెడిరాజు, అబద్ధమాడి నీచేత నిజం చెప్పించాను. ఆ అమాయకురాలు శాంత అమానుషంగా మరణించింది" అన్నాను.

"బ్రదర్, హంతకుడిని యింత తొందరగా పట్టుకుని నాకు అప్పగించినందుకు నా థాంక్స్!" అన్నాడు ఇన్స్పెక్టర్.

ఇన్స్పెక్టర్ నాయర్‌కు గుడ్‌నైట్ చెప్పి, కమలతో సహా నా కారువైపు నడిచాను.

—:ఐ పో యిం ది:—

# రక్తం త్రాగే పిశాచం

వసుంధర



(గత సంచిక తరువాయి)

"అయాం ప్రొఫెసర్ మహదేవుడు — మేమే మీ దగ్గరకు రావాలనుకుంటున్నాం. కొన్ని విచిత్ర పరిస్థితుల్లో మేమీ వేషాలు వేయాల్సివచ్చింది. అదిగో

అక్కడ నిలబడిన ఆమె మనిషి కాదు. ఒక మానవాతీత శక్తి. మంత్రశక్తులతో ఆమెను బంధించాం. ఈ ఇంట్లో ఆమె చాలా ఘోరాలు చేసింది....” అన్నాడు మహాదేవుడు.

“నాన్సెన్స్—” అన్నాడు ఇన్స్పెక్టర్.

“ఇన్స్పెక్టర్—” అంది వకుళ—“నేను సామాన్యురాలిని. వీళ్ళే మంత్రగాళ్లు. ఏం మంత్రమో వేసి నా చుట్టూ ఈ గీతాలు గీశారు. నేను బయటకు రాలేక పోతున్నాను. ఈ యింట్లోనే వీళ్ళు చాలా హత్యలు చేశారు. అవన్నీ నాకు అంటగట్టాలని చూస్తున్నారు. మీరే నన్ను రక్షించాలి—”

అప్పటికి ఇన్స్పెక్టర్ అక్కడ వున్న నాలుగు శవాలనూ, అవి వున్న పరిస్థితులనూ చూసి—“మై గాడ్!” అన్నాడు. సూర్యావతి ఆత్రుతగా తన కొడుకు శవం దగ్గరకు పరుగెత్తి ఘొల్లుమన్నది.

“తమ ఓడ్డ మాయమయిందనీ—తనకీ యింటివారిపై అనుమానమున్నదనీ చెబితే మేమిక్కడకు వచ్చాం. కానీ ఇక్కడ ఇంత ఘోరం జరిగిపోతుందనుకోలేదు—” అన్నాడు ఇన్స్పెక్టర్—“ఈ ఘోరం ఒక్క వనిత చేసిందంటే నమ్మకంగా లేదు. ఇదంతా మీరే చేసి వుండాలి” అంటూ అతను కానిస్టేబుల్సును చుట్టుముట్టమన్నాడు.

“అయ్యో ఇన్స్పెక్టర్—మీకు వకుళ గురించి తెలియదా?” అన్నాడు శివశంకరం.

“వకుళ—ఆ పేరు విన్నాను. అయితే అలాంటి కాకమ్మ కథలు నేను నమ్మను. ఈమెను హిప్నటైజ్ చేసి చుట్టూ గీతలు గీసి మంత్రించామని మోసం చేస్తున్న

మీ ప్రతిభకు జోహార్లు. నే నిప్పుడామెను బయటకు తీసుకు వస్తాను. మీ అసలు బండారం బయట పెట్టి స్తాను——" అన్నాడు ఇన్ స్పెక్టర్.

"ఇన్ స్పెక్టర్——తొందరపడవద్దు. ఒక్క నిముషం మా మాట వినండి. ఆమెను విడిపించారంటే ఇంక మనమేమీ చేయలేము. ఎంతో కష్టపడి ఆమె ఉనికి తెలుసుకుని ఇప్పటి కిక్కడ బంధించాము. మీ రనుకుంటు న్నట్లు ఆమె మనిషి కాదు. మానవాతీతశక్తి——" అంటూ అరిచాడు మహాదేవుడు.

"నాన్సెన్స్——అది మానవాతీత శక్తి అయినా నా చేతిలో రివాల్వరున్నంతసేపు నాకేం భయంలేదు——" అంటూ ఇన్ స్పెక్టర్ ఓ అడుగు ముందుకు వేసి-"మంత్రిం చిన ఈ వలయాన్ని నేను తుడిచివేస్తున్నాను. నువ్వు బయటకు రా అమ్మా——" అన్నాడు. వకుళ అతడివంకే ఆత్రుతగా చూస్తోంది.

మహాదేవుడు, శివశంకరం, లింగం——అరుస్తున్నా వినకుండా ఇన్ స్పెక్టర్ ఆ వలయాన్ని కొంతమేర తడి చేశాడు. వకుళ వెంటనే ఉత్సాహంగా ఆ దారిలోంచి బయటకు వచ్చి ముందుకు పోబోయింది.

"ఆగు——యెక్కడికి వెడతావ్?" అన్నాడు ఇన్ స్పెక్టర్.

వకుళ ఆగలేదు. త్వరగా ఆ ఆంజనేయుళ్ళ రూపాల నుంచి బయటపడాలని చూస్తోందామె.

"ఏయ్——ఆగమంటే నీక్కాదూ?" అన్నాడు ఇన్ స్పెక్టర్.

వకుళ ఆగి వెనక్కు చూసి—"సారీ—ఇన్ స్పెక్టర్! థాంక్స్ చెప్పడం మరచిపోయాను—" అంది.

"థాంక్స్ కాదు నా కొక్కు చెప్పాలసింది. నువ్వెవరివో— ఇక్కడెందుకున్నావో చెప్పాలి—" అన్నాడు ఇన్స్పెక్టర్ ముందడుగు వేస్తూ. అతడు రివాల్వర్ సరిచేసి పట్టుకున్నాడు.

"నా పేరు వకుళ. నేను మానవాతీత శక్తిని. పగ తీర్చుకుందుకు యిక్కడికి వచ్చాను. ఇక్కడ చచ్చిన వాగంతా నా కారణంగానే చచ్చారు. ఆ పిచ్చి ప్రొఫెసర్నీ, అతడి బృందాన్నీ వదిలిపెట్టు" అంటూ ముందడుగు వేసింది వకుళ.

"ఆగు—" అరిచాడు ఇన్స్పెక్టర్.

"నన్నెవరూ ఆపలేరు—" వకుళ పరుగెత్తింది.

ఇన్స్పెక్టర్ రివాల్వర్ పేల్చాడు. వకుళ ఆగలేదు. మళ్ళీ పేల్చాడు. వకుళ వీధిలోకి వెళ్ళిపోయింది.

"పరుగెత్తు ఇన్స్పెక్టర్. మమ్మల్ని కూడా వదులు. ఆమెను ఆపడం కష్టం. మా కష్టం అంతా నీ కారణంగా బూడిదలో పోసిన పన్నీరయింది—" అన్నాడు మహాదేవుడు.

అంతా వీధిలోకి పరుగెత్తి జీపులో కూర్చున్నారు.

ఇంట్లో సూర్యావతి పిల్లాడి ముందు రోదిస్తోంది. మతి లేకుండా ఆమె పక్కన ఉన్నాడు షణ్ముఖరావు.

వీధిలో జీపు కదిలింది. ముందు వకుళ పరుగుతుతోంది.

టైం రాత్రి పదకొండున్నర దాటింది.

వీధులు నిర్మానుష్యంగా వున్నాయి.

వీధిలో వకుళ పరుగెడుతోంది. జీపు ఆమెను తరుముతోంది.

కొంతదూరం వెళ్ళాక వకుళ ఆగి జీపు కెదురుగా నిలబడింది.

ఇన్‌స్పెక్టర్ బ్రేకువేసి జీపు ఆపాడు.

వకుళ ముందరికి నడిచింది. వాళ్ళు జీపు దిగుతూండ గానే ఆమె జీపును కాలితో ఒక్క తాపు తన్నింది. అంతే—జీపు తల్లక్రిందులైంది.

వకుళ మళ్ళీ పరుగెత్తసాగింది.

"ఆమె శక్తి అపారం—చేతనైతే గట్టిగా ఆంజనేయ దండకం ఆరంభించండి—అదొక్కటే ఆమెను అణచి ఉంచగలదు—" అంటూ మహదేవుడు గట్టిగా దండకం ప్రారంభించాడు.

జీపు నలాగే వదిలి—అంతా వకుళను అనుసరించ సాగారు.

ఈలోగా వకుళకు యెదురుగా ఓ పెద్ద ట్రక్కు వచ్చింది. దాన్నామె అవలీలగా రెండు చేతుల్తో పైకి లేపి—దారికి అడ్డంగా పడేసింది. తను ముందుకు కొనసాగి పోయింది.

"మైగాడ్!" అన్నాడు ఇన్‌స్పెక్టర్. అప్పటికి అతడికి వకుళ శక్తి పూర్తిగా అర్థమయింది—"నన్ను క్షమించాలి మీరు ముగ్గురూ—" అన్నాడతను.

ఎలాగో వారు ట్రక్కుని దాటి ముందుకు వెళ్ళి పోయారు.

వకుళ పరుగెడుతోంది—దారి పొడుగునా నానా భీభత్సం చేస్తూ.

ఏ రిక్షాయైనా, కారైనా ఎదురైతే ఎత్తి వాళ్ళ మీదకు విసిరేస్తోంది. ఎలక్ట్రిక్ స్తంబాలు పీకేస్తోంది. చెట్లు విరిచేస్తోంది. తను ముందుకు కొనసాగిపోతోంది.

అంతశక్తి గల ఆమెను ఆపడం యెలాగో ఇన్

స్పెక్టర్‌కి తెలియడంలేదు.

మహాదేవుడు, లింగం, శివశంకరం ఆయాసపడుతున్నారు.

"ఆమెతో మనం పరుగెత్తలేం!" అన్నాడు శివశంకరం.

"మనం లేకపోతే ఎలా? ఆంజనేయ చక్రంలో మనం బంధించాలా మెను—ఇన్‌స్పెక్టర్ యేమీ చేయలేడు" అన్నాడు మహాదేవుడు.

వకుళ ఉన్నట్లుండి దారి మళ్ళించింది. ఆమె రోడ్డు పక్క ముళ్ళబాటలోకి మళ్ళింది.

ముళ్ళామె కాళ్లను బాధించడం లేదు.

మహాదేవుడు, లింగం, శివశంకరం—హనుమంతుడి వేషాల్లో వున్నారు. వాళ్ళ కాళ్ళకు జోళ్ళు లేవు. రక్తం ప్రవహిస్తూంటే వాళ్ళు తెగించి ఆ దారిలో పరుగెడుతున్నారు. క్షణం ఆగడానికి లేదు.

వకుళ అలా పరుగెత్తి ఉన్నట్లుండి కీచుమంటూ అరిచి పడిపోయింది.

ఇన్‌స్పెక్టర్, లింగం, శివశంకరం, మహాదేవుడు—మొత్తం అందరూ కాస్త దూరంగానే ఆగిపోయారు.

పడిపోయిన వకుళలో క్రమంగా చలనం స్తంభించింది.

అంతా నెమ్మదిగా ఆమెను సమీపించారు.

వకుళ ఇప్పుడు పడిపోయిన స్త్రీమూర్తిలా లేదు. శవంలాగుంది.

"ఆమె చనిపోయిందా?" అన్నాడో కానిస్టేబులు.

ఇన్‌స్పెక్టర్ వంగి—ఆమె చేయి పట్టుకుని-"బాప్ రే-యెంత చల్లగా వుందీ?" అన్నాడు.

కానీ వకుళ ఇంత అర్థాంతంగా ఎందుకు నిర్జీవురా

లైందో మహాదేవుడికి అర్థంకాలేదు. ఆయన ఆ ప్రాంతాన్ని పరిశీలించాడు. ఆమె శరీరానాన్నానుకుని ఒక తులసిమొక్క వున్నది.

'తులసి మొక్కకు ఈమెను నిర్జించే శక్తి ఉన్నదా?' అని ఆలోచించసాగాడు మహాదేవుడు.

"అసలీమె కథేమిటో చెప్పండి సార్ —" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ఆయాసాన్ని భరిస్తూ.

ఒక్క నిముసం విశ్రాంతి తీసుకుని క్లుప్తంగా వకుళ కథ చెప్పాడు మహాదేవుడు.

"తులసి మొక్కకు ఈమెను నిర్జించే శక్తి వున్నదని నే ననుకోను—" అన్నాడు శివశంకరం.

సరిగ్గా అప్పుడే దూరంగా వస్తున్న ఓ స్త్రీమూర్తి వారికి కనిపించింది. కొంత దగ్గరగా వచ్చి అక్కడి పోలీసుల్ని చూసి ఆమె పరుగెత్తి పారిపోయింది.

ఇద్దరు కానిస్టేబుల్సు ఆమెను పట్టుకుని లాక్కుని వచ్చారు.

"ఎవర్నువ్వు?" గద్దించాడు ఇన్స్‌పెక్టర్.

"నా పేరు మంగమ్మ—" అన్నదామె — అప్పుడే ఆమె అక్కడ పడివున్న వకుళ శవాన్ని చూసి—"సరిగ్గా ఇక్కడే...." అంటూ ఏమో గొణిగింది.

అప్పుడే లింగం టైంచూసి — "సరిగ్గా పన్నెండూ అయిదయింది. అంటే వకుళ జీవితం ఒక అమావాస్య నాటి రాత్రి పన్నెండు గంటలకు ఆరంభమై — మరో అమావాస్యనాటి రాత్రి పన్నెండుకు అంతమైనదన్న మాట — ఆమె మరణానికి కారణం ఆ సమయమే అయుంటుంది—...." అన్నాడు.

"అసంభవం—అలాగైతే ఈ మధ్యలో ఇంకా చాలా

అమావాస్యలొచ్చాయి—" అన్నాడు శివశంకరం.

ఒకవేళ తమ మందు ప్రభావం అయిపోయి ఆమె మరణించిందేమోనని లింగానికి అనుమానంవచ్చి మహాదేవుడి చెవులో గొణిగాడు.

"ఏమిటి—సరిగ్గా—ఇక్కడే— ....అంటున్నావు...." అన్నాడు ఇన్స్పెక్టర్.

"సరిగ్గా ఇక్కడే....ఇక్కడే...." అంటూ ఏడ్వసాగింది మంగమ్మ.

"ఏమిటి—సరిగ్గా చెప్పు!" గద్దించాడు ఇన్స్పెక్టర్.

"సరిగ్గా ఇక్కడే .... మధుబాబు...." మంగమ్మ మళ్ళీ ఆగింది. క్రూరంగా చూస్తున్న ఇన్స్పెక్టర్ వంక భయంగా చూసి — "మధుబాబు ఇంట్లో మహిమగల కుంకం వుంది. అదంతా ఓ పెట్టెలోకి మార్చి ఇక్కడ పాతిపెట్టాను. గురుగా పైన ఓ తులసి మొక్క పాతాను. ఆ కుంకం అంటే ఈ అమ్మకు భయం. కానీ చివరకి వెతుక్కుంటూ వచ్చి ఈ కుంకంమీదనే చచ్చిపోయింది" అంది.

మహాదేవుడు, శివశంకరం, లింగం—ఉలిక్కిపడ్డారు.

ఏమిటీ చిత్రం? ఒక బైరాగి ఆమె ఉనికిని ఊహించి ఇచ్చిన కుంకం—చివరికామెను తన వైపుకి ఆకర్షించుకుని అంతంచేసింది! ఇదంతా ఆ బైరాగి ముందే ఊహించాడా? అసలా బైరాగి ఎవడు?

ఈ సృష్టిలో అన్ని ప్రశ్నలకూ సమాధానాలుండవు. కానీ ఒక విచిత్రమైన శక్తి ఈ సృష్టిని నడుపుతోంది. అందువల్లనే అప్పుడప్పుడు దుష్టశక్తులు విజృంభించినా వాటిని ఆ విచిత్ర శక్తి మళ్ళీ అణచివేస్తుంది. అయితే దుష్టశక్తులు అప్పుడప్పుడు ఎందుకు విజృంభిస్తాయి?

కేవలం మనిషి కారణంగా....

అసహాయుల్ని హింసించడం మనిషి అలవాటు. అసహాయుల్ని తయారు చేయడం మనిషి మెదడు హాబీ. అసహాయులు అసహాయులే అయినా వారికి మెదడు వుంటుంది. అది విపరీతమైన మార్గాలు తొక్కుతుంది. ఏదో ఒక రోజున మనిషి దుష్టశక్తిగా మారతాడు.

దుష్టశక్తుల్ని విజృంభించకుండా చేయగలవాడు మనిషి మాత్రమే! అయితే మనిషి అందుకు ప్రయత్నించడు.

అమాయకురాలైన వకుళ దుష్టశక్తిగా మారి కొన్ని ఘోరాలు చేసి ప్రస్తుతానికి నిద్రపోతోంది. అయితే అది నిద్రిస్తున్న దుష్టశక్తి మాత్రమే! ఏదో ఒకరోజున ఎవరో ఒకరు ఆ దుష్టశక్తిని మేల్కొల్పే అవకాశం వున్నది.

అటువంటి అవకాశం రాకూడదనే మనం కోరుకుందాం. కానీ అవకాశం వున్నదని మాత్రం మనం మరువకూడదు.

—:ఐ పో యిం ది:—

## సీరియల్ ప్రారంభం!

# రక్తపుటేర్లు

### వసుంధర

(మొదటి భాగము)

ఆమె తెల్లని చీర కట్టింది. చీరమీద అందంగా కుట్టిన ఎర్రనిపూలు ఆమె జడలో తెల్లనిపూలు. సువాసనలు విరజిమ్మే మల్లెలవి.

చీరమీద పూలకు కలిసేలా ఎర్ర రంగు జాకెట్ వేసుకున్నదామె. ఆమె అందాన్ని ఆ జాకెట్ ద్విగుణీకృతం చేసింది. ఆమె చేతికి రంగు రంగుల గాజులు. ఆ గాజుల గలగలలు ఆమె చేతినుండి వచ్చిన కారణంగానే మధుర సంగీతంలా ఉన్నాయనిపిస్తుంది.

సృష్టిలో అందానికి మారు రూపంలా ఉన్న ఆమె శరీరాన్నలంకరించిన ప్రతి వస్తువూ తనకే ఒక కొత్త అందాన్ని సంతరించుకుంది.

అయితే—

ఆమె కళ్ళలో మాత్రం దిగులు వుంది.

ఆ దిగులుచూసి ఏ మగవాడూ భరించలేడు. ఆ కళ్ళలో ఉత్సాహం కనిపించడంకోసం ఏంచేయమన్నా చేస్తాడు. స్వర్గానికి వెళ్ళి అమృతం తీసుకొస్తాడు. పాతాళానికి పోయి మణులు సంపాదిస్తాడు. ఆమెను ఈ ప్రపం

చానికే పట్టమహిషిని చేయాలనుకుంటాడు. అవసరమైతే అందుకు రక్తపుటేర్లు ప్రవహింపజేస్తాడు.

ఆమె పేరు జాహ్నవి.

జాహ్నవి సిరిసంపదల్లో పుట్టి పెరగలేదు. కానీ డబ్బుకులోటెరుగకుండా పెరుగుతూ వచ్చింది. తండ్రికి ఇద్దరే సంతానం. జాహ్నవి అన్న సుకుమార్ చదువు పూర్తికావస్తోంది. తండ్రి రఘురాంకు వెయ్యి రూపాయల జీతం. స్వంతిల్లు. తల్లి కృష్ణవేణమ్మకు పుట్టింటివారిచ్చిన రెండెకరాల మాగాణీ వుంది.

పిల్లలిద్దరూ అల్లారుముద్దుగా పెరిగారు. అలాగని గారాబంతో చెడిపోలేదు. సుకుమార్‌కు డొనేషన్ లేకుండానే ఇంజనీరింగు కాలేజీలో సీటు వచ్చింది. జాహ్నవి ఈ ఏడాదే బియ్యే మొదటి సంవత్సరంలో చేరింది.

"ఎక్కడికే—బయల్దేరావ్?" అంది కృష్ణవేణమ్మ.

"గార్డెన్‌కమ్మా!" అంది జాహ్నవి.

గార్డెన్ అంటే తోటకాదు. మైసూరులో బృందావన్ గార్డెన్స్‌కు సరిపోలకపోయినా ఆ ఊరికి అందమైన పార్కు మయూరా గార్డెన్స్. ఊళ్ళో అంతా ఆ పార్కును గార్డెన్ అని పిలుస్తారు.

తల్లి ఇంకేమీ అడగలేదు. జాహ్నవి కాయింట్లో అంక్షలేమీ లేవు. ఆమె అవుననన్నది ఎవరూ కాదనరు. ఎవరూ కాదనే పని ఆమె చేయదని అందరి నమ్మకం.

అయితే గార్డెన్‌లో జాహ్నవి ఏమిచేస్తుందో తల్లికి తెలియకపోలేదు. అయినా ఆమెకు బెంగ, భయంలేదు.

"సరే—వెళ్ళి త్వరగా వచ్చేసేయ్—" అంది కృష్ణవేణమ్మ.

అప్పుడు సాయంత్రం అయిదయింది. ఇంట్లో రఘురాం కానీ, సుకుమార్ కానీ లేరు. కృష్ణవేణమ్మ ఒక్కతే వుంది. ఒక్కతే వుండడం ఆమెకు కొత్తేమీ కాదు. అందులోనూ గత ఆరుమాసాలుగా ఇదామెకు మరీ అల వాటయింది. ఎందుకంటే జాహ్నవి ఆరుమాసాలుగా ఒక్కరోజు కూడా విడవకుండా గార్డెన్‌కు వెళ్ళి వస్తోంది.

జాహ్నవి గార్డెన్ చేరుకుని తను ఎప్పుడూ కూర్చునే చోటుకు వెళ్ళింది. అప్పుడే అక్కడ ప్రతాప్ ఎదురు చూస్తున్నాడు.

జాహ్నవిని చూస్తూనే ప్రతాప్ కళ్ళలో వెలుగు కని పించింది. కానీ ఆమె కనులలో దిగులు మాయంకాలేదు.

"ప్రతాప్‌కి నేనంటే ఎంత ప్రేమ?" అనుకుంది జాహ్నవి—"ఒక్క రోజు కూడా నాకంటే ఆలస్యంగా రాడు. తనకంటే ముందు వచ్చే అవకాశం రానివ్వడు. పొరపాటున కూడా తనను పరుషవాక్యం అనడు—"

"కానీ ఏం లాభం?"—ఆమె నిట్టూర్చింది. కళ్ళలో దిగులు రెట్టింపయింది.

ఆమె అతడి పక్కన కూర్చుంది.

"జాహ్నవీ! రోజూ నిన్నిలా చూసే అవకాశం ఒక్క గంటసేపు లభిస్తే చాలు. ఎన్నేళ్ళయినా హాయిగా జీవిస్తాను. ఒక్కరోజు నువ్విలా కనపించక పోతే చచ్చిపోతాను—" అన్నాడు ప్రతాప్.

"మనమిద్దరం కలిసి చచ్చిపోయినా బాగుండేది!" అంది జాహ్నవి.

"ప్లీజ్ — అంతమాటనకు జాహ్నవీ!" అన్నాడు ప్రతాప్.

"నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. మన పెళ్ళికి అడ్డేమిటో నాకు అర్థం కావడం లేదు—" అంది జాహ్నవి.

"అడ్డు ఎవరో కాదు— నే నే!" అన్నాడు ప్రతాప్.

జాహ్నవి నిట్టూర్చింది.

"జాహ్నవీ—నువ్వు దేవకన్యవు. శాపవశాన మానవ కాంతవయ్యావు. అయితే మహారాజుల ఇంట్లో పుట్ట వలసినదానివి పొరపాటున మధ్యతరగతి కుటుంబంలో పుట్టావు. ఆ పొరపాటును ఆసరాగా చేసుకుని నిన్ను పెళ్ళాడే అర్హత నాకున్నదనుకునేటంత మూర్ఖుడిని కాదు నేను—" అన్నాడు ప్రతాప్.

"కానీ ఎంతో కొంత మూర్ఖుడివే నువ్వు! నేను దేవ కన్యనే అనుకో—రాజకుమారినే అనుకో! కానీ ఆ దేవ కన్య, రాజకుమారి చిన్నప్పట్నించీ నిన్నే కోరుకుం టోంది. కాదని ఎందుకంటావు? నాకు మనోవ్యధనెందుకు కలిగిస్తావు?"

"ప్లీజ్ జాహ్నవీ! నన్ను ఎన్నైనా తిట్టు. భరిస్తాను. మూర్ఖుడివని అను. ఒప్పుకుంటాను. కానీ నీకు మనోవ్యధ కలిగిందని మాత్రం అనొద్దు. భరించలేను. ప్లీజ్—ఆ మాట అనొద్దు—" ప్రతాప్ కళ్ళలో బాధ కనిపిం చింది.

"నాలో నీకు కనిపించిన లోపమేమిటి?" అంది జాహ్నవి.

"లోపం నాది. నీది కాదు—" అన్నాడు ప్రతాప్.

"ఏమిటా లోపం—" అంది జాహ్నవి.

"అది చెప్పకోలేను—" అన్నాడు ప్రతాప్.

"కాదు. ఈరోజదేమిటో నేను తెలుసుకునితీరాలి!"

"ఏమిటి ఈ రోజు ప్రత్యేకత?" అన్నాడు ప్రతాప్.

"మా నాన్నగారూళ్ళో లేరు. తెలుసా నీకు?"

"తెలియదు. మీ యింట్లో నీ గురించి తప్ప ఇంకేమీ తెలుసుకోను నేను...."

"ఆయన ఢిల్లీ వెళ్ళారు — నాకు పెళ్ళికొడుకును తేవడం కోసం!"

ప్రతాప్ ఒక్క క్షణం మాట్లాడలేదు. అతనోసారి అసహనంగా లేచి నిలబడి ఏమనుకున్నాడో మళ్ళీ కూర్చున్నాడు. ఓసారి నుదురు రుద్దుకున్నాడు. తనలోని భావాలను అదుపు చేసుకుంటున్నాడని చూడగానే ఎవరైనా గ్రహించవచ్చు.

"అయితే పెళ్ళిచూపులు జరుగుతాయన్నమాట!"

"అవును."

"పెళ్ళికొడుకు నచ్చితే ఏం చేస్తావు?"

"ఏం చేయమంటావు? నువ్వే చెప్పు!"

"పెళ్ళికి ఒప్పుకోవద్దు—"

ఉన్నట్లుండి జాహ్నవి కళ్ళల్లోని దిగులు మాయమై ఆ స్థానంలో చురుకుదనం కనిపించింది—"నువ్వు వద్దంటే పెళ్ళికేం కర్మ — పెళ్ళిచూపులకే ఒప్పుకోను. అయితే కారణమేం చెప్పాలో చెప్పు!"

"పెళ్ళికొడుకు నచ్చలేదని చెప్పు!"

"అప్పుడు నాన్న ఇంకో పెళ్ళి సంబంధం తీసుకొస్తారు—"

"అప్పుడూ ఇలాగే చెయ్యి—"

"ఎప్పుడూ అలాగే చేస్తాను. కానీ ఇదంతా ఎందుకోసం?"

ప్రతాప్ దిగులుగా అయిపోయాడు—"ఏమో—

నాకే తెలియదు—"

"అలాగనకు ప్రతాప్!" అంది జాహ్నవి—"ఇదంతా మన పెళ్ళికోసమని ఒక్కమాట చెప్పు. నేను సంతోషిస్తాను...."

"నీతో అబద్ధం చెప్పలేను జాహ్నవీ!"

"మన పెళ్ళి అబద్ధమెందుకవుతుంది?"

"అది నా లోపం—"

"ఏమిటా లోపం?" తీవ్రంగా అంది జాహ్నవి.

"అది చెప్పుకోలేనిది!"

"అలాగంటే కుదరదు. చెప్పితీరాలి—"

"ప్లీజ్—జాహ్నవీ—ఆ విషయం నన్నడగొద్దు—"

"అడగొద్దంటే నేను చచ్చిపోతాను—"

"అడిగితే నేను చచ్చిపోతాను—" అన్నాడు ప్రతాప్.

జాహ్నవి అతడివంక తెల్లబోయి చూసింది. ప్రతాప్ కొద్దిగా వణుకుతున్నాడు. అతనెందుకు వణుకుతున్నాడో ఆమెకు అర్థంకాలేదు.

"జాహ్నవీ! ఏ మగవాడూ ఆడదానిముందు ఒప్పుకోలేని లోపమది! చెప్పుకుందుకు సిగ్గుపడవలసిన లోపమది—నీకు ఎలా చెప్పుకోగలను? నా నోటితో అది చెప్పించాలని చూడకు. నువ్వు బలవంతపెడితే ఏమైనా చేయగలను నేను. ఆ లోపం నీతో చెప్పుకున్నాక మాత్రం—నువ్వు బలవంతపెట్టినా బ్రతకలేను నేను—" అన్నాడు ప్రతాప్.

"ఓ. కే. ప్రతాప్! నేను వెళుతున్నాను. మనం పార్కులో కలుసుకోవడం ఇదే ఆఖరుసారి! బహుశా పెండ్లి శుభలేఖలు వేసేక నే మనం మళ్ళీ కలుసు

కుంటామేమో!" అంటూ లేచింది జాహ్నవి.

"జాహ్నవీ—నువ్వు నన్ను అసహ్యించుకుంటున్నావు కదూ!"

"లేదు...."

"నామీద నీకు కోపం వచ్చింది కదూ—"

"లేదు—"

"మరి నన్ను మళ్ళీ కలుసుకోనని ఎందుకంటున్నావు?"

"ఎందుకా?" అని ఆగిపోయింది జాహ్నవి. ప్రతాప్ కారణంగా ఆమెకు మనోవ్యధ కలుగుతోంది. ఆ వ్యధ ఆమె భరించలేకపోతోంది. అతడి సమక్షంలో ఆ వ్యధ మరింత ఎక్కువవుతోంది. అయితే ఆ విషయం చెబితే ప్రతాప్ బాధపడతాడు. తన కారణంగా జాహ్నవికి వ్యధ కలిగినా సహించలేడతను. ఒకసారి ప్రతాప్ ఏమన్నాడో ఆమెకు బాగా జ్ఞాపకముంది.

"జాహ్నవీ—నువ్వు నన్ను తిడితే కోపం వస్తుంది. మళ్ళీ నేనూ తిట్టాలనుకుంటాను. కానీ అలా చేయను. ఎందుకో తెలుసా? నా తిట్లు నీ ఒంటికి ములుకుల్లా గుచ్చుకుంటున్నట్లూ నీ శరీరం కమిలిపోయినట్లూ నాకు అనుభూతి కలుగుతుంది. వెంటనే నిగ్రహించుకుంటాను-"

ఇంతగా తనను ప్రేమించే ప్రతాప్ పెళ్ళిమాట రాగానే ఎందుకు బెదిరిపోతాడు?

"జాహ్నవీ-చెప్పవేం? మరి నన్ను మళ్ళీ కలుసుకోనని ఎందుకనుకుంటున్నావు?"

"స్నేహంలోని లోపమేమిటని నేను నిన్ను అడగను. నేను కలుసుకోకపోవడానికి కారణం నువ్వు కాదు. సరేనా?" అని అక్కణ్నించి విసవిసా నడిచివెళ్ళిపోయింది జాహ్నవి.

కూతురు ఇంటికి రోజూకంటే పెందరాళే వచ్చినట్లు గుర్తించి ఆశ్చర్యపడింది కృష్ణవేణమ్మ. అయితే జాహ్నవి కళ్ళలో దిగులు మాత్రం అలాగే వుండడం చూసి ఆమె జాలిగా నిట్టూర్చింది.

కూతురి కళ్ళలోని దిగులు మాయం కావాలని ఆమె కోరుకుంటున్నది.

* * *

గార్డెన్ నుంచి ప్రతాప్ తిన్నగా ఓ బంగళాకు వెళ్ళాడు.

బంగళా చిన్నదే కానీ అందమైనది. చుట్టూ తోట ఉన్నది. తోటచుట్టూ ప్రహరీ గోడ ఉన్నది.

గేటు దగ్గర వాచ్ మన్ తో — "అయ్యగారున్నారా?" అనడిగాడు ప్రతాప్. ఉన్నారంటూనే గేటు తెరిచాడు వాచ్ మన్.

అయ్యగారు లోపల హాల్లో ఉన్నాడు. ఆయన ముందు ఓ అందాల సుందరి ఇంచుమించు నగ్నంగా ఉండి తన అందాలను ప్రదర్శిస్తోంది. అయ్యగారు దీక్షగా ఆ ప్రదర్శనను చూస్తున్నాడు.

అయ్యగారి వయసు పాతికేళ్ళకు మించదు. మనిషి బాగున్నాడు. చూడగానే డబ్బున్నవాడనీ, డబ్బు అతణ్ని పెంచిందనీ తెలుస్తుంది. అతడి ముఖానికి అందాన్నిచ్చినవి అన్నింటికీ మించి మీసాలు! సుందరి అందాలు ప్రదర్శిస్తూంటే అతడిచేయి మీసంమీదనే ఉంది.

అడుగుల చప్పుడు విని ఉలిక్కిపడి వెనక్కి తిరిగాడు అయ్యగారు. ప్రతాప్ ని చూస్తూనే— "ఓహ్—నువ్వా ప్రతాప్—కొత్త పిట్ట వచ్చింది. ఎలా ఉందో చెప్పు!" అన్నాడు.

ప్రతాప్ సుందరివంక చూడనైనా చూడలేదు—"సురేష్—నువ్వు తెచ్చుకున్న పిట్ట గురించి నన్నెందు కడుగుతావు?" అన్నాడు.

"ఎందుకేమిటి? నువ్వు నా అంతరంగికుడివి. నీకు నచ్చితే ఆ పిట్ట నీదే అవుతుంది—" అన్నాడు సురేష్.

అప్పుడు ప్రతాప్ ఆ సుందరిని చూశాడు—"థాంక్స్ వద్దులే!" అన్నాడు తడబడుతూ. అప్రయత్నంగా అతడి కళ్ళు మూతలుపడ్డాయి.

"అలా కళ్ళు మూసుకుంటావేం? అనుభవానికి అక్కర్లేకపోతే పోయె — అందాన్ని చూడ్డానికేం...." అన్నాడు సురేష్.

ప్రతాప్ కళ్ళు తెరవలేదు—"నాలోని లోపం నీకు తెలియదు. ముందామెను పక్కగదిలోకి పంపించు. అప్పుడే నేనేమైనా మాట్లాడగలిగేది!"

సురేష్ సుందరికి సైగ చేశాడు. ఆమె అక్కణ్నించి వెళ్ళిపోయింది—"ఊఁ ఇప్పుడు కళ్ళు తెరు—" అన్నాడతను.

ప్రతాప్ కళ్ళు తెరిచి — "అమ్మయ్య!" అని నిట్టూర్చాడు.

"ఏమిటి బాబూ—నాకు తెలియని నీలోని ఆ లోపం. ఒకసారి చెబితే వింటాను...." అన్నాడు సురేష్.

"అసలు ఆడదాన్ని చూస్తేనే నిగ్రహించుకోవడం కష్టం నాకు. అందులోనూ ఇలా చూస్తే చెప్పనే అక్కర్లేదు—" అన్నాడు ప్రతాప్.

"దాన్ని లోపం అనరు—ఆవేశం అంటారు—" అన్నాడు సురేష్.

"ఆవేశం కూడా ఒక లోపమేనని నా అభి

ప్రాయం—''

సురేష్ మాటమారుస్తూ—"సరే—ఇంతకీ నా పిట్ట మోహం చూసేవా, లేదా? అందంగా వుందంటావా?" అన్నాడు.

"రాజును చూసిన కళ్ళతో మొగుణ్ని చూసినట్లుంది" అన్నాడు ప్రతాప్

"ఓహ్—నువ్వు జాహ్నవిని కలుసుకుని వస్తున్నావు కదూ—అవునులే—అందంలో ఎవరైనా ఆమె తర్వాతనే కదా—" అన్నాడు సురేష్.

"అందుకు సందేహంలేదు—" అన్నాడు ప్రతాప్.

"ఏమిటి విశేషాలు?"

"చాలా పెద్ద విషయమే!" అన్నాడు ప్రతాప్.

"చెప్పు!" అన్నాడు సురేష్ కుతూహలంగా.

"జాహ్నవి ఇంక నన్ను కలుసుకోనంది. మళ్ళీ కలుసుకున్నప్పుడు పెళ్ళి శుభలేఖ ఇస్తానంది!" అన్నాడు ప్రతాప్.

"అలాగా—వరుడు ఎవరట?"

"ఇంకా తెలియదు. వాళ్ళ నాన్నగారు ఢిల్లీ వెళ్ళాడు. పెళ్ళికొడుకును తీసుకురావడానికి—" అన్నాడు ప్రతాప్.

"అంటే — రాజకుమారి జాహ్నవికి — రాజధాని నుంచి వస్తున్నాడన్నమాట—పెళ్ళికొడుకు—"

"అవును—"

"జాహ్నవి—పెళ్ళికొడుకు ఫోటో చూసిందా?"

"లేదు—"

"అయితే పెళ్ళిచూపులయ్యేదాకా ఇంకా ఏమీ తెలియదు. జాహ్నవికి నచ్చే పెళ్ళికొడుకు నేను తప్ప

ఈ భూప్రపంచంలో ఇంకొకడుంటాడని నేననుకోను—"
అన్నాడు సురేష్.

ప్రతాప్ ఇబ్బందిగా సురేష్ వంక చూశాడు. అతడు ఓసారి చేతులతో నుదురుమీద రాసుకున్నాడు. ఆవేశాన్ని అదుపులోకి తెచ్చుకున్నాడనిపిస్తుంది. తర్వాత వీలైనంత నెమ్మదిగా—"నువ్వు నీ వైపునించే ఆలోచిస్తున్నావు—" అన్నాడు.

"అంటే?"

"జాహ్నవి ఆ ఇంట అల్లారు ముద్దుగా పెరిగింది. తలిదండ్రులకు ఒక్కర్తే కూతురు. వారామెకు అన్యాయం తలపెట్టరు. పెళ్ళి సంబంధం చూశారంటే వరుడామెకు అన్నివిధాలా తగినవాడే అయుండాలి. తనకు పూర్తిగా సంతృప్తికలిగినాకనే రఘురాంగారు వరుణ్ని పిలవడానికి ఢిల్లీ వెళ్ళివుంటారు. పెళ్ళిచూపులంటే అది ఇరుపక్షాలా అని కాదు అర్థం. అది వరుడు వధువును ఎన్నికచేసే కార్యక్రమం. వరుడు నచ్చాడనితోస్తే అసలు ముందుగానే పెళ్ళిచూపులు ఏర్పాటు చెయ్యరు. వరుడికి వధువు నచ్చితే ఆ పెళ్ళి నిశ్చయమైపోయినట్లే!" అన్నాడు ప్రతాప్.

"నచ్చకపోతే?"

"జాహ్నవి నచ్చని వరుడు ఈ భూప్రపంచంలో పుట్టివుంటాడని అనుకోను—" అన్నాడు ప్రతాప్.

"యూ ఆర్ రైట్!" అన్నాడు సురేష్.

"అయామ్ ఆల్వేస్ రైట్—" అన్నాడు ప్రతాప్.

"అయితే నువ్వేమంటావ్?"

"జాహ్నవి వరుడికి నచ్చుతుంది. ఈ పెళ్ళి జరుగుతుంది—"

"ఐ డోంట్ లైకిట్ —"

"బట్ యూ కాంట్ హెల్పిట్!"

సురేష్ చేతులు వెనక్కి కట్టుకున్నాడు. కొద్ది క్షణాలు అటూ ఇటూ పచార్లుచేశాడు. తర్వాత చేతులు ముందుకు కట్టుకున్నాడు. మళ్ళీ కాసేపు అటూ యిటూ తిరిగాడు. తర్వాత అతని కుడిచేయి కిందకు వాలింది. ఎడమచేయి మీసాలమీదకు వెళ్ళింది.

"ప్రతాప్ —జాహ్నవికీ వరుడు నచ్చాడు. నచ్చితే బ్రతకడు. సరేనా?" అన్నాడు సురేష్.

ప్రతాప్ కళ్ళలో వెలుగు కనబడింది.

* * *

"రారా బాబూ—నీ కోసమే చూస్తున్నాం—" అంది ప్రతాప్ తల్లి లక్ష్మమ్మ.

"ఏమిటి విశేషం?" అన్నాడు ప్రతాప్.

"నీకు పెళ్ళి సంబంధం వచ్చింది—" అన్నాడు ప్రతాప్ తండ్రి సీతాపతి.

"చదువుకుని ఉద్యోగం చేస్తున్న మగకుర్రాళ్ళకి పెళ్ళి సంబంధాలు రావడంలో ఆశ్చర్యమేముంది?" అన్నాడు ప్రతాప్.

"అందులో ఆశ్చర్యం లేదు. కానీ చదువుకుని ఉద్యోగం చేసే మగకుర్రాళ్ళు పెళ్ళి వద్దనడంమాత్రం ఆశ్చర్యమే!" అన్నాడు ప్రతాప్ తండ్రి సీతాపతి.

"మ్యాజిక్ షో కూడా మొదటిసారి చూసినప్పుడు మాత్రమే ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. పెళ్ళివద్దని నేను రోజూ అంటున్నా మీకింకా ఆశ్చర్యంగానే వుంది—" అన్నాడు ప్రతాప్ చిరాకుగా.

"ఏమిట్రా — నీ ఉద్దేశ్యం — అసలు పెళ్ళెందుకు చేసుకోవు?" అన్నాడు సీతాపతి కోపంగా.

"ఉండండీ—చిన్న ప్రశ్నాణ్ని అడిగే పద్ధతి అదేనా-నేనడుగుతానుండండి—" అంటూ లక్ష్మమ్మ—"బాబూ-పెళ్ళెందుకు చేసుకోవు?" అంది.

"ఎలా అడిగినా నా సమాధానం మారదమ్మా—నాకు పెళ్ళంటే యిష్టంలేదు—" అన్నాడు ప్రతాప్.

"అయిష్టానికి కూడా కారణాలుంటాయి కదురా?"

"నాకు కాకరకాయకూర సహించదు. మీ యిద్దరికీ ఎంత ఇష్టం. కారణం చెప్పమంటే ఎలా?" అన్నాడు ప్రతాప్.

"పెళ్ళి వీడికి కాకరకాయ కూరలా ఉందిట!" నిరసనగా అన్నాడు సీతాపతి.

"అమ్మా—కాకరకాయ కూర చేశాను. అబ్బాయి గారికి బంగాళాదుంపలు వేయించమంటారా?" అంది లోపల్నుంచి సావిత్రి.

"అదీ నన్నడగాలా?" అని విసుక్కుంది లక్ష్మమ్మ.

"అయితే పెళ్ళి చేసుకోకుండా ఆజన్మాంతం బ్రహ్మచారిలాగుండిపోతావా?" అన్నాడు సీతాపతి.

"అలాగనీ నేననలేదే?" అన్నాడు.

"ఏరా—నీకు వేళాకోళంగా ఉందా?" అన్నాడు సీతాపతి.

"నాకు కాదు — పెళ్ళంటే మీకే వేళాకోళంగా వుంది. మీరు చేయాలనుకునే పెళ్ళి నా తృప్తికోసం కాదు. మీ తృప్తికోసం—అవునా?"

"మా తృప్తికోసమే అయితే ఆ జాహ్నవి సంబంధం కాదని ఎందుకంటాంరా—" అన్నాడు సీతాపతి.

జాహ్నవీ ప్రతాప్‌లు ఒకరంటే ఒకరు ఇష్టపడుతున్నారని అటు జాహ్నవి ఇంటా ఇటు ప్రతాప్ ఇంటా కూడా తెలుసు. లక్ష్మమ్మ జాహ్నవి జాతకం తెప్పించి చూసింది. దాన్ని పరిశీలించిన జ్యోతిష్కుడు—ఈమెను వివాహమాడాలనుకునేవాడు పెళ్ళికి నెల రోజులు అటూ యిటూలో చచ్చితీరాలని ఉందన్నాడు.

లక్ష్మమ్మ హడలిపోయింది. సీతాపతి జాతకాల్ని నమ్మనన్నాడు. లక్ష్మమ్మ నమ్ముతానంది. ఈ పెళ్ళికి ఒప్పుకోవద్దని కొడుకును బ్రతిమాలింది. ప్రతాప్ అంగీకరించాడు.

"ఇంటికి ఒక్కగానొక్క కొడుకివి. ఆశలన్నీ నీమీద పెట్టుకుని బ్రతుకుతున్నాం కాబట్టే జాహ్నవిని కోడలిగా తెచ్చుకోకూడదనుకున్నాం. నీ పెళ్ళి మా తృప్తికోసం ఎందుకవుతుంది? నువ్వూ, నీ పెళ్ళాం కలిసి కాపురం చేస్తూంటే కళ్ళారా చూడాలనేగదా—మా కోరిక!" అంది లక్ష్మమ్మ.

"కావాలంటే నా పెళ్ళి మీ తృప్తికోసమేనని ఇప్పుడే ఋజువు చేయగలను—" అన్నాడు ప్రతాప్.

"చేయవోయ్—చూస్తాను...." అన్నాడు సీతాపతి.

"సరే—అయితే నేనో అమ్మాయిని ప్రేమించాను. ఆమె జాహ్నవి కాదు. ఏ పట్టింపులూ లేకుండా వెంటనే ఆ పిల్లతో నా పెళ్ళి జరిపిస్తారా?" అన్నాడు ప్రతాప్.

సీతాపతి, లక్ష్మమ్మ ఒక్కసారే ఆశ్చర్యంతో ఆఁ అంటూ నోళ్ళు తెరిచారు. చాలాసేపటిదాకా ఇద్దరికీ నోట మాటరాలేదు. ముందుగా సీతాపతే తేరుకుని—

"ఇదన్నమాట సంగతి—ఈ విషయం ముందుగానే చెప్పి

ఏడవొచ్చుగా." అన్నాడు.

"చెప్పక ఏడ్చేది నేను కాదు—మీరు!" అన్నాడు ప్రతాప్ దురుసుగా.

"ఒరేయ్—పెద్దా చిన్నా లేకుండా నాన్నగారితో ఏమిటా మాటలు?" అంటూ లక్ష్మమ్మ కొడుకును మందలించింది.

"నేను తప్పేమన్నానమ్మా? యదార్థం చెప్పాను.."

"ఆ పిల్లెవరో చెప్పరా?" అన్నాడు సీతాపతి.

"చెబితే మీరు ఒప్పుకోరు—"

"ముందు చెప్పమంటూంటేను?"

"చెప్పి ప్రయోజనమేమిటి? మీరొప్పుకోనప్పుడు...." అని ఒక్క క్షణం ఆగి "ఒప్పుకుంటానని మాటివ్వండి ..." అన్నాడు ప్రతాప్.

"అసలు పెళ్ళే వద్దంటున్నవాడివి — ఇంతవరకూ వచ్చావు. మీ నాన్నగారితో పనిలేదు. నేను మాట ఇస్తున్నాను...." అంది లక్ష్మమ్మ.

"ఎందుకొచ్చిన మాటలమ్మా — మీరు నిలబెట్టుకోనప్పుడు...."

"ఎందుకే వాడినలా అడుగుతావు. మనకు చెప్పడానికి ఆ పిల్లెవరో వాడికే తెలిస్తేగా. వెధవకి అతి తెలివితేటలు ఎక్కువయ్యాయి—" అన్నాడు సీతాపతి.

"అతి తెలివితేటలేం కాదు—ఆ పిల్ల ఎవరో మీకూ తెలుసు—" అన్నాడు ప్రతాప్.

"ఎవరో త్వరగా చెప్పరా? ఎందుకీ డొంక తిరుగుడంతా—" అంది లక్ష్మమ్మ ఆత్రుతగా.

"ఏదో ఒకరోజున ఇది చెప్పాల్సిన అవసరం వస్తుందని నాకు తెలుసు. ఇంక దాచి ప్రయోజనంలేదు.

చెప్పేస్తున్నాను వినండి. నేను ప్రేమిస్తున్న పిల్ల పేరు సావిత్రి. ఆమె మనింట్లో వంటమనిషిగా పని చేస్తోంది."

దంపతులిద్దరూ మళ్ళీ నిశ్చేష్టులైపోయారు. తనలో కాస్త కదలిక రాగానే లక్ష్మమ్మ మొట్టమొదటగా— శివశివా — అన్నది చెవులు మూసుకుని. ఆ మాటలు విన్నాక కూడా సీతాపతిలో ఇంకా చలనం రాలేదు.

వంటమనిషి సావిత్రికి ఇరవై ఏళ్ళుంటాయి. మనిషి ఏపుగా ఉంటుంది. వంటి రంగు నలుపు. ముఖం అందంగా ఉండదు. మరీ కురూపికాకపోయినా ఒకసారి చూస్తే మళ్ళీ చూడకూడదనే అనిపిస్తుంది. దీనికి తగ్గట్టే ఆమెకు అలంకరణలో కూడా శ్రద్ధలేదు. కట్టుబొట్టు అంతా చూస్తే నలభైఏళ్ళదానిలా ఉంటుంది. ముఖాన బొట్టు పెట్టుకోదు. మొగుడు పోయాడని చెప్పుకుంటుంది. కులం తెలియదు. ఎవరింట్లో పని చేస్తే వాళ్ళ కులమేనని చెబుతుంది.

అసలామెకు పెళ్ళి కాలేదని చెప్పుకుంటే యెప్పుడు పెళ్ళి చేసుకుంటావని అడుగుతారని భయపడి అబద్ధం చెబుతుందనీ కొందరంటారు. పెళ్ళికాని కన్నె పిల్లకు వంటపనులు దొరకడం కష్టం. అంతకుమించి ఏమైనా చేయడానికి ఆమె పెద్దగా చదువుకోలేదు. పత్రికలు చదివే అక్షరజ్ఞానం మాత్రం వున్నది.

సావిత్రి గురించి అంతా ఈ విధంగా చెప్పుకుంటారు.

లక్ష్మమ్మ వీటి గురించి పట్టించుకోలేదు. సావిత్రి వంట బాగా చేస్తుంది. సహనం ఎక్కువ. ఎదిరించే స్వభావంలేదు. మగాళ్ళున్న చోటికి ఏదో వంక పెట్టుకుని రాదు. వచ్చినా ప్రమాదంలేని రూపం. షోకిల్లా గుణాలు లేవు. ఇంట్లో వున్నదో లేదో కూడా తెలియకుండా

మసలుతుంది. ఆమె చాలా గుట్టుమనిషి అని లక్ష్మమ్మ మెచ్చుకుంటూంటుంది.

అయితే అంత గుట్టుగానూ సావిత్రి యిప్పుడు తన కొడుకును వలలో వేసుకుందా?

సీతాపతి తేరుకున్నాడు — "ఒరెయ్ — నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలుసురా—" అన్నాడు. ఆయన గొంతులో ఆవేదన ఉన్నది.

"నా పెళ్ళి మీ తృప్తికోసమేగానీ నా తృప్తికోసం కాదని ఒప్పుకుంటారా? సావిత్రిని భార్యగా నేనంగీకరిస్తాను. మీరామెను కోడల్ని చేసుకుంటారా? వెంటనే జవాబివ్వక్కర్లేదు. బాగా ఆలోచించి చెప్పండి—" అన్నాడు ప్రతాప్. అతనక్కడ ఒక్క క్షణం కూడా ఆగకుండా తన గదిలోకి వెళ్ళిపోయాడు.

సీతాపతి లక్ష్మమ్మవంక చూసి—"వాడు సావిత్రిని ప్రేమించడంలేదే—ఉదాహరణ చెప్పాడు — అంతే!" అన్నాడు.

"అంతేనంటూరా?" భర్తవంక అనుమానంగా చూస్తూ అడిగింది లక్ష్మమ్మ.

సీతాపతి అంతేనని అనలేదు. ఆలోచిస్తున్నాడు.

* * *

సరిగ్గా పన్నెండు గంటలకు అలారం మ్రోగింది.

ఉలిక్కిపడి లేచింది సావిత్రి.

కళ్ళు నులుముకుంది. మూతలు పడిపోతున్నాయి. యెలాగో నిలుపుకుంది. ఆగకుండా ఆవలింతలు రాసాగాయి. వళ్ళు బొంతమీదకు వాలిపోతానంటూంటే ఆమె ఎలాగో సర్వశక్తులూ క్రోడీకరించుకుని లేచి నిలబడింది. నెమ్మదిగా వాష్‌బేసిన్ వరకూ నడిచి ముఖం

కదులుతున్నది. నీళ్ళు పుక్కిలించి ఉమ్మేసి నోరంతా శుభ్రం చేసుకుంది. తర్వాత గోడలోకి వున్న అలమారా దగ్గరకు వెళ్ళింది.

ఆమె దృష్టిని అక్కడ వున్న మెరుస్తున్న శాకును ఆకర్షించింది. దాన్ని బొడ్లో దోపుకుంది. ఓ చిన్న కాగితంతీసి—సీసాలోని కారంతీసి పొట్లంగా కట్టింది. ఆ పక్కనే వున్న రిఫ్రిజిరేటర్లోంచి నిమ్మకాయ ఒకటి తీసింది. చేత్తో పట్టుకుంది.

రెండడుగులు వేసి మళ్ళీ ఆగింది. గదిలో గోడకు పార్వతీదేవి పటం తగిలించి వుంది. సావిత్రి రెండు చేతులూ జోడించే ఆ పటానికి నమస్కరించింది.

"అమ్మా—నాకే ఆపదా కలక్కుండా కాపాడు!"

ఈ మాటలు అప్రయత్నంగా ఆమె నోటినుండి వచ్చాయి.

తర్వాత సావిత్రి చకచకా వంటింట్లోంచి బయట పడింది. ఆమె అడుగులు చకచకా పడుతున్నాయి. చూస్తూండగా ఆమె మేడమెట్లు ఎక్కి ఓ గదిముందు ఆగి—తలుపుమీద ముచ్చటగా మూడుసార్లు చప్పుడు చేసింది.

చప్పుడు చెయ్యకుండా తలుపు తెరుచుకుంది.

సావిత్రి లోపల అడుగుపెట్టింది.

ప్రతాప్ తలుపులు మూసి-"నిమ్మకాయ తెచ్చావా?" అనడిగాడు.

"ఊఁ" అంది సావిత్రి.

ఆమె కళ్లు అప్రయత్నంగా గదిలోని ఓ మూలకు పోయాయి.

అంతే! ఆమె కళ్ళల్లో భయం స్పష్టంగా కనిపించింది.

గదిలో ఆ మూల ఒక పీట వున్నది. పీటమీద చిన్న విగ్రహం. అది బేతాళునిది. చాలా భయంకరంగా వుంది బేతాళుడి ముఖం.

"అయితే ఈ రోజు బేతాళ పూజ ఉన్నదా?" అన్నదామె.

"ఊఁ"

"ప్రతాప్—ఎన్నాళ్ళకొకసారి ఇలా పూజ చేస్తారు మీరు?"

"ఇన్నాళ్ళకని నియమంలేదు. ఎప్పుడు పూజచేయమని నా మనసు చెబితే అప్పుడు చేస్తాను—" అన్నాడు ప్రతాప్.

"ఈ పూజ ఎందుకు?" అంది సావిత్రి.

"నాలోని లోపాల్ని సవరించుకునేందుకు—"

"మీలో లోపాలు యేమున్నాయి?"

"నీకు తెలుసు—"

"నాకు తెలిసి మీలో యే లోపాలూ లేవు—" అంది సావిత్రి.

ప్రతాప్ తృప్తిగా నిట్టూర్చినా ముఖం మాత్రం ప్రసన్నంగాలేదు. అతడి చూపుల్లో క్రూరత్వం తొంగి చూస్తోంది.

"నువ్వు మొహమాట పడుతున్నావు. మనమిలా కలుసుకున్నప్పుడు నీకేమనిపిస్తుంది? అసహ్య భావం కలగదూ?" అన్నాడతను.

"నిజం చెబుతున్నాను. ఈ గదిలోంచి అడుగు బయట పెట్టగానే నాకు గుర్తుండిపోయేది మీ రసికత

ఒక్కటే! అందుకే మళ్ళీ మళ్ళీ మీ గదిలో ప్రవే శించాలని ఉంటుంది—" అంది సావిత్రి.

"నేను నమ్మలేను!"

"అందుకే గదా — అన్నింటికీ సహించి మీ గదిలో అడుగు పెడుతున్నాను. మీరంటే యిష్టమే లేకపోతే మీ యింట్లో పనిచేసేదాన్ని కాదు—"

సావిత్రి అన్నమాటలు అబద్ధంకాదు. యేణార్ధం క్రితం ఆమె మరో యిల్లు చూసుకోవాలని నిశ్చయించుకుంది. ఎందుకంటే ఆ యింట్లో తిండికి లోటులేకపోయినా ఆమెను మరీ పురుగుకన్న హీనంగా చూడడం జరిగింది. తనూ మనిషిలా చూడబడాలని యే మనిషికైనా ఎంతో కొంత ఉండడం సహజం.

తనకు కలిగిన నిర్ణయాన్నామె మర్నాడుదయం లక్ష్మమ్మకు చెప్పాలనుకుంది. ఆ రాత్రే ఆమెకు ప్రతాప్ గదిలోకి తొలిసారిగా పిలుపు వచ్చింది. సావిత్రికి ఇదేమీ అంత కొత్తకాదు. సంతోషంగానే వెళ్ళింది. అయితే ఇంతవరకూ ఎవ్వరూ ఆమెను మరీ అంత శాంతతో అనుభవించలేదు. ఆమే తన సర్వస్వమైనట్లు యెంతో ఆవేశపడ్డాడు ప్రతాప్. ఆ అనుభవం ఆమెకు నచ్చింది. ఆమె నిర్ణయం మారిపోయింది. ఆ విషయం ప్రతాప్‌కీ తెలుసు.

అప్పుడు ప్రతాప్ నెమ్మదిగా అన్నాడు—"ఇందాకా మా యింట్లో నా పెండ్లి ప్రసక్తి వచ్చింది...."

"విన్నాను—" అంది సావిత్రి.

ప్రతాప్ ఉలిక్కిపడి-"యేం విన్నావు?" అన్నాడు.

సావిత్రి అంతా చెప్పింది.

"అయితే నువ్వు గానీ కొంపతీసి నేను నిన్ను పెళ్ళి చేసుకుంటానని అనుకోవడం లేదుగదా!" అన్నాడు ప్రతాప్.

కొంపదీసి—అని అతననడం సావిత్రి మనసును గాయ పరిచింది. అందుకని తల అడ్డంగా ఊపింది.

"నువ్వు మంచిదానివి. నీ స్థానం నీకు తెలుసు—" అన్నాడు ప్రతాప్.

అతడు చెప్పకపోయినా ఆమెకు అతడిలోని లోపం కొంత తెలిసింది. ఆమె బాల్లో బాకును తడుముకుంది. చేతిలో నిమ్మకాయను గట్టిగా పట్టుకుంది. ప్రతాప్ వంక అదోలా చూస్తూ — "చెప్పండి — మీలోని లోపా లేమిటో?" అంది.

"కూర్చో చెబుతాను—" అన్నాడు ప్రతాప్. ఆమె కూర్చుంది. ప్రతాప్ ప్రారంభించాడు. "ఈ రోజు నా స్నేహితుడింటికి వెళ్ళాను. అక్కడో అందాల సుందరి నగ్న ప్రదర్శన కావిస్తోంది. నా శరీరం వశంతప్పింది. అప్పుడే ఆమె కావాలనిపించింది—"

"తప్పు కదూ?"

"కాదు. నా స్నేహితుడే ఆమెను నాకు అప్పగిస్తా నన్నాడు. వద్దన్నాను—"

"ఎందుచేత?"

"అది నా మొదటి లోపం—"

"నాకు అర్థంకాలేదు—" అంది సావిత్రి.

"ఆమెనలా చూడగానే నాకు నువ్వు గుర్తు కొచ్చావు?" అన్నాడు ప్రతాప్. సావిత్రి సిగ్గుపడింది. ప్రతాప్ ఆమెను లేచి నిలబడమన్నాడు. ఆ సుందరి

యిచ్చిన ప్రదర్శన వర్ణించి సావిత్రినలా చేయమన్నాడు. సావిత్రి అందుకు సిద్ధపడబోగా—"వద్దులే—ఈ వ్యవహారం పూజయినాక ప్రారంభిద్దాం—" అన్నాడు.

పూజ అనగానే సావిత్రి శరీరంలో సన్నని వణుకు ప్రారంభమయింది. "వద్దు-పూజకు ముందే!" అన్నదామె.

"ఎందుకని?" అన్నాడు ప్రతాప్.

"పూజ తరువాత నేనుత్సాహంగా వుండలేను—" అన్నదామె.

ప్రతాప్ కళ్ళు చిత్రంగా మెరిశాయి — "కుదరదు సావిత్రీ—పూజకు ముందు శృంగారం పనికి రాదు—" అన్నాడతను.

సావిత్రికి పూజ గురించి తల్చుకుంటేనే భయంగా వుంది. అందుకని ఆమె మాట మారుస్తూ—"ఆ సుందరిని చూడగానే నేనెందుకు గుర్తొచ్చాను?" అంది.

"యేమో — ఏ అందగత్తెను చూసి నా మనసు చలించినా అప్పుడు నాకు నువ్వే గుర్తుకు వస్తావు. నువ్వే కావాలనిపిస్తుంది—" అన్నాడు ప్రతాప్.

"ఆ అందగత్తె కావాలనిపించదా?"

"అనిపించదు. కానీ నీలో ఆ అందగత్తెను చూసుకోవాలనిపిస్తుంది. చూసుకోగల్గుతాను కూడా—" అన్నాడు ప్రతాప్.

"సందేహంలేదు. ఇతడు నన్ను ప్రేమిస్తున్నాడు—" అనుకుంది సావిత్రి. కానీ ఆ విషయం అతడికే తెలుసునో లేదోనని ఆమె అనుమానం. పైకిమాత్రం— "ఇది చాలా విచిత్రంగా ఉంది—" అంది.

"ఇదే నాలోని రెండవ లోపం—" అన్నాడు ప్రతాప్.

"ఇంకా ఎన్ని లోపాలున్నాయి మీలో?" అనడిగింది సావిత్రి.

"జాహ్నవి నన్ను ప్రేమిస్తోంది. నేనూ ఆమెను ప్రేమిస్తున్నాను. అయితే ఆమె నన్ను పెళ్ళిచేసుకోమంటుంది. నాకది ఇష్టంలేదు—"

"ఎందుకని?" అంది సావిత్రి.

"పెళ్ళి అనగానే పడకటింటి అనుభవం గుర్తొస్తుంది. ఆ అనుభవం నీతో తప్ప మరెవ్వరితోనూ ఊహలో కూడా భరించలేదు నేను. అందుకే జాహ్నవిని పెళ్ళి చేసుకోలేనని కూడా చెప్పేశాను-" అన్నాడు ప్రతాప్.

"అలా చెప్పడమే మంచి పని. లేనిపక్షంలో ఆమె మీకోసమే ఎదురుచూస్తూ ఉండిపోయేది. ఇప్పుడామె మరో వరుణ్ని వెతుక్కుంటుంది—" అంది సావిత్రి.

"కానీ...." అన్నాడు ప్రతాప్ — "జాహ్నవి అందం అసామాన్యమైనది. ఆమెను ప్రేమించినవాడెవ్వడూ ఆమె పరుల సొత్తు కావడం సహించలేడు. ఆమెను వివాహమాడడానికి ముందుకు వచ్చినవాడు పెళ్ళయ్యేదాకా కూడా బ్రతకడు. జాహ్నవికి చాలా మంది ప్రేమకులున్నారు. వాళ్లు వాడిని బ్రతకనివ్వరు. ఎంతమంది వరులు ముందుకొస్తే అంతమందీ చావవలసిందే. జాహ్నవికి పెళ్ళికుదిరిందంటే రక్తం ఏరులై ప్రవహించాల్సిందే—అసలిది ఆమె జాతకంలోనే ఉంది—"

"బాగుంది. ఎవరో ఒకరు ఆమెను పెళ్ళాడి ఆమె

జీవితం తీర్చిదిద్దాలనుకోవాలి గానీ — ఆమెను నేను పెళ్లాడను, మరెవ్వరూ పెళ్లాడ్డానికి వీల్లేదు — అంటే ఆమె జీవితం ఏమైపోతుంది?" అంది సావిత్రి.

"ఎంతోమంది చేత ప్రేమించబడిన ఆడదానికి కష్టాలు తప్పవు— ...."

"మీ ప్రేమకూడా అలాంటిదేనా?"

"బహుశా ఇది నా మూడో లోపమనుకుంటాను ...." అన్నాడు ప్రతాప్.

సావిత్రి ఆశ్చర్యంగా అతడివంక చూసింది— "ఈ లోపాలు సవరించుకోడానికి మీరే ప్రయత్నాలూ చేయడంలేదా?" అని ఉలిక్కిపడింది. జవాబు ఆమెకు తెలియకేం? కొద్దిక్షణాల క్రితమేకదా అతడు చెప్పాడు- తను చేసే బేతాళ పూజ తనలోని లోపాల్ని సవరించు కోడానికేనని.

ప్రతాప్ బదులు ఇవ్వలేదు. తమాషాగా నవ్వాడు.

"అసలు నీలోని పెద్దలోపం ఇదే!" అనుకుందామె మనసులో. నన్నింతగా కావాలనుకుంటున్నావు. కోరు కుంటున్నావు. సుఖపెడుతున్నావు. మరో ఆడదానికి నీ మనసులో స్థానంలేదు. కానీ అలాంటప్పుడు ఏమిటిది? ఈ పూజ ఎందుకు?

ఈ లోపం సవరించబడాలంటే ఏం చేయాలో?

"పూజకు వేళ అవుతోంది!" ప్రతాప్ ఆమెను హెచ్చరించాడు.

సావిత్రి తన చేతిలోని నిమ్మకాయను అతడి చేతిలో ఉంచింది.

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లి మెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ము ఖ చి త్రా ల కు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతితోపాటు 5 నెలలు "సప్లిమెంట్" కూడా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.



# క్రైమ్‌లో తమాషాలు

## లాభించిన వైరం

రాజాపురంలో ఒకప్పుడు వచ్చిన గాలీ వర్షానికి బడి కాస్తా కూలిపోయింది. ఏనాటిదో కావడంవల్ల వున్న ఒక్క బడీ కూలిపోయింది. ఇటు విద్యార్థులకు చదువూ, అటు ఉపాధ్యాయులకు ద్యోగాలూ పోయే పరిస్థితి ఎదురైంది.

ప్రధానోపాధ్యాయుడు గ్రామ పంచాయితీ అధ్యక్షుడిని పాఠశాలకు కొత్త భవనం కట్టించి ఇవ్వమనికోరాడు.

"మీ పిల్లలూ, మీ వుపాధ్యాయులూ గ్రామంమీద పడి చందాలు వసూలు చేసుకోండి. పిల్లలకు చదువులు సాగాలన్నా, మీకు వుద్యోగాలు నిలబడాలన్నా మీ బడిని మీరే నిర్మించుకోవడం ఉత్తమం!" అన్నాడు పంచాయితీ అధ్యక్షుడు.

ప్రధానోపాధ్యాయుడికి ఆయన ప్రవర్తన బాధ కలిగించింది. ఆయన పంచాయితీ అధ్యక్షుడుగా నిలబడే ముందు గ్రామం బాగోగులు తనవేనంటూ వాగ్దానాలు చేశాడు.

ప్రధానోపాధ్యాయుడు రామసూరిని కలిశాడు. రామసూరి పంచాయితీ అధ్యక్షుడిమీద పోటీచేసి ఓడిపోయాడు.

మరునాడే పాఠశాల భవన నిర్మాణానికి రాయిపడింది.

పంచాయితీ అధ్యక్షుడు రాతిని చూసి ఆశ్చర్యపోయాడు. ప్రధానోపాధ్యాయుడిని పిలిచి అడిగాడు. "పాఠశాల భవనానికి డబ్బు ఒక్కరోజులోనే సమకూడిందా?"

"రామసూరిగారే మొత్తం డబ్బు చందాగా యిచ్చారు!" అన్నాడు ప్రధానోపాధ్యాయుడు.

"రామసూరికి అంత బరువు పెట్టవద్దు. పాఠశాల నిర్మాణం పంచాయితీ చేపట్టుతుంది" అని అనడమేగాక పంచాయతీ అధ్యక్షుడు నెల రోజులలో భవనం కట్టించాడు.

"అసాధ్యమైన పనిని సాధించారు! కృతజ్ఞతలు!" అన్నారు వుపాధ్యాయులు ప్రధానోపాధ్యాయుడితో.

ప్రధానోపాధ్యాయుడు కృతజ్ఞతలు నాకుకాదు. రామసూరిగారికి. ఆయన కేవలం పునాది రాయి వేశారు. పంచాయితీ అధ్యక్షుడికీ తనకీ మధ్యవున్న వైరాన్ని లాభసాటిగా వుపయోగించుకోనిచ్చారు!" అన్నాడు.

—ఎమ్. శిరీష, విశాఖపట్నం.

## కష్టమెక్కువ?

ఒక సినీనటుడు ఔట్‌డోర్ షూటింగుకై వెళుతున్నాడు. మార్గమధ్యంలో అతని కారు ఓ పల్లెటూరుగుండా వెళ్ళసాగింది. ఓ బావిదగ్గర అతని కారు బురదలో కూరుకుపోయింది. సహాయానికై చుట్టూ చూసి అరిచాడు. వెంటనే ఓ మనిషి వచ్చాడు. "అయ్యా మీ: కారును బయటకు తీస్తాను. కానీ ఓ పాతిక రూపాయలు ఇవ్వాలి" అడిగాడు.

సినిమా నటుడు చాలా తొందర్లో వుండటంవల్ల సరే అన్నాడు. అతడు ఎలాగో ఓలా కారును బయటకుతీశాడు.

పాతిక రూపాయల్ని ఇస్తూ సినిమానటుడు ఇలా అన్నాడు "రోజూ ఇలా ఓ వంద సంపాదిస్తావా సులభంగా?"

"ఎక్కడసార్, చీకట్లోనే లేచి ఏటైై అరవై బిందెల నీళ్ళు పోస్తేనేకదా ఆదాయం" అన్నాడు అతడు.

—చాగాపురం నాగేశ్వరరావు, గద్వాల.

